# హిందూదేశము:

# క్రైస్తవప్రభుత్వ నిర్మాణతత్త్వము

(మేజరు, బి. డి. బాసు, ఐ. ఎమ్. ఎస్.)



అనువాదకుడు:

మహీధర జగన్మోహనరావు.

సాహిత్యమాల – ౨

# హిందూదేశము:

# క్రైస్తవ ప్రభుత్వ నిర్మాణ తత్త్వము

(శ్రీ॥ శే॥ మేజరు బి. డి. బసు; ఐ. ఎమ్. ఎస్.)

నవంబరు ౧౯౩౫.

అనువాదకుడు

ఏ. హింధర జగన్మోహనరావు.

# రెండే మాటలు !!

నేడు ప్రపంచం అంతా తన తన సాహిత్యాన్ని సర్వతో ముఖంగా వ్యాప్తం చేసుకుంటూంది. కార్యవాదియై యున్న ఈ విశాల ప్రపంచంలో ఒక్క ఆంధ్రుడే చేతులు ముడుచుకొని కూర్చుండి యున్నాడు. జాతీయాన్నత్యానికి తోడుపడే సాహిత్యంమాట ఆతడు మరచియే పోయేడు ప్రాచ్య- పాశ్చాత్య భాష లన్నింటిలోనూ, దినదినానికీ, అన్ని శాఖలలోనూ, నూతన తేజస్సుతో వేనకువేలు గ్రంథాలు వెలువడుతున్నాయి. కాని ఆంధ్రభాషలో?—

మనకి కావలసినది వినోదకరమైన వాఙ్మయం కాదు. హాస్యమూ పేరిట అసభ్య గ్రంథములు కావు. జాతికంతకీ నూతనోత్తేజం కలుగజేయగల వైజ్ఞానిక గ్రంథాలు కావాలి. చారిత్రక గ్రంథాలు కావాలి. ఆర్థిక- రాజకీయ- పారిశ్రామిక వాఙ్మయం విస్తారంగా ప్రకటించబడాలి. నాడే మనభాష జీవంతో ఉందని అనవచ్చు. ఆంధ్రులు తమ కర్తవ్యం మరచిపోలేదని చాటవచ్చు!—

మన సారస్వతంలో యుత్తమోత్తమ గ్రంథాలు— సామాన్య ప్రజలందరికీ అందుబాటులో ఉండేటట్లు— ప్రకటించడానికి ప్రయత్నిస్తూ వున్న గ్రంథమాలలకి- పత్రిక

లకే చేయూత నిచ్చి, "ఆంధ్రులు చదవడమే కాని- కొన
డం ఎరగ" రనే అప్రతిష్ఠని పోగొట్టుకోనడం మన విధా
యకం. అందులోనే ఆంధ్రజాతికి గౌరవం ఉంది.

ఓ ఆంధ్రుడా! ఇప్పుడు నీ కర్తవ్యం ఏమిటి ?

# ఉపక్రమణిక

మన భారతదేశములో చారిత్రకయుగమునుండియు ననేక సామ్రాజ్యములు పుట్టినవి, పాలించినవి, యంత రించినవి. కాని వాటిలో నేదియును, యీ బ్రిటీషు సామ్రాజ్యము నంత విశాలమైనదియు, సుస్థిరమైనదియు నై యుండలేదు. హిందూదేశీయులలో చాలమందికి 'యీ ఆంగ్లసామ్రాజ్యమున కెన్నటికిని చలనమే లేదను' యభిప్రాయము కలుగజేసినట్టి, యీ పరిపాలనావిధాన మేయే సూత్రములపై నాధారపడి యున్నదో తెలిసికొనుట ప్రతిభారతీయునికిని ప్రథమకర్తవ్యము. ఈ విషయమే సంగ్రహముగా నీ చిన్నగ్రంథములో చదువగలరు.

దీనిని సుప్రసిద్ధ చరిత్రకారుడును, దేశభక్తుడును యగు మేజరు బి. డి. బాసు మహాశయుడు తొలుత వ్యాసరూపమున రచించి 'మోడరన్ రివ్యూ' యందు ప్రకటించి యున్నాడు. తర్వాత నా యీ వివిధవ్యాసములను స్వల్పమార్పులతో, కూర్చి 'Consolidation of the Christian Power in India' యనుపేర నొక గ్రంథరూపమున ప్రకటించెను. ఆ గ్రంథము ననుసరించియే దీనిని వ్రాసి, ఆంధ్రమహాజనుల యెదుట బెట్టియున్నాము. భారతదేశములో బ్రిటీషు ప్రభుత్వము సుస్థిరముగా నుండు

నట్లు చేయుట కెట్టి విధానము లవలంబింపబడినవో తెలిసి కొనుటకీ గ్రంధము చాలవరకు తోడ్పడగలదు.

ఈ గ్రంథమున 'హీథెన్' యను శబ్దము, తరచు గా ప్రయోగింపబడినది. క్రైస్తవులు, తమ మత మొక్కటియే సత్యమైన దనియు, అట్టి సత్యమతమందు విశ్వాస ముంచనివారందరును పతితు లనియు పరిగణించి, వారిని 'హీథెన్' లని పిలచి నిరసింతురు. హిందువుల మ్లేచ్ఛశబ్దము, మహమ్మదీయుల కాఫిర్ శబ్దము, క్రైస్తవుల 'హీథెన్' శబ్దమును ఏకభావసూచకములు. 'బ్రిటీషు ప్రభుత్వ నిర్మాణతత్త్వము' అనుటకు బదులు 'క్రైస్తవప్రభుత్వ' మనుటలోగల యుద్దేశ్యమును గ్రంథకర్తయే యంతిమాధ్యాయమున సూచించి యున్నాడు. పాఠకు లది గమనింతురు గాత.

గ్రంథకర్త.

# విషయసూచిక

# ౧. స్వదేశసంస్థానముల సంరక్షణ

ఈస్టు యిండియా కంపెనీ, తమ పరిపాలనా కాలములో, స్వదేశసంస్థానములు పెక్కింటిని ఆక్రమించి, తమ రాజ్యములో కలుపుకొన్నారు. దురాశాపరులైన కంపెనీవారికి, వారితరఫు ప్రతినిధులకి, దూరాలోచన యేమాత్రమూ లేకపోయినది. దూరాలోచనాపరులూ, మహామేధావులూ, అయిన బ్రిటీషు రాజనీతిజ్ఞులనేకులు, యీ స్వదేశ సంస్థానాక్రమణపద్ధతి, అనర్థదాయక మని మొఱపెట్టినా, అప్పటిలో లాభం లేకపోయినది. ఈపద్ధతి న్యాయదృష్టిలోను, రాజకీయంగాను, ఆర్థికంగానూకూడా మంచిది కాదని యెంతమంది చెప్పినా, లక్ష్యంచేయక కంపెనీవారు, తమ మార్గమునే అనుసరించిరి. తత్ఫలితంగా సిపాయీలకలహం జరుగుటయు, కంపెనీప్రభుత్వం పోయి, రాణీప్రభుత్వంలోనికి, భారతదేశాన్ని తీసికొనుటయు, తటస్థించినది. ఈ కలహానికి పూర్వమునుండియు, యిండియా రిఫారమ్ సొసైటీవారి రచనలూ, పార్లమెంటు మెంబర్ల విమర్శనలూ, సింహాసనభ్రష్టులైన దేశీయప్రభువులు తమ యేజంట్లద్వారా యింగ్లాండులో జరిపిన ఆందోళనలూ కూడ, యింగ్లాండుప్రజల అభిప్రాయాన్ని, యీ

హిందూదేశము:

ఆక్రమణ విషయంలో, కొంతవరకు ఓర్పుగలిగినవని కూడ చెప్పవచ్చును.

'జాన్ సల్లివాన్' అను బ్రిటీషుప్రముఖు డాసోజులలో, హైందవరాజుల రాజ్యాక్రమణవిషయములలో తీవ్రముగా విమర్శించెడివాడు. 1858 లో, అతడు "మనము సంధిషరతుల ననుసరించుచుంటిమా" యను కరపత్రమును ప్రచురించి, స్వదేశప్రభువుల విషయంలో జరుగుచున్న అక్రమములను తీవ్రముగా ఖండించెను. అందులో,

"హిందూదేశమును గురించిన సమస్య యేదైనను వచ్చినపుడు, మన మీ క్రిందివిషయముల నయిదింటినీ, బాగుగా ఆలోచించనిదే, యేపనియు చేయకూడదు.

మొదటిది: 'అది న్యాయసమ్మతమా ?'

రెండవది: 'ప్రజల ప్రవర్తన నభివృద్ధి చేయునా ? పాడుచేయునా ?'

మూడు: 'వారికి మనయందు ద్వేషభావము గలిగించునా ? లేక మనయందలి ప్రేమను వృద్ధిబొందించునా ?'

నాలుగు: మనప్రభుత్వమునకు బలము గలిగించునా? లేక కూకటివ్రేళ్లతో పెల్లగించునా ?'

అయిదు: 'ఆర్థికంగా మనకు లాభకరమా ? నష్టదాయకమా ?"

ఆంగ్లేయులను మొదటి నాలుగుప్రశ్నలూ యేమి యు చలింపజేయలేకపోయినవి. న్యాయముగాని, కాక పోనీ, ప్రజలకు కష్టనష్టదాయకముగానీ, బ్రిటిషువారి కేమిబాధ ? అనాగరికులు, 'హీదెన్'లు అయిన యీ దౌర్భాగ్యభారతీయుల, సదభిప్రాయమునకు, ఆంగ్లేయు లేమీ మొగంవాచిపోలేదు. ఆక్రమించుచున్న ప్రతి అం గుళమును, వారికి లాభమే కాదా ? ఆ కరపత్రములోనే సల్లివాన్ మహాశయుడు మరియొకచోట యిట్లు వ్రాసి యున్నాడు.

“మన ప్రభుత్వంలో యేపెద్దఉద్యోగములోనూ దేశీయులకు స్థానం లేదని ప్రచురించితిమి. క్రైస్తవమతం స్వీకరించి, నాగరకులయిననేగాని, మనతో మాట్లాడుట కర్హత లేదని తెలియజేసితిమి దేశీయులకు, పూర్వపు మహారాజులు, నవాబులు యిచ్చిన జాగీరులు, యీనా ములు లాగివేసికొంటిమి. అంతటితోనైన చాలించిన మన యెక్కువ యేమున్నది. గొప్పరాజులనే పదభ్రష్టు లను జేసి, వారిరాజ్యములను ఆక్రమించితిమి. అక్కడ మనదేశస్థులకు సర్వసౌకర్యములను కలుగజేసి, దేశీయు లను అనాధులను చేసితిమి. గత పదసంవత్సరములలోను, అయిదు సంస్థానములను, రూపుమాపి పొట్టను బెట్టికొం టిమి, దేశీయుల నష్టము లెక్కింపరానిది. పాపము,

దయతలచి యీమధ్య, కొంచెం చిన్న యుద్యోగాలు, వారికి యిచ్చితిమి. రాజ్యములు లాగుకొని, పిడికెడు గింజలు ముష్టిగా బ్రతుకమంటిమి. దేశీయులు పోగొట్టుకొనిన ప్రతిష్ఠయు, మనకు లాభమే కదా! ఇంతియేగా! ఒక రాజ్యాన్ని ఆక్రమించినప్పుడు, మనతాలూకు తాబేదారు 'కమీషనర్' పేరుతో వెళ్ళి, రాజ్యమును స్వాధీనము చేసికొని, అంతవరకూ అధికారంలోనున్న డజన్లకొలదీ దేశీయులను తీసివైచి, తనసహచర్లు నలుగురతోనే, వ్యవహారములు నిర్వహించుకొనుచుండును. రాజు పోషించుచున్న వేలకొలది సిపాయీలను తొలగించి, కొద్దిమంది సోల్జరులతో, తమప్రభను వెలుగబెట్టును. రాజసభలు మాయమగును. వర్తకము క్షీణించును. వ్యవసాయ మడుగంటును. పరిశ్రమలు నాశనము చేయబడును. ప్రజలు బీదవారగుదురు. ఆంగ్లేయుడు, గంగాతీరమందలి, అపారధనసంపదను, జలగవలె పీల్చి, తెగబలిసి, థేమ్సు నదీతీరమునకు వచ్చి చేరుచుండును."

కాని 'సల్లివాన్' మహాశయుని చదువులేవీ, కఠిన హృదయులైన, యీ బ్రిటిషు క్రైస్తవుల హృదయములను, కరగించలేకపోయినవి. సంస్థానాక్రమణతత్వము న్యాయము కాకపోయిన నేమి? ప్రజల అభివృద్ధి నరికట్టునదైన వారికి బాధా? ఇండియాప్రభుత్వానికి, నేమ

టూ నష్టము వస్తే, యెవరికి నొప్పి? వారి సరకులకు, తగిన విక్రయస్థానములు దొరకవలెను. వారి దేశీయులకు వేల కొలదీ జీతములిచ్చి పోషించెడి వారుండవలెను. శాసుల మాటలు కావలెనేగాని, పరోపకారమూ, సోదరమానవుల క్షేమాభివృద్ధీ, యెవరికి కావలెను? అందుచే 'పీ-థెన్'లు, అనాగరికులు నగు, యీ దేశీయప్రభువులకు, చూపు యీఆదరణ, తమకే భంగకరమని తెలియచెప్పిన గాని, వారికి నాటదు.

అందులకే 1853 లో యిండియా రిఫారమ్ సొసైటీవారు ప్రచురించిన, 2-వ నంబరు ట్రాక్టులో యీవిషయములు వివరింపబడెను.

"మనకు రాబడి మూడు కోట్లయినా హెచ్చలేదు. కాని ఋణము ఆరుకోట్లు పెరిగినది. దీనికితోడు, యేటా రాబడిలో, లోటును భర్తీచేయుటకై కొత్తఋణములు, చేయుచునే యున్నాము."

"నూటికి అయిదుచొప్పున తెచ్చిన సొమ్ముతో, నూటికి మూడుకూడ రాబడిలేని, భూములను కొని పోగుచేసెడి, భూదాహముకలవాని పద్ధతిలాగునన్నదేకాని, రాజ్యపాలనావిధానంవలె కాన్పించుటలేదు. యుద్ధంలో జయించడానికి ఫలితం కొత్తరాష్ట్రాలు కలుపుకోవడమే,

యను అభిప్రాయమే, మన కీ 'భూదాహము' కలుగుటకు కారణము. రెండవది స్వదేశీప్రభువులకు లాభదాయక ముగా నున్న, యీ రాజ్యపాలన, మనకిమాత్రం, రాబడికి కారణ మవకపోదా ? కాని యీవిషయంలో హేస్టింగ్సు, క్లైవుల, అభిప్రాయమును చూడుడు. బంగాళమును మించి మనము రాజ్యమును సంపాదించిన, అది మనకి భారభూత మగుటయేకాక నష్టదాయకముకూడా నని వారు స్పష్టంగా, చెప్పియున్నారు. ఆర్థికముగా చూచిన, వారి యభిప్రాయము నిశ్చయమే. ఎక్కువ విస్తీర్ణముగల రాజ్యమూ, యెక్కువ ఋణం ! ఎందుచేతను ? దేశీయులు పొందినంతలాభము, పరదేశీయులు పొందజాలరు."

"చూచియే యుంటిమి గదా, భూములు విస్తీర్ణము పొందుతూ వున్నంతవరకు, మన బాధ్యతలుకూడ యెక్కువ యగుచున్నవని. 1792 లో మనకు ఖర్చులు పోను, నికరాదాయం, పదిలక్షల పౌనులు. ఆ సంవత్సరమువరకు మనకున్న ఋణము, ఒక సంవత్సరాదాయముకన్న తక్కువే. మనం స్వదేశసంస్థానములను కలుపుకొనుట ప్రారంభించిన దావత్సరమే. మన రాజ్యవిస్తీర్ణము బాగా పెరిగినది, కాని యేడాదికి పదిలక్షల పౌనులు నికరనష్టము."

“ఈ విధానమే, అవలంబింపబడుచో, మరల క్రొత్త అప్పులు తీసికొనిరావలసిన, అవసరము కలుగును. ప్రతీయేటాలాగే, యీ సంవత్సరముకూడ ‘ఛాన్సలర్ ఆఫ్ ఎక్స్చెకర్’ ఋణపత్రములను వ్రాయవలసి యుండును. మీకందరకును, యీ వ్రాతవల్ల కష్టము కలుగవచ్చును. కాని ఉన్నపరిస్థితు లివి యని చెప్పక తప్పదు.”

ఈ సంఘకార్యదర్శియయిన ‘జాన్ డికిన్సన్’ యీ కరపత్రాదులనే గాక, యింక రెండింటినికూడ, యీవిషయములో వ్రాసెను. 4-వ నంబరు కరపత్రము ‘భారత దేశమందలి స్వదేశసంస్థానములు’, 9-వ నంబరు కరపత్రము ‘స్వదేశప్రభువుల పరిపాలనక్రింద రాజ్యపరిస్థితులు’. వీటిలో, స్వదేశ రాజుల పరిపాలనాసౌష్ఠవము, విదేశీయ క్రైస్తవ నాగరక ప్రభుత్వ పరిపాలన కేవిధమునను తీసిపోవదని, చాటబడి యున్నది. కాని 1853 లో యీ సంఘమువారు ప్రచురించిన కరపత్రము లేమీ, ఉపయోగకారులు కాలేదు. ఇంగ్లాండులో గాని, హిందూదేశములో గాని, తెల్లవారిలో, యీ కరపత్రాలు సంచలనము కలుగచేసినట్లు కాన్పించదు. ఇందుకు తార్కాణముగా 1854, 1856 సంవత్సరములలో నాగపూరు, అయోధ్యా రాజ్యములు రెండును, ఆక్రమించబడి, బ్రిటీషు రాజ్యవిస్తీర్ణమును వృద్ధిచేసెను.

హిందూదేశము:

మహమ్మదీయరాజ్యమగు అయోధ్యను ఆక్రమించినతర్వాతనే, సర్ ఎర్స్కిన్ పెర్రీ, యీ ఆక్రమణావిధానమును ఖండించుచు, యిండియాప్రభుత్వముకు రాబడి తగ్గిపోయి ఋణమగుటకు కారణ మదియేయని, 1856 యేప్రిలు 18 తేదీని, తీవ్రోపన్యాసము నిచ్చెను.

"ప్రతి ఆక్రమణవల్లను లక్షలకొలది ధనము ఖర్చు అగుటయేగాక, మన బాధ్యతలు వృద్ధి యగుచున్నవి. యుద్ధపుఖర్చులకుతోడు రివెన్యూపద్ధతి మార్పువల్లకూడ చాలనష్టము గలుగుచున్నది."

"ప్రతిరాజ్యమును ఆక్రమించుటకును, తర్వాత రక్షించుటకును, అగు సైనికవ్యయమునకు పరిమితి లేకుండ నున్నది."

"ఇంతియేగాక రాజ్యాక్రమణనలన యేలాభమైన నుండునన్నచో, దానికంటె, మనమే యేర్పరచికొన్న సంధినిబంధనలను, ఖరారులను అతిక్రమించుటచే, బ్రిటీషువారి న్యాయపరత్వమునకు మాయనిమచ్చయై, దేశీయులకు మనయందలి విశ్వాసము నశింపజేసి, ముందు ముందు, పెక్కుమడుంగులు నష్టము రాగలదు."

తరువాత నాతడు, తన తీవ్రోపన్యాసము నిట్లు ముగించెను.

"మనము జరగిందానికి వగచి పనిలేదు. ఈ మహామహులసభలో, నావంటి యల్పజ్ఞుఁ డుపన్యసించిన విను వారుండరు. కాని ముందు భవిష్యత్తు అనునదే లేనిచో, నేను మాట్లాడక పోయియుందును. ఆక్రమణతత్త్వమును ప్రోత్సహించువారి యాశలు తీరునట్లు లేవు. ఇండియన్ ప్రెస్, ప్రముఖులచే ప్రోత్సహించబడి నైజాము రాజ్యమునుకూడ ఆక్రమించుటకు వేగిరపెట్టుచున్నది. తర్వాత ప్రత్తి, నల్లమందు పంటలకు ప్రసిద్ధిజెందిన, మాల్వాదేశము, తన నల్లనేలలతో ఆశ జనింపచేయుచున్నది. అంతకంటె సారవంతమై, వ్యవసాయదారులకు ప్రసిద్ధి జెందిన, గుజరాతు కూడ మాల్వాకు ప్రక్కనే యున్నది. రాజపుత్రస్థానమును మాత్రము వదలిపెట్టగలమా ? ఆరుగోట్ల ప్రజలకు, నివాసభూమియైన, ఆ వీరభూమిని కూడ, మనము వినాశనము చేయకుండ గలమా ?"

"ఈకారణము లిట్లుండనిండు. ఆర్థికముగా చూచినను, యీ ఆక్రమణసూత్రము మనకు అనుసరణీయముగా కాన్పింపదు. ఈ విషయమును బాగుగా నాలోచింపనిదే, సభవారు తమసమ్మతి నొసంగరని కోరుచున్నాను. కాని యింతకన్న ముఖ్యముగా గమనింపవలసిన విషయము లున్నవి. వాటిని ఆక్రమించుటకు మనకు హక్కు ఉన్నదా ? భగవంతుని దృష్టిలోగాని, మానవుని

దృష్టిలోగాని, మనము చేయుచున్నపని న్యాయసమ్మత మా? మన మవలంబించిన పవిత్ర క్రైస్తవ మతమును, న్యాయమార్గానువర్తనుల మను మన జాతి అహంకార మును, అవమానపరచినవారమై, తూర్పు దేశములలో మనకున్న పలుకుబడిని, గౌరవమును, గోల్పోయినవార మగుదుము. ఈ సందర్భములో, నే ప్రచురించిన కొందరు ఆదర్శపురుషుల యభిప్రాయములనుగూడ పర్యాలోచించి, యీ విషయములోనికి విచారణ సల్పి, భగవానునిచే మన కివ్వబడిన భారతదేశ పరిపాలనాభారమును సవ్యమార్గములో నిర్వహించవలయును. దూరదృష్టియు, అంత రాత్మయు లేని, మన హిందూదేశోద్యోగులు, యీ అన్యాయ కార్యములకు ప్రోత్సహించుచునే యుందురు. కాని యీసభవారు తమ ధర్మమును, బాధ్యతను గుర్తించి, యీ విషయములో వారిని శాసింప గోరుచున్నాను. కడకు నే జెప్పున దేమన న్యాయమును, హక్కులను, గమనింపకుండ, మనము రాజ్యకాంక్షతోనే, పని చేసినచో, మనజాతికి చెడ్డపేరు తెచ్చుటయే గాక, తూర్పుదేశములలో మన ప్రభుత్వము త్వరలో రూపు మాసి పోవుటకు, కారణులము గాగలము.”

సర్ ఎర్స్కిన్ పెర్రీయొక్క భవిష్యద్వాణి నిజమే యయ్యెను. ‘తూర్పుదేశములలో, మన ప్రభుత్వము త్వ

రలో రూపు మాసిపోవుటకు' తగు ఘటనలు. సంవత్స రము తిరుగకుండగనే తటస్థించెను. స్వదేశసంస్థానములను మ్రింగివేయు పద్ధతిని మానుకొన్నది, సిపాయీల కలహా ముతరువాతనే, యీ బ్రిటీషుక్రైస్తవులు.

రాజ్యభ్రష్టులైన, యీ నిర్భాగ్యపు 'హీథెన్' ప్రభువులు, తమ యేజంట్లను యింగ్లాండుకు పంపి, లక్షల కొలదిగా ధనము ఖర్చుచేసికొని, న్యాయవాదులను బెట్టి వాదించియు, ప్రయోజనమును పొందలేకుండిరి. ఒక్క-విష యములోకూడ వీరిప్రయత్నములు, సఫలములు గాలేదు. విగ్రహారాధకులగు హిందువులను, విగ్రహారాధకులు కానిమహమ్మదీయులనుకూడ, వారు సమానముగానే చూ చిరి. స్త్రీలను, పురుషులను కూడ, అభేదభావముతోనే ఆదరించిరి. బీదలను, ధనవంతులను ఒక్కలాగుననే గౌర వించిరి. సతారా సింహాసనభ్రష్టుడైన మహారాజుయొక్క యేజంటు 'రంగో బాపూజీ'ని, వారేవిధమున అవమా నించి, అమానుషముగా చూచినదియు, 'సతారాకథ నము*'ను చదివినవారికి తెలియకపోదు. అయోధ్యనవా బుయొక్క వృద్ధమాతను పెట్టినపాట్లు, 'Decoite in Excelsis' యొక్క అనుబంధములో మీరు చూడగలరు. కాని యీ యేజంట్ల ప్రచారము కొంతవరకైనను, యిం

* 'The Story of Satara' By the same author.

గ్లాండుప్రజలలో భావసంచలనము గలిగించినదని చెప్పక తప్పదు సిపాయీల కలహాముతర్వాతకూడ, యీ స్వదేశసంస్థానాక్రమణవాదులయొక్క, మూర్ఖపుపట్టుదల తగ్గలేదు. అందుచేతనే, తనపేరు వ్రాసికొనుటకు సిగ్గుపడిన గ్రంథకర్త యొకడు, 1858 లో యొక, కరపత్రములో నిట్లు వ్రాసియున్నాడు.

"దేశీయప్రభువుల రాజ్యములను, ఆక్రమించుటలో మన ముఖ్యోద్దేశము, ప్రజలవద్దనుండి వసూలుపరచి దుర్వ్యయ మొనరించుచున్న ఆ పన్నులమొత్తమునుగూడ, హిందూదేశపు ట్రెజరీకి చేర్చుటకే. ఇంతేగాక స్వదేశపురాజుల సైన్యముల నన్నిటిని, నిరాయుధులను చేసి, చెదరగొట్టివేయుదుము. మన ప్రభుత్వమునకు, క్రొత్తఆటంకము గలిగినది గాని, లేనిచో అన్ని రాజ్యములను వెంటనే మన మాక్రమించుకొనవలసి యుందుము. అదేగన దేశీయప్రభువులు, సిపాయీల విప్లవసమయములో, మనకు మహోపకారులయిరి. ఇంకొక కారణముకూడ నున్నది. ఈ ప్రభుత్వముయొక్క ప్రస్తుత రాజనీతి, దేశీయరాజ్యముల నున్నట్లుండనిచ్చుటయై యున్నది. కాని యీపద్ధతిని ప్రోత్సహించు వారి బుద్ధిహీనత స్పష్టముగా భాస్వించుచునే యున్నది. ఏందుచేతనన యిండియాలో, యేప్రభువైనను, మన సహాయముచేతనే సింహాసనముపై

నుండగల్గుచున్నాడు. మన సైన్యబలమువల్లనే వారి రా
జ్యములు నిలచియున్నవి. లక్షలకొలదిగా పన్నులు వ
సూలగుటకు కారణముగూడ, మన సహాయసంపత్తియే.
ఏబదిలక్షల సవరనులకు పైగా వచ్చు, నా రాబడియంత
యు, మనమే తీసికొన్నచో బాగుండును. ఈ అవ్యక్తుల
సహాయసంపత్తికంటె, ఆ యేబదిలక్షలవలననే, మన మెం
క్కుడు సహాయమును పొందగల్గుదుము."

'ప్రస్తుతము ప్రజల కుపకరించుచున్న యీ సా
మ్రాంతయు, ముందు బ్రిటీషుప్రభుత్వమునకే లాభించు
ను.........ఈ యేబది లక్షల పౌనుల ఆదాయమును,
మనకు లభించుచో ఉప్పుపన్నును రద్దుచేయగలుగుదుము;
(ఈ క్రూరమగు పన్ను లేకుండ, మనము హిందూదేశ
మును, పరిపాలింపలేనిచో, అదియే మన మీదేశమును
పాలించుటకు, అనర్హులమని చాటగలదు.) ప్రజోపయోగ
కరములైన పనులను గొన్నిటినైన చేయవచ్చును; ప్రజ
లలో నిజముగా విద్యావ్యాప్తికి తోడ్పడగలుగుదుము;
ఒకచోట భూమిపన్నునుకూడ రద్దుచేయుటకును, మరి
యొకచోట నీచమగు ఉప్పుపన్నుతో ప్రజలను పీడించుట
కును, మనకు హక్కు గలదా? తనప్రజలను సరిగా పా
లింపలేకపోవుటయే గాక, వారిని పీడించుచు, వారి పంట
నంతను పన్నులపేరున దోచుకొనుచు, దానినంతను దుర్వ

నియోగము చేయుచున్న, యీ రాజనామధేయులైన అపస్మారులను, మనసైన్యబలమే లేనిచో, మనము వారి పక్ష మవలంబించగలమను భయమే లేనిచో, ప్రజ లీపాటికి రాజ్యభ్రష్టులను జేయకపోయియుందురా? వారికి తోడ్పడుటకై, మనము సంధులను జేసికొన్నామని చెప్పెదరు. కాని యీసంధులను జేసికొనుటకు మీకు హక్కెవ్వ రిచ్చిరి? మనము యీ సంధిపత్రముల పేరుజెప్పి, అనూయకులైన ప్రజలను, వారిని పీడించి, బాధలుపెట్టు యీరాజుల చేతులలో, శాశ్వతముగా నుంచుటకు, మనకు హక్కున్నదా? కర్తవ్యనిర్వహణము చేసికొనలేని యీ రాజనామధారి, (ఒకొక్కప్పుడు, మన చిత్తంవచ్చినవానిని తీసికొనివచ్చి నిలుపుటయు గలదు.) పవిత్రమగు తన పేరుకు కూడ కళంకము గలిగించుకొను, యీతడు, మన సంధిపేరు జెప్పుకొని, తన ప్రజలను శాశ్వతముగా పీడించవలసినదేనా? ఇంత యెందులకు. సంధివిషయముల నెత్తకుడు. ఈ సంధులన్నియును బహుక్రూర మైనవియే. అన్యాయ మైనవియే. కుచ్ఛితమైన, యీ మన ప్రతిజ్ఞలను గురించి మాట్లాడక, అంతకంటె కుటిలముగా వాటి నములు జరుపకుడు."

"ఇంతేకాక ప్రజలవద్దనుండి వసూలు చేయబడు పన్నులు, ప్రజలకు ట్రస్టువంటివి. ఆట్రస్టు సరిగా వ్యవ

హరింపబడినపుడు, యీ రివెన్యూ మొత్తమంతయు, ఆతరువాతి ప్రభుత్వము స్వాధీనము చేసికొనవలయును.”

“ప్రస్తుతము యీ ఆక్రమణను కూడదను యీ రాజనీతిని, న్యాయమును, సరిగా అమలులో బెట్టవలయుననిన, ఆత్మత్యాగము చేయవలసి యుండును...... ఇక్కడ కొంద రడుగవచ్చును; హిందూరాజులను సింహాసనభ్రష్టుల నొనరించుటకు, మనకు (యింగ్లీషువారికి) హక్కేమిగలదు ? దానికి సమాధానముగా, నే నిట్లడిగినచో ? ఆరాజులకు సహాయము చేయుటకు మనకు హక్కెవ్వరిచ్చిరి ? దాపరికము లేకుండ మాట్లాడుచో, మనము హక్కులసంగతి నెత్తుకొననేవద్దు. (కంబళీలో తింటూ వెంట్రుకలు లెక్కపెట్టినట్లుంటుంది.) ఎన్నటికీ ఆ రాజ్యాలను ఆక్రమించమనియు, ఆక్రమించుకొననీయమనియు, వగైరా నిబంధనలతో కూడియున్న సంధిపత్రాలనన్నిటినీ, మనప్రభుత్వము, బహుజాగ్రత్తగా (లేనిచో మరియొక విప్లవము రావచ్చు) త్రోసివైచుచునే యున్నది.”

“ఇన్నిమాట లెందుకు ? పూర్తిగా హిందూదేశాన్నంతనూ ఆక్రమించుట, మనకు కర్తవ్యము; విధి; ఆ కర్తవ్యమును, మన మెల్లైనను నెరవేర్పదలచియే యున్నాము. కాని ఆ కర్తవ్యనిర్వహణముల్లో, మనస్సునలం

బించవలసిన, మార్గములు, బహు సునిశితములై యుండ
వలెను. నేను జెప్పు నుపాయ మొక్కటి గలదు. ఇప్పుడు
జీవించియున్న రాజుల నెవ్వరినీ, సింహాసనభ్రష్టులను జే
యవద్దు. వీరు చనిపోయినతర్వాతనే వీరి రాజ్యములను
కలుపుకొనవచ్చును ........ఈ సంధుల చిక్కు, వద
ల్చుకొనలేమా, మనము! మన అధికారం పూర్తిగా స్థిర
పడినతరువాత యీ రాజుల నందరను, సమావేశపరచి,
మన గవర్నరుజనరలు, వారికి, నచ్చచెప్పవలసియుండును.
హిందూదేశములో బ్రిటీషుప్రభుత్వము మార్పు జెందితీర
వలసియున్నదనియు, కాని వీరియందలి అభిమానముచేత
నే, యీరాజ్యములను, వారిచేతులలో ఉంచుచుంటిమని
యు, వారి వారి జీవితకాలపర్యంతమూ, యీరాజ్య
ముల ననుభవించి, వారి తదనంతర వారసుగా, యింగ్లాం
డు రాణిని యేర్పాటు చేయవలసిన దనియు; కొంత కాల
పరిమితి యిచ్చినట్లయిన, యీ మన సహేతుకమైన కోరి
కకు, వారును సమ్మతించగలరు."

ఎంత సహేతుకమును, న్యాయసమ్మతమునూ అ
గు కోరికయో, చూచితిరా! హిందూదేశమునంతనూ,
వశపరచుకోవలసినదని చెప్పువారి, వాదనలూ, ఆధార
ములూ, ఉపాయములూ, యిట్లుండెడివి. కాకపోయినను,
అనాగరికులు, 'హీథెన్'లు అగు దేశీయప్రభువులకు, రా

జ్యపాలనాధికారం యెక్కడిది? పాలించినా, మానినా క్రైస్తవులగు యీ తెల్లవారిదే రాజ్యం, కాదా మరి!

సంస్థానాక్రమణవాదులు, పంజాబుయొక్క ఆక్రమణవలననే, సిపాయీల కలహము ననచగలిగితిమని, చెప్పుచుందురు. కాని పంజాబు, సిపాయీల కలహంలో చేరకపోవుటకు, కారణములు వేరని, వారు తెలిసికొనుట కెంతమాత్రమును, యిచ్ఛయింపరు.

పంజాబు బ్రిటీషుసైన్యములచే, బలవంతముగా అణచిపెట్టబడి యుండెను. 1858 జూలై 28 తేదీని, యిండియన్ న్యూస్ పత్రిక యీవిధంగా వ్రాసినది:

"పంజాబులోని, మన ఆదర్శ ప్రభుత్వ విధానమే' యిండియాను రక్షించిన దని మనవారిలో, ఆత్మశ్లాఘాపరాయణులు, చెప్పుచుందురు. కాని మా కావిషయములో, పెద్ద సందేహములు కలవు........"

"......బెంగాలులోను, పశ్చిమోత్తర రాష్ట్రములలోను, యిదివరలో మనముంచిన, బ్రిటీషు సైన్యములలో, పదింట యెనిమిది వంతులు, పంజాబులో నుంచవలసి వచ్చినది. బ్రిటీషుసరిహద్దు, సట్లెజి నదివరకుమాత్రము వ్యాపించి యున్నపుడు, డెబ్బది సైన్యమాత్రముండెను. దులీప్‌సింహుని పేర పంజాబును పరిపాలించుట, మన కసాధ్యమైనపుడు, రకమును మార్చి వేసితిమి.

పంజాబును పూర్ణముగా, బ్రిటీషు పరగణాగా నొనరించి, నామమాత్రావశేషమైన 'సింగుల' పాలనను త్రోసిపుచ్చగనే, మన సరిహద్దు 700 మైళ్లు మించిపోయెను. మన క్రొత్తరాజ్యభాగములోని ప్రజలను, వెంటనే నిరాయుధులను గావించితిమి. ఇతర రాష్ట్రములలోని బ్రిటీషు సైన్యముల నన్నిటీని, పంజాబులో విప్లవము కలుగకుండ అణచియుంచుటకై, రప్పించితిమి. సైన్యవ్యయభరువులను సరిపెట్టుటకై, రివెన్యూరాబడిని బలపూర్వకముగా పెంచి, వసూలు చేసితిమి. పంజాబీయులను, కేవలమూ, తుపాకులచేతనే అణచి యుంచితిమి. భారతదేశమందలి తెల్లసైన్య మంతయును, నిరాయుధులగు నా పంజాబు సింహములనే, వేయికన్నులతో చూచుచుండవలసి వచ్చెను. నిజపరిస్థితు లిట్లుండగా, పంజాబు మన ప్రభుత్వమును కాపాడెనని చెప్పుచుంటిరే! ఆశ్చర్యకరమైన విషయమే! ఎందుచేతనన, పంజాబు, మనకు భారతదేశమునే పోగొట్టుటకు, సిద్ధపడిన దనుటలో, చాల నిజ మున్నది."

"కేవలమూ నిరాయుధులైన పంజాబు ప్రజలను, అణచి యుంచుటకే, యావద్భారతదేశములోనూ ఉన్న తెల్లసోల్జర్లు చాలలేదు. మన పటాలముల నన్నిటినీ, పంజాబులో కేంద్రీకరించుటచేతనే, సమయమునకు ఢిల్లీని రక్షించుకొన లేకపోయితిమి. మన సైన్యాధ్యక్షులు వ్య

ధ్యులైరి. విప్లవకారులు తండోపతండములుగా, ఢిల్లీపై బడి, స్వాధీనము చేసికొనినను, యేమియు చేయజాలక పోయితిమి. మనము అగౌరవించి, బాధించిన 'దోస్తుమహమ్మదు', తలచుకొనలేదు గాని, లేనిచో తన అఫ్ఘన్ వీరులతో, పెషావరునుకూడ స్వాధీనపరచుకొన జాలియుండును. అందుచే పంజాబు యిండియాను రక్షించినదని చెప్పుట అసంబద్ధము. జరిగినది, వాస్తవముగా తద్వ్యతిరేకమే. పంజాబును, మనము స్వాధీనము చేసికొనుటవలననే, విప్లవమును, మొదటనే త్రుంచివైచుటకు, మనకు సావకాశము గలుగలేదు. అందువలననే, విప్లవమునకు బలము గలిగినది. వంగదేశములో బ్రిటీషుసోల్జరుల స్థానమున, 82000 పంజాబీయులను సిపాయీలనుగా జేర్చుకొంటిమి. ఆరోజులలో మనము చేయగలిగిన, మరొక విధాన మేమియు, మనకు మిగులలేదు. వారినే నమ్మవలసి వచ్చెను. ఇంతేకాక మరొక రహస్యము. ఆ భయంకర దినములలో, యీ పంజాబు సింహములను, స్వదేశములోనే యుంచిన, ప్రమాదకరము గావచ్చును. ఒక్క దెబ్బకే రెండు పిట్ట లన్నట్లు, వీరినందరినీ సైన్యములో చేర్చి, విదేశములకు పంపినచో, చెప్పినట్లు విని, మనకు హిందూస్థానదేశమును నిలువబెట్ట గలిగిరి."

క్రైస్తవ ఆక్రమణవాదుల కోరికకు పూర్తిగా

లోబడుట, బ్రిటీషు రాజకీయవేత్తలకు, ప్రమాదకరము గా, గాన్పించినది. ఈ పద్ధతిలో ఆర్థికనష్టమే గాకుండ, బ్రిటీషు సామ్రాజ్యముయొక్క పునాదులను కూడ కదిలించివేయగల, ప్రమాద మున్నటుల గ్రహించిరి. ప్రజలలో అసంతృప్తి, బయలుదేరును. నిరంకుశులును, పలుకుబడి గలవారును అగు యీ రాజ్యభ్రష్టులును, నిరుద్యోగులుగా జేయబడిన సంస్థానోద్యోగులు, సైనికులును కలసి, ప్రజలలో తిరిగి విప్లవమును బయలుదేరతీయుదురనియే, బ్రిటీషు రాజకీయనిపుణులు, యీ భారత సంస్థానాధీశులను, ఉత్సవ విగ్రహములవలె సింహాసనములపై కూర్చుండనిచ్చిరి.

మద్రాసు గవర్నరు 'సర్ థామస్ మన్రో' సిపాయీల కలహమునకు పూర్వమే, యింగ్లాండున కిట్లు వ్రాసెను:

"పటాలములలో నుండి చెదరగొట్టబడిన సిపాయీలు, రివెన్యూ, పోలీసు శాఖలలో పనిచేసియున్న బుద్ధిశాలులు, సాహసికులును, ప్రజలతో చేరుదురు. ప్రస్తుతము ఉద్యోగులుగా నున్నను, గొప్ప పదవుల నాశించువారు కూడ వీరితో చేరి కుట్ర సలుపుదురు. వారికి తమ స్వదేశములో సహజముగా నుండు పలుకుబడితో, దేశమునందలి రివెన్యూ అధికారమును, తద్ద్వారా రా

జ్యాంగమును, పూర్తిగా స్వాధీన మొనరించుకొనగలరు.”

ఈతని భవిష్యద్వాణి ఫలించెను. సిపాయీల కలహమని, చరిత్రకారులచే పేర్కొనబడిన, భారత స్వాతంత్ర్యయుద్ధ మనతికాలములోనే జరిగెను. బ్రిటిషు రాజకీయవేత్తలు, తమ భ్రాంతినుండి మేల్కాంచి, వెంటనే, తమ రాజనీతిని మార్చుకొనిరి.

మరొక చిన్న విషయము. దేశీయ సిపాయీలు కేవలమూ, కూలికి పనిచేసెడివారే. దేశీయ పటాలములలో సిపాయీలను, సంస్థానములలో నుండి, యేర్చుకొనవచ్చును. వారు తమ దేశములోనే విదేశీయులై పోగలిగిరి. బ్రిటీషు యిండియా ప్రజలకును, సంస్థానీయులైన వీరికిని, సామరస్యము కలుగజాలదు. అందుచేతనే ‘విదేశీయులైన, యీసిపాయీలు ఆంగ్లప్రభుత్వమునకు వ్యతిరేకముగా, యే ప్రజోద్యమములోనూ చేరుట కిష్టపడరు. ఈపద్ధతి ననుసరించుటచే మరొక విప్లవము బయలుదేరుటకు సావకాశము లేదుకదా!

ఈ విషయము లన్నిటినీ, పర్యాలోచించి, చూడుడు. బ్రిటీషువారు న్యాయతత్పరతచేతను, మానవ ప్రేమచేతనూ, పరోపకార దృష్టితోనూ, దేశీయ సంస్థానాక్రమణనీతినుండి, విరమించి రనియే, మీ రింకను భావించుచుంటిరా ?

## ౨. భారతదేశములో క్రైస్తవమతము

సిపాయీల కలహమైనతర్వాత, దూరదృష్టిగల క్రైస్తవులు, హిందూదేశములో, తమ, మతావలంబకులు కొందరున్నచో, తమ ప్రభుత్వమున కండయై యుందురని, తలంచసాగిరి. కొందరినైనను క్రైస్తవులనుగా చేయగలిగినచో, వారు, ప్రజలకు వ్యతిరేకముగా, తమతో కలసియుండి, వినయవిధేయులై, తమ మాతృభూమికి ఘోరశత్రువులు గాజాలకపోరని, వారు తలంచినదానిలో కొంత నిజము లేకపోలేదు.

ఈపద్ధతి నామోదించువారు కొందరు, సిపాయీల విప్లవ మణగిపోయినతర్వాత, యిట్లు చెప్పుటకుకూడ సాహసించిరి.

“ఏ మహామ్మదీయమతమును మనము శ్లాఘించియుంటిమో, ఏ విగ్రహారాధకుల హిందూమతమును, మన మవమానించితిమో, ఆ మతములవారే మనకు ప్రబలవిరోధులు. కాని మన మిషనరీలు క్రైస్తవులనుగా జేసినవారే మనకు నిజముగు మిత్రులైరి.”

కాని యీ పవిత్రక్రైస్తవులకే కాదు సరిగదా,

వారి దేవునికే తెలియదు, విప్లవసమయములో, ఆంగ్లప్రభుత్వముకు వారిమతస్థులు చేసిన సహాయ మేమిటో, వారి బల మారోజులలో యెంతవరకూ యుండెడినో.

దూరదృష్టిగల క్రైస్తవులు, కేవలమూ, రాజకీయ కారణముల వలననే, హిందూదేశమందలి 'హీథన్' ప్రజలలో, కొందరుమాత్రమే, తమ మతమును స్వీకరించవలెనని కోరుచుండిరి. ప్రజలందరును క్రైస్తవులు గావలెనని, వారెప్పుడును కోరుచుండలేదు. ఒకే మతమునకు జెంది, యేకదేశీయులైనను, అమెరికా మొదలగు దేశముల ప్రజలు, తమ స్వాతంత్ర్యమునకై పోరాడి యుండలేదా ? హిందూదేశములో హిందూమతస్థులు, మహమ్మదీయులు, క్రైస్తవులూ కూడ వుండవలెను. వారిని కాదని వీరిని, వీరిని కాదని వారినీ, చేరదీయుచు, హిందూదేశమును చిరకాలమువరకూ, తమ అధికారములోనే యుంచుకొనవచ్చును. అంతియేగాని, యీ క్రైస్తవులకు, మతమందలి భక్తి విశ్వాసములే యనుకొంటిరి, కాబోలిదియంతయు. 'క్రీస్తుబోధనలు వినక, యీమానవులంతా నరకకూపములో బడిపోవుచున్నారే' యని అనుతాపముచేతనే యింత ధనవ్యయము చేసి, మతప్రచారము చేయుచున్నారని, మీరు తలంచుచుంటిరి, కాబోలు! సిపాయీల కలహపురోజులలో హిందూదేశములో పని

చేసి, తర్వాత, ఆగ్రా హైకోర్టు జడ్జీగా పనిచేసిన, 'విలియమ్ ఎడ్వర్డ్సు' యిట్లు వ్రాసియున్నాడు.

"మనము విదేశీయులమగు విజేతలముగానే, ప్రజలచే భావింపబడుచుంటిమి. ముందుకూడ నట్లే తలంపబడుదుము. ప్రజలలో విద్యయు, నాగరకతయు వ్యాపించుకొలదియు, వారు మన బంధనములలోనుండి విడిపించుకొని స్వతంత్రులు గాజూచుచునే యుందురు. మన ప్రభుత్వ మీదేశములో కొంతకాలమువరకైనను, స్థిరముగా యుండవలెనని నచో, యీదేశీయులలో కొందరినైనను క్రైస్తవులనుగా జేసితీరవలయును. క్రైస్తవమతస్వీకారమువలన, జాతీయాభిప్రాయములును, స్వాతంత్ర్యేచ్ఛయును, నశించిపోవునని కాదు, నా యభిప్రాయము. క్రైస్తవమతప్రచారమును, వ్యాప్తియు మెల్లగా జరుగుచుండును. దేశమంతటనూ వ్యాపించియున్న, క్రైస్తవ సంఘములు మన ప్రభుత్వమునకు పెట్టనికోటలై యుండగలవు. దేశమందలి ప్రజలలో చాలభాగము విగ్రహారాధకులుగాను, మహమ్మదీయులుగాను, యుండునంతవరకు, వీరు మనపక్షమును వీడి, పోజాలరు."

క్రైస్తవాధికారు లిదివరలో, మిషనరీలను, యిండియాలో మతప్రచారము చేయనియ్యకుండెడివారు. కాని క్రమముగా వారి ప్రభుత్వము బలపడుచున్నకొలది

యు, స్వయముగా క్రైస్తవమిషనరీలను ప్రోత్సహించుట యేగాక, క్రైస్తవేతరులను దూషించుట, వారిమతముల నవమానించుట, క్రైస్తవమత మవలంబించునట్లుగా ప్రజలను బలాత్కరించుట, మొదలగు అమానుషచర్యలను గూడ, చూచియు చూడనట్లు సహించుచుండిరి. ఈ విషయములలో, గొప్ప సంస్కర్త 'లార్డు విలియమ్ బెంటిక్'. మద్రాసు గవర్నరుగా నుండునపుడు, బాహాటముగా క్రైస్తవ మిషనరీలకు ప్రోత్సాహ మిచ్చి, వెల్లూరు విప్లవమునకు ముఖ్యకారణు డయ్యెను. తరువాత యిండియాకు గవర్నరుజనరలుగా వచ్చినపుడుగూడ, యీ తత్వమునే అవలంబించసాగెను. 1852 లో, యీతడు రెగ్యులేషన్ నొకదానిని 'ప్యాస్' జేసెను. క్రైస్తవమతవ్యాప్తికి, ప్రబలాటంకముగానున్న, హైందవ సమిష్టి కుటుంబములందలి, ఆస్తిహక్కుల నీ రెగ్యులేషన్ సవరించివైచెను. హిందూమతములో సమిష్టి కుటుంబముయొక్క ఆస్తియందు, కుటుంబ మెంబర్లందరకును, సమానహక్కులు గలవు. కాని యేవ్యక్తియయినను, మతభ్రష్టుడైనపుడు, వానికి జాయింటు కుటుంబాస్తిలో, హక్కు తొలగిపోవును. ఈ రెగ్యులేషన్‌వల్ల, క్రైస్తవమత మవలంబించిన వ్యక్తికి, సదరు సమిష్టి కుటుంబాస్తిలో, హక్కు తొలగిపోదు. ఇందువల్ల అనేకులకు క్రైస్తవమత మవలంబించు

టకు ప్రోత్సాహము గల్గెను.

బెంటికుప్రభువు, యీ విషయములలో, లార్డు మెకాలేను తనకు, సహాయము జేసికొనెను. మెకాలే కూడ, యిండియాలో క్రైస్తవమతవ్యాప్తి చేయవలెనను, ఆసక్తి గలవారిలో నొకడు. ఆంగ్లవిద్యావ్యాప్తి, క్రైస్తవమతవ్యాప్తికి సహకారి కాగలదనియే, యీతడు యిండియాలో యింగ్లీషుపాఠశాలలను స్థాపించెను. 1836 లో యిండియానుండి, తండ్రికి త్తరము వ్రాయుచు, మెకాలే యిట్లు వ్రాసియున్నాడు.

"హిందువులలో యీవిద్య, చాల మార్పు గలిగించగలదు. ఇంగ్లీషువిద్య నభ్యసించిన, హైందవు డెవ్వడును, మనస్ఫూర్తిగా, తన మతమును నమ్మియుండలేడు. కొందరు కేవలమూ ఉపేక్షాభావముతోనే, తమ మతములోనే యుండిపోయెదరు. మరికొందరు శ్రుతిబాహ్యులుగా నుండగలరు. ఇంకొకకొందరు ప్రత్యక్షముగా, క్రైస్తవమత మవలంబించెదరు. నేను యేర్పరచిన, యీ విద్యావిధానమును కొనసాగించినచో, ముప్పది సంవత్సరములలోనే, వంగభూమియందు, హిందూమతమందు నమ్మకము గలవానిని, మనము చూడలేమనియే నా దృఢవిశ్వాసము."

ఇండియాలో క్రైస్తవ మిషనరీలకుగాని, ఆ మత

ప్రచారమునకై పాటుబడు యితరులకు గాని, ప్రజలతో సామరస్యము లేదు. దీనికి కారణము, వారు క్రైస్తవులగుటచేత గాదు. వారును, వారిమతస్థులును, తాము యీ ప్రజలకన్న భిన్నుల మనియు, వారికంటె అధికుల మనియు, తలంచుచు, వారితో కలియక, వెకసరము గానే యుందురు. ఉత్తములగువారిని, కొందరను మినహాయించి, మిగిలినవారి నందరను, *'Flogging Missione-ries' గా నొక యింగ్లీషు గ్రంథకారుడు వ్రాయుచు న్నాడు. ఇందులో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు. ఇంగ్లాండులోనే, గ్రామాదులలో మతాధికారులు, 'మూకను' యేవిధముగా ఆదరింతురో తెలిసికొనినచో, మన మీవిషయమున సందేహింప బని లేదు కదా! ఒక ఆంగ్లచరిత్రకారు డిట్లు వ్రాయుచున్నాడు:

"గ్రామసీమలలో, మతాచార్యులు, ప్రజలతో విరోధులై, తమ నిత్యవిధుల నుపేక్షించుచు, యేరాజకీయ కక్షిదారులతోనో చేరియుందురు. మాష్టరు మాన్ మహాశయుడు చెప్పినరీతిగా, యెప్పుడునూ, యేమతాచార్యుడునూ, బీదసాదలకు వ్యతిరేకుడుగానే యుండుట, మనము ప్రత్యక్షముగానే చూచుచున్నాము. గొప్ప

* History of Education in India under the rule of the East India Company. 207-8.

ఆస్తి, ప్రత్యేకాధికారములు, ప్రజలపై విశేషమైన పలుకుబడి, గలిగియున్న ప్రబలరాజకీయకక్షలతో చేరి, వారికనుచరులై యుండుట వీరికి పరిపాటియై యున్నది.''

"Enclosures కాలమునుండియు, యీ మతాచార్యులు, గొప్పవారును, బలవంతులు నగు ప్రభువుల పక్షమున చేరి, ప్రజాసామాన్యముయొక్క భూములను లాగుకొనుటలోను, వారి నణచిపెట్టుటలోను, సహాయపడుచునే యుండిరి. ఇంకను పూర్వకాలములో విదేశీయ సైనికులు, ఇంగ్లాండుపై బడి, ప్రజలను దోచి, బీదరైతులను, కూలీలను అవమానించి, హింసించి, చిత్రవధ చేసి, ఉరిమ్రానులపైనను, చెర్చిశిఖరములపైనను, తోరణములుగా, వారి కళేబరములను వ్రేలాడదీసినపుడు, యీ క్రైస్తవచెర్చి, చూచుచు యూరకొనియే యుండెను. ఇంతియేగాక యీ బీదవారు, శిశు బాల వృద్ధ భేదములేకుండ, వందలకొలది, శాశ్వతముగా తమ, మాతృభూమినుండి నిర్వాసితులుగా జేయబడినప్పుడు, స్వింగుదోపిడులసందర్భములో, వీరి చెప్తరు కెతెడ్రలు మతగురువులు, యీ అమానుషశిక్షలను తగ్గించి, కరుణించమని ప్రజలు వ్రాసికొనిన అర్జీలో, సంతకములు చేయుటకుకూడ నిరాకరించిరి.'' *

---

* Problems of Village life, By K. N. Benett. Pages 128-129. Home University library of modern knowledge.

హిందూదేశమునకు వచ్చు మిషనరీలును, మతా చార్యులును, విద్యావంతులు, గౌరవనీయులు నగు నున్నతవంశీయులు గారు. ఇంతపర కేందులకు. వారి దేశము లోనే యీ మతశాఖలోనికి వచ్చువారు, మిక్కిలి అసమర్థులును, అవ్యక్తులును అయియున్నారని ఆందోళన జరుగుచునే యున్నది. పైనవ్రాసిన గ్రంథకర్త యిట్లుదాహరించుచున్నాడు:

"ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి, మరి యితర యూనివర్సిటీ విద్యార్థుల జాబితాలను పరిశీలింపుడు. తెలివితేటలును, సమర్థతయు గలిగిన, విద్యార్థు లెప్పుడును, మతజీవితమును గడపుటకు పోయియుండలేదు. పై తరగతులకు బోలేని, అసమర్థులే తరచుగా పవిత్రమతజీవితమును గడపుటకిచ్ఛయించుట, చూచుచునే యున్నాము. తత్రాపీ, మరీ అసమర్థులు, గ్రామసీమలలోని మతాచార్యపదవులను స్వీకరించుటకు ముందంజ వేయుట ప్రత్యక్షప్రమాణమే." †

ఇండియాలో, యీ క్రైస్తవమిషనరీలు, చేయగల పని, యేమియూ లేదని, మీ కింకనూ సందేహమేనా! కల

† Ibid. Page 128.

హిందూదేశము:

కత్తా రివ్యూ' పత్రిక 30 వాల్యూము) యిట్లు వ్రాసి యున్నది:

"మనము గొప్ప కర్తవ్యమును నెరవేర్చగలచి, హిందూదేశములోనికి పంపిన క్రైస్తవమిషనరీల, యోగ్యతలను సరిగా, గమనించుట లేదు."

ఇండియా గవర్నమెంటు, హిందూదేశప్రజలను, క్రైస్తవులనుగా మార్చుటలో, యింత పాటుపడుచున్నను, ఆ పవిత్ర క్రైస్తవులు, ప్రభుత్వము నింకను దూరుచునే యున్నారు. ఈ నిర్భాగ్యభారతీయులు, భయంకర నరకకూపములో పడిపోకుండ, క్రైస్తవమత మిచ్చి, వారి యంతరాత్మల నుద్ధరించుటకు, ప్రభుత్వము, సరియైన చర్యలను తీసికొనుట లేదనియే, పాపము వారివిచారము! *

అప్పటి 'కలకత్తా రివ్యూ' యిట్లు వ్రాసినది.

"న్యూజీలాండులో క్రీస్తుసందేశ మెంతత్వరలో వ్యాపించుచున్నదియు, ఫిలిప్పైనుదీవులలోను, యింకను వారికి లోబడియున్న యితర ప్రదేశములలోను, స్పెయిన ప్రభుత్వము, ప్రజల నెంతత్వరలో క్రైస్తవులనుగా చే

* ఇహలోకసుఖములను, వారి కెట్లును గలుగనివ్వము గదా పరలోకసుఖము లైన నివ్వవలదా, యని, యీ క్రైస్తవుల యాలోచనగాబోలు అను:

యుచున్నదియు, చూచిన యే సహృదయుడైన క్రైస్త
వుడును, పవిత్రుడై, మనోవాక్కాయకర్మభిః క్రైస్తవ
మతవ్యాప్తిని కోరు యే మతాచార్యుడును, హిందూదే
శమున యీ మతవ్యాప్తి ఉపేక్షింపబడుటను చూచి,
సహింపజాలడు. దీనికంతకును, యీ దేశప్రభుత్వమే జ
వాబుదారియై యున్నది. ఇట్టితరుణమున, యెవ్వరును,
సహించి యూరకొనజాలరు. వెంటనే బలిష్టమై, సౌకర్య
యుతమైన, యీ ప్రభుత్వసంబంధము నధిరోహించి, కర్త
వ్యసిద్ధి నొందువరకు, వదలివేయకూడదు.''

''ఈ దేశములో యేకార్యమును, ప్రభుత్వము చే
కొననిదే, కొనసాగదు. ప్రభుత్వము ప్రతియుద్యమమును
సారథియై, నడుపవలయును. ఒక రైలుమార్గమును వే
యనీ, కాలువలు త్రవ్వనీ, ఆనకట్టలు కట్టనీ, స్టీముబోటు
కంపెనీలు స్థాపించనీ, మరేయితరపనులు ప్రారంభించనీ,
గవర్నమెంటు ప్రారంభింపనైనవలెను, లేదా ప్రభుత్వ
పూచీపైననయిన, పని జరుగవలెను. అట్లే యీ మతవి
షయములలో కూడ, ప్రభుత్వమువారి ప్రోత్సాహము
లేనిదే, మనము పని చేయజాలము. ఇక్కడనే, మనము
పొరపాటు చేయుచున్నాము.........ఈ ప్రభుత్వము,
సహాయము చేసితీరవలెను. స్వతహాగా చేసితీరును. వా
రికి సాధ్యమైనంతవరకు, తగినంతవరకు, పరోక్షముగా,

యీదేశపు అపాయకరమైన మతమునుండి, లాభకరమైన క్రైస్తవమతములోనికి, ప్రజలను చేర్చుటకు, సహాయము చేయుచునే యుండగలరు,"

పంజాబులో క్రైస్తవ ప్రభుత్వము, విచిత్రమైన క్రిస్టియన్ పద్ధతులపైననే స్థాపింపబడి, తదాదిగా పంజాబు నొక క్రైస్తవ పరగణాగా చేయుటకు ప్రయత్నములు సలుపబడుచునే యున్నవి. వీనికన్నిటికిని, సూత్రధారులు, సర్ హెన్రీ లారెన్సు, సర్ జాన్ లారెన్సు, *సర్ రాబర్టు మాంటుగోమరీ, శ్రీ నాల్డు మేక్లియోడ్, కలనల్ హెచ్. బి. ఎడ్వర్డిన్, మొదలగు స్థితప్రజ్ఞులగు క్రైస్తవశ్రేష్ఠులు. ఈ అతిరథులందరును, గవర్నమెంటు పా

---

* సర్ రాబర్టు మాంటుగోమరీ, పంజాబుకు ప్రథమ లెఫ్టినెంటు గవర్నరు అతడు గొప్ప మతవిశ్వాసముగల క్రైస్తవుడుగా పరిగణింపబడెడివాడు. ఈ పవిత్రాత్ముని, సహమతస్థుడును, మానవశ్రేయోభిలాషియు నగు, మిత్రుడొకడు, ఒక విశ్రమదినమున, యీతని ఘనకార్యములను గూర్చి యిట్లు విన్నవించెను.

"Progress and present state of British India" అను పుస్తకములో 'మార్టిన్' లేఖ నొకదాని నుదాహరించెను. అది లాహోరునుండి, ఆదివారము, ఉదయం 9 గంటలకు, లెఫ్టినెంటు గవర్నరు తన కమీషనరులలో నొకడైన 'ఫ్రెడరిక్ కూపర్' నకు వ్రాసినది. ఈ కమీషనరునకే 'తలారిఫ్రెడరిక్' అను బిరుదనామముండెను. ఆ లేఖలో, 20_వ దేశీయ పదాతిపటాలమును, కేవలమూ, విరుద్ధముగా ప్రవర్తించగలరను అనుమానముచేతనే, యీ

శాలలలోని, విద్యాశిక్షణకంటె, మిషనరీపాఠశాలలలోని బోధన చాల బాగుగా నున్నదని, అభిప్రాయ మిచ్చియున్నారు. మేక్ లియోడ్ మహాశయుడు 1853 లో, తన 'మినిట్ ఆన్ ఎడ్యుకేషన్' లో యిట్లు వ్రాసెను:

"సాధారణ పరిస్థితులలో, యే గవర్నమెంటు పాఠశాలయు, మిషనరీపాఠశాలతో సమానము కాజాలదు. గవర్నమెంటు పాఠశాలోపాధ్యాయులును, మిషనరీలవలె శ్రద్ధాభక్తులతో, పాఠములను గరపుట చూడము. మిష

---

పాపభూయిష్టమగు లోకమునుండి, తుడిచివైచినందుల కభినందించుచు, 'ఇక్కడ కూడ మూడు పటాలములలోని సైనికులు చంచలముగా నున్నట్లు తోచుచున్నది కాని వారు బహిరంగముగా వెడలిపోవునట్లు లేదు. వారట్లు చేయవలెననియే, నేను కోరుచున్నాను. ఎందువల్లననిన, వారు తిరుగబడుటయే తటస్థించుచో, ఒక్కనినైనను బ్రతికి, పోనివ్వను' అని వ్రాసెను. క్రైస్తవమతమును బోధించి, ప్రజల నుద్ధరించుటకు, పూనుకొనిన, యీ గవర్నరు, వేయిమంది నిరపరాధులను చంపినందులకై, తన స్నేహితునభినందించుటయు, మరి మూడు వేలమందిని. చంపుటకు తగు స్వల్పకారణము, దొరకుట లేదని కించపడుటయు, పరస్పరవిరుద్ధములుగా, కాన్పించవచ్చును. కాని యీ గ్రంథకర్త, యిట్టికారణములవల్లనే, బ్రిటీషువారు హిందూదేశములో, క్రైస్తవమతవ్యాప్తి, చేయుటలో, పరాజయము పొందిరని, వ్రాయుచున్నాడు."

The company and the crown, Page 102-103.
By the Honourable T. J. Howell Therrlow, 1867.

నరీ మేనేజిమెంటుక్రిందగల స్కూలులలో, యుపాధ్యా
యులు, బహుశ్రద్ధగా విద్య గరపుదురు. ఈ కారణము
లచే గవర్నమెంటు ఆ పరిస్థితులలో, విద్యాశాఖనుండి త
ప్పుకొని, తమకన్న బాధ్యతగా, కేవలమూ, ఉపకార
బుద్ధితో పనిచేయుచున్న మిషనరీలకు, వదలివేయుట.
చాల శ్రేయస్కరము."

ఆ రోజులలో, యిండియాకు 'లార్డు డల్‌హౌసీ'
గవర్నరు జనరలుగా నుండెను. ఆతడు మేక్‌లియోడ్
యొక్క సూచనలను, పరిపూర్ణముగా నామోదించెను.
ఈతడు 1854 జూన్ లో, మినిట్ లో యిట్లు అభిప్రా
య మిచ్చియున్నాడు.

"కేవలమూ, మిషనరీ పాఠశాలలతో పోటీగా,
ప్రభుత్వ పాఠశాల లుంచకూడదనియే గాక, సరియైన వి
ద్యావ్యాప్తికై, పనిచేయుచున్న, యీ మిషనరీ పాఠశా
లలను, ప్రభుత్వధనముతో పోషించవలసిన అవసరమును
గూర్చియు, అదనపుగ్రాంటులను సహాయార్థమై యిచ్చు
టను గూర్చియు కూడ, 'మేక్ లియోడ్' సమర్థించి
యున్నాడు........"

"నాయొక్క అభిప్రాయ మేమనిన, మనము వృ
థాగా భయపడి వెనుకంజ వేయుచున్నామనియే. రాజ
కీయదృష్టితో చూచినను, మన సత్యమగు మతస్థులచే

ప్రోత్సహింపబడుచున్న విద్యావిధానమును, మనముపే
క్షాభావముతో చూచుటలో, చాల పొరపాటు పడుచు
న్నామనియే, తోచుచున్నది. మిషనరీలచే నడుపబడు
చున్న, యీ విద్యావిధానమును, ప్రభుత్వధనముచే పో
షింపదగు, సమయము వచ్చియున్నదని, నావిశ్వాసము.”

డైరక్టరు సభవారు కూడ, మేక్ లియోడ్, డల్
హౌసీ ప్రభువులు వ్రాసినదానినే, యామోదించిరి. సర్వ
సమర్థులైన, యీ క్రైస్తవసమితివారు, యిట్లు వ్రాసిరి:

“పంజాబులో, విద్యావిధానమును కొనసాగించు
టలో, చూపుచున్న శ్రద్ధకు, అపారమైన సంతోషమై
నది. ఛీఫ్ కమీషనరుకును, మాంటుగోమరీకిని, మేక్ లి
యోడ్ కును, యితర ఉద్యోగులకును, మా హృదయ
పూర్వక వందనములు, తెలియజేయ వలయును. వీరంద
రును బహు ప్రయాసపడి, తయారుచేసిన, యీ ప్రణాళి
కల నమలుసం దుంచుటవల్ల గలుగు, మహోపకారము
లందు, మాకు సంపూర్ణవిశ్వాసము గలదు. బ్రిటీషుపరి
పాలనవలన గలుగు మహోపకారములను (యిండియా
ప్రజలకు) పంజాబు ప్రత్యక్షముగా, యావత్ప్రపంచమున
కును, చాటుగాత యని, వాంఛించుచున్నాము.”

ముల్తాన్ దండయాత్రలో విచిత్రమైన క్రైస్తవ
పద్ధతుల నవలంబించిన, యీ గాఢవిశ్వాసి యగు క్రైస్త

వ(్రేష్ఠుడు, హెర్బర్ట్ ఎడ్వర్డిన్, యితర క్రైస్తవప్రభుత్వ ములదృష్టిలో, నాధిక్యతను సంపాదించుటకై, యిండి యా ప్రభుత్వమునకు కొన్ని పద్ధతులను సూచించెను. "బ్రిటీషు యిండియా గవర్న మెంటులో, క్రైస్తవాచార ములు గానివానిని తొలగించుట" యను విషయమును గురించి మెమొరాండమును వ్రాయుచు, యీ ఆదర్శపు రుషు డిట్లు సూచించెను: ఈతని యుద్దేశ్యములో, అక్రైస్తవపద్ధతు లేవన;

1. ప్రభుత్వ కళాశాలలలోను, పాఠశాలలలోను, బైబిలును, క్రైస్తవబోధను, ఉంచకపోవుట;

2. విగ్రహారాధనను, మహామ్మదీయమతమును, ప్రభుత్వము సహించియుండుట;

3. జాతి మత వివక్షతను ప్రభుత్వమువారు, ఒప్పు కొనుట;

4. ప్రభుత్వముయొక్క వివిధశాఖలలో, దేశీ యుల పండుగలను, పర్వములను, సెలవుదినములుగా ప్ర కటించుట;

5. క్రిమినలు, సివిలు శాఖలలో, హిందూ మహా మ్మదీయ ధర్మశాస్త్రప్రమాణములపై తీర్పు లిచ్చుట;

6. విగ్రహారాధకులయు, మహామ్మదీయులయు,

ఉత్సవాదులను బాహాటముగా జరుగుటకు సమ్మతి జూపుట;

7. వేశ్యలను, వీథులలో, తరచుగా, మేళముల జేయనిచ్చుట;

8 యూరోపియసోల్జర్ల వివాహవిషయమై యున్న కట్టుబాట్లును, వివాహితులయిన తెల్లసోల్జర్లకు, సైన్యనివేశసములలో (Barracks) తగు సదుపాయములు, లేకుండుటయును;

9. గవర్నమెంటువారు నల్లమందు వర్తకముతో సంబంధము గలిగించుకొనుట;

10 ఇండియన్ ఆబ్కారీ నిబంధనలు;

వీటిలో ఆఖరు నాలుగు విషయములును, అందరును గర్హించదగినవే; కాని మొదటి ఆరువిషయములును, ప్రభుత్వము కలుగజేసికొనుటకు, సంబంధ మేమి కలదో యూహింపుడు.

ఎడ్వర్డిన్, యీ మెమోరాండముయొక్క కాపీ నొకదానిని, యింగ్లాండులోని పై యధికారులలో నొకరికి పంపుకొనెను. ఆతడు సుప్రసిద్ధ క్రైస్తవుడగు 'ఎరలు ఆఫ్ షాఫ్ట్సుబరీ' యే. ఎడ్వర్డిన్ యొక్క యీయవివేకపువనిని, ఆతని స్వదేశస్థులలో నొకడు 'అబ్దుల్ వాహాబ్' అను

మారుపేరుతో, కఠినముగా విమర్శించెను. "హిందూదేశములో బ్రిటీషు ప్రభుత్వముయొక్క క్రైస్తవవిధులు" యను కరపత్రములో యీతఁ డిట్లు వ్రాసెను:

"కలనల్ ఎడ్వర్డ్సన్ యొక్క అభిప్రాయములు, యదార్థమును, పటుత్వమును, కలవై యుండవే, యుండ కపోనీ, యిందులో గమనార్హమైన, చిన్న విషయ మొక టున్నది. అది యింగ్లాండులో యెవరును ప్రశ్నింపకపోవ చ్చును, గాని, యిచ్చట యిండియాలో యిది, యెవరి విమర్శకును లోనుగాకుండ, నుండజాలదు. క్రమముగా పొందదగిన, మిక్కిలి గొప్పపదవిలోనున్న, యీతఁడు, తాను బాధ్యతగలవాఁడై యుండియు, తాను సేవించు చున్న ప్రభుత్వముయొక్క ఉత్తరువులను నిర్వహించవల సినవాఁడే గాని, వాటిని విమర్శించి, సలహాల నిచ్చుపాటి వాఁడెట్లయ్యెను? ఆ సలహాలును, గవర్నమెంటు కేవల మూ, అక్రైస్తవపద్ధతులపై నడుపబడుచున్నదనియూ? ఆ ప్రభుత్వ మూలసూత్రములనే ఖండించుచు, మెమొ రాండము నొకదానిని, యింగ్లాండులోని ప్రభువులలో నొకనికి, పర్యాలోచించుటకై పంపుటయూ?"

ఈ కలనలుగారి మెమొరాండమునకు దగుస్థలము, చిత్తుకాగితముల బుట్టయే. కాని యింగ్లాండునుండి, యి ది, ఆ రోజులలో పంజాబునకు చీఫ్ కమీషనరగు, సర్

జాన్‌లారెన్సునకు పంపబడెను. ఆ సత్క్రైస్తవుడును, దీనికి తగని విలువ నిచ్చి, తగుసూచనలతో యిండియా గవర్నమెంటునకు పంపునిమిత్తమై, తన కార్యదర్శియగు 'టెంపులు' నకు పంపెను. (ఈతడే తరువాత సుప్రసిద్ధుడగు సర్ రిచార్డు టెంపులు.) ఆ రోజులలో, పంజాబులోని, తెల్ల ఉద్యోగులలో, చాలమంది, యించుమించుగా, ఎడ్వర్డిస్‌తో సమానాభిప్రాయములు కలవారే యై యుండిరి. చీఫ్ కమిషనర్ కూడ, వీరితో సమానపాండిత్యము గలవాడే. ఆతడును, కాలేజీలలోను, పాఠశాలలలోను, బైబిలుబోధన లుంచవలెనను, జాతివాడే. పైనాన్సు కమీషనరగు 'డోనాల్డు మెక్ లియోడ్' కూడ వీరిమార్గమునే బలపరచెను.

కాని యీ యభిప్రాయము, పంజాబుకు 'డైరక్టరు ఆఫ్ పబ్లికు యిన్‌స్ట్రక్షన్' గా నున్న, W. D. ఆర్నాల్డుచే నిరాకరింపబడెను ఈతడు 'రెవరెండు డాక్టరు థామస్ ఆర్నాల్డు ఆఫ్ రగ్బీ' యొక్క పుత్రుడు. బాల్యమునుండియు క్రైస్తవ పద్ధతులపై పెంచబడినవాడు. ఆతడు స్వబుద్ధిపైననే యాధారపడి యుండుచో, ఛీఫ్ కమీషనరుకువలెనే, ప్రభుత్వపాఠశాలలలోను, కళాశాలలలోను, బైబిలు బోధను ప్రవేశపెట్టుటకు అనుకూలుడే యైయుండును. కాని తనశాఖకు సంబంధించిన వ్యవహా

రము లన్నింటిని, తన ముఖ్య సహోద్యోగి యగు * 'బాబూ శ్యామచరణవసు' యొక్క యిచ్ఛానుసారముగా, నిర్వర్తించుచున్నట్లు, ఆ రోజులలో పంజాబులో యందరికిని తెలిసియే యుండెను. ఈ వసుమహాశయుడు, డాక్టరు అలెగ్జాండరు డఫ్ యొక్క శిక్షణలో, కలకత్తా క్రైస్తవ పాఠశాలలో విద్యాభ్యాసము చేసియుండెను. అలెగ్జాండరుడఫ్ యొక్క ప్రియతమ శిష్యుడు. తరువాత లాహోరులోని, అమెరికన్ మిషన్ స్కూలుకు, మొదటి ప్రధానోపాధ్యాయుడుగా నుండెను. అందుచే నీతడు బైబిలుతోను, క్రైస్తవ ధర్మములతోను, చిరపరిచితుడే. ఈ బంగాళీయునియొక్క పలుకుబడిచేతనే, యీ క్రైస్తవ మతాచార్యపుత్రుడు, గవర్నమెంటు పాఠశాలలలో, బైబిలు బోధనమును, వలదని వాదించెను.

డాక్టరు "ఆర్నాల్డు యొక్క వ్యతిరేకాభిప్రాయ

* ఆ రోజులలో పంజాబులో, యేకమాత్రదినపత్రిక 'The Indian Public Opinion' డాక్టరు G. W. లీటరుచే నడుపబడుచుండెను. 1867 ఆగష్టు 16 తేదీ పత్రికలో, బాబూ శ్యామచరణవసువు మరణవార్తను వ్రాయుచు, యిట్లు ప్రకటించిరి:

"పంజాబులో విద్యావిధానమువల్ల గలిగిన. యుపయోగకర కార్యములన్నియు, విద్యాశాఖకు ముఖ్యసహాయకోద్యోగియుయిన, యీ దేశీయునికే చెందియున్నవి. వాటివల్ల గలుగు గౌరవమంతయు, ముఖ్యముగా, యీ మహాశయునికే చేరవలసియున్నది."

మును గురించి, సెక్రిటరీ, టొంపులు, యిండియా ప్రభుత్వ కార్యదర్శి కిట్లు వ్రాసెను:

"1858 జూలై 3. ప్రభుత్వ పాఠశాలలలో బైబిలు బోధనను ప్రవేశపెట్టుటచే, సర్వమతతాటస్థ్యభావముకు భంగము గలుగునని, ఆర్నాల్డు వాదన. క్రైస్తవ మతమునకు ప్రాముఖ్యము నిచ్చి, యితరమతముల నిరసించినట్లును, గాన్పించును. బోధనాంతరగతులలోనికి, యిష్టమున్న విద్యార్థులే, రావచ్చునని యున్నను, ప్రజలు తద్వ్యతిరేకముగానే భావింతురు. ఈ విధానము, మతమును మార్పించుట, లేక నెమ్మదిగా బలవంతపరచుటలో చేరగలదు. ప్రజలకు ధర్మకర్తలముగానున్న, మనము వారి పన్నులచేతనే క్రైస్తవమతబోధన నుత్సహించు విద్యావిధానమును, ప్రవేశపెట్టుట సమంజసము గాదు; క్రైస్తవమతబోధనచే, మనము మతకలహములలోనికి, యీడ్వబడుదుము. తుదకు, యీ బోధనలచే, మన ప్రభుత్వముకు కూడ, అపాయము తెచ్చికొనినవార మగుదుము. ఈ పై వాదనలనేగాక, యితరములనుగూడ, ఆర్నాల్డు చాల నిపుణతతో, పోషించెను........కాని యీ వాదనల కన్నిటికిని, ఛీఫ్ కమీషనరు, కేవలము వ్యతిరేకాభిప్రాయ మిచ్చెను."

"ఆర్నాల్డు వాదనలన్నియు, మన ప్రభుత్వము,

ప్రజలకు ప్రతినిధిగానున్నదను భావముచేతనే, చెప్పబడి యున్నవనియే, మేక్‌లియోడ్ కూడ, చెప్పుచున్నాడు. కాని ఛీఫ్‌కమీషనరు దృష్టిలో యట్లెంతమాత్రమును లేదు. ఇంగ్లాండు, అమెరికాలలోని, కాన్స్టిట్యూషనలు గవర్నమెంటునకును, యిండియా బ్రిటీషు ప్రభుత్వమున కును, చాల భేద మున్నది. మనము ప్రజల ప్రతినిధు లమే యయినచో, ప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగా, మన మేమియు చేయ వలనుపడదు. కాని మన మట్టిస్థితి లో లేము. ప్రజలచే మన మెన్నుకొనబడినవారము గా ము. వారు మనకీ యధికారమును కోరి యిచ్చియుండ లేదు. మనకీ పదవి కేవలము, మన నైతికాధిక్యతవల్ల నూ, కార్యకారణములవల్లనూ, భగవంతుని యిచ్ఛచే తనూ మాత్రమే లభించినది. ఇండియాను శాసించుటలో, మనకు, యీవిషయము, ముఖ్యముగా, గమనార్హమై నది. ప్రజాప్రతినిధి ప్రభుత్వమునకును, ప్రజలకును, ఉండు సంబంధము, యిండియాలో కేవలము, విడంబనామా త్రమే.''

బ్రిటీషు కైస్తవప్రభుత్వము ప్రజలకు బాధ్యత గలదని కాని, కేవలమూ ప్రతినిధియని కాని, ఆర్నాల్డు తలంచినట్లు చెప్పుటలో, ఛీఫ్‌కమీషనరు, చాల పొర బడినాడు. ఎందువల్లనన, తనమతస్థు లందరివలెనే, తోటి

దేశాభిమాను లందరివలెనే. 'పంజాబు డైరక్టరు ఆఫ్ పబ్లికు యినిస్ట్రిక్షన్' కూడ, ప్రజాద్వేషియు, కఠినుడును, యగు నిరంకుశాంగ్లేయుడే. 1858 డిసెంబరు నెల కలకత్తా రివ్యూలో, యీ యుదారాశయు డగు ఆర్నాల్డుదొర "హైందవుల తప్పులు. ఆంగ్లేయుల యపవాదములు" (Indian Faults and English calumnies) యను వ్యాసములో, యిట్లు వ్రాసియున్నాడు: *

"యూరోపునకును, యేషియాకును, చాల భేద మున్నదని, లేక, యింగ్లాండుకును, ఇండియాకును, చాల తేడాయున్నదని, మన లిబరలుపక్షమువారు, మరచినట్లు న్నారు. ఆంగ్లేయుల కెంతస్వేచ్ఛ నొసగినను, అధికము కాజాలదు. హైందవుల నెంతయణచిపెట్టినను, యెక్కువ కాజాలదు."

"..........నిరంకుశముగా పాలించుట, యింగ్లీషువాని నవమానించుటయే. హిందూస్థానీయుని, స్వేచ్ఛగా వదలుట, వానిని పాడుచేయుటయే!"

ఎంత నిష్పక్షపాతబుద్ధి! ఎంత యుదారాశయములు!! ఆర్నాల్డును, తన యభిప్రాయానుసారముగా, పోనిచ్చుచో, హిందూదేశములో, దేశీయప్రభువు నొ

* తరువాత, దానిని, మరికొన్ని వ్యాసములతో కలిపి, యీ తనిపేర, తిరిగి ప్రచురించిరి.

క్కనినైన, సింహాసనభ్రష్టుని జేయకుండ, నుండనిచ్చెడి వాడు గాడు. ఈతని యభిప్రాయము ప్రకారము:

"పొడవగు గసగసాలచెట్లు, యెప్పుడును, క్షేమముగా నుండవనుట, మును పెంతనిజమో, యిప్పుడును అంతియే నిజము."

సంస్థానాక్రమణాలవిషయములో, యీతని యభిప్రాయము లిట్లుండెను:

"మన కిష్టమున్నను, లేకపోయినను, దేశీయసంస్థానాక్రమణము, మనకు కర్తవ్యము, విధి; భవిష్యత్తునందుగూడ నట్లే యుండగలదు."

"ఒకసారి, యీ ఆక్రమణవిధానమునుండి విరమించితిమేని, మనము యిండియాను వదలి పోవలసిన గతి పట్టగలదు."

మన మెంత సామరస్యబుద్ధితో చూచినను, యూరోపియనులయు, ఆసియనులయు, యుద్దేశములు, ఆశలు, భయములు, కోరికలు, ప్రేమలు, అసహ్యములు గూడ పరస్పర విరుద్ధములుగానే యుండును. మన మీదేశమందుండునంతవరకు, ఆసియనులు, యూరోపియనులకు జో హో రొనర్పుచుండుటయే, చరిత్రలో కాన్పించగలదు. దీనినే తెల్లవారి నిరంకుశత్వము, క్రూరత యను-చో, మనము వెంటనే, యీ దేశమును, వదలి పోవలసి యుండును.

పన మిక్కడ నుండదలచినచో, మనస్సులలో పాపభీతిని
పారద్రోలుడు. మన జీవితపథమును, ఆసియనుల దృష్టితో
చూడజాలము, చూడగూడదు. మన మెంతసేపును,
యూరోపియను పద్ధతులనే యవలంబించవలయును. సహా
శీలత, పరస్పరసానుభూతి, కుటిలనీతియు, మనకు, చాల
యుపకరించి యున్నవి; ముం దుపకరించ గలవు. ఈ మన
పద్ధతి దేశీయులకు, అప్రత్యక్షముగాను, తక్కువ బాధా
కరముగాను, యుండగలదు. కాని మన కార్యము లవ్యా
హతముగా కొనసాగి పోవుచుండును. మనకు లోబడి
యున్న ప్రజలకు, లోబడవలసియున్న ప్రజలకు, మాత్ర
ము, మనవిధానము యెంతమాత్రమును, సమ్మతముగా
లేదు, ముందు సమ్మతముగా నుండజాలదు.”

“.........కాని ఒక్కమాట. పెద్ద యుద్యో
గములకు మాత్రము, దేశీయులను చేర్చుకొన వలదు.
ఎందుచేత ననిన, వారు నమ్మదగినవారు కారు. (మన
యభిప్రాయము ప్రకారము). వారి యభిప్రాయములును,
మన యుద్దేశములును గూడ, కొనసాగుట, సంభవమా?
.........ఇప్పుడున్న యుద్యోగములకన్న, యున్నత
ములగు వానిలో, మనము, వారిని, నియమించకూడదు.
ఈ యుద్యోగములైనను, ముందుముందు యివ్వగలమా
యనునదే సందేహాస్పదము! మన మెంతయోగ్యులమో,

దేశీయులును అంత యోగ్యులే కావచ్చును. వారి నైతిక పథము, మన నీతిపథమువలె, నిర్మలము గావచ్చును. అంతేగాని వారుమాత్రము, మనకంటె భిన్ను లనుమాట కూడ నిజము గాదా? ఈ రెండింటికని సంఘర్షణము వచ్చినపుడు, మన యభిప్రాయములను, వ్యక్తపరచినరీతినే కొనసాగింపవలసి యుండును.''

ఆర్నాల్డుయొక్క యీ యభిప్రాయములను చూచితిరి గదా! ప్రభుత్వ పాఠశాలలలోను, కళాశాలలలోను, బైబిలు బోధన కూడదను, సువ్యక్తాభిప్రాయము బాబూ శ్యామచరణావను మహాశయుని దని, మీకు స్పష్టమే కదా! ఈతని పట్టుదలచేతనే, అప్పటిలో బైబిలు బోధన, యిండియాలోని పాఠశాలలలో ప్రవేశపెట్టబడలేదు. భారతప్రభుత్వము, బహిరంగముగా క్రైస్తవ మతమును ప్రోత్సహింపకపోయినను, యిండియాను క్రైస్తవముగా నొనరింప గలంతయును, శక్తివంచన లేకుండ జేయుచునే యుండిరి. ప్రభుత్వమును, తదుద్యోగులును, క్రైస్తవ మిషనరీలకు, అనేక సదుపాయములను గలుగజేసిరి.

భారత దేశీయ సైన్యములలోని, 'హీథెన్', మసల్మాన్ సిపాయీలను, క్రైస్తవులనుగా జేయుటకు, పరమపవిత్రులైన క్రైస్తవసేనాధిపతు లొనరించిన, నిరం

కరప్రయత్నములే, 1857-వ సంవత్సరపు 'సిపాయీల కలహాము'కు, ముఖ్యకారణములు. 'ఒక వంగదేశపు హైందవుని'చే వ్రాయబడి, 'భారతవిప్లవమునకు కారణములు' అను పేరు గలిగి, లండనులోని, 6 ఛారింగుక్రాసునుండి 'ఎడ్వర్డు స్టాన్‌ఫోర్డు'చే ప్రకటింపబడి, యుండియాలో, మద్రాసు సుప్రీముకోర్టు రెండవ న్యాయాధికారియు, గవర్నమెంటు ప్రొవిన్షియల్ మెంబరును, యయిన 'మాల్కామ్ లెవిన్'చే సంపాదిత మైనట్టియు, కరపత్రములో, 1857 ఆగస్టు 18 తేదీని, యిట్లు వ్రాయబడి యుండెను:

"ఈ సంవత్సర ప్రారంభములో, (7857) భారతీయ సైన్యములలోని 'కలనల్' లందరును, సిపాయీలను క్రైస్తవులనుగా జేయుటకు ప్రయత్నించుచున్నారని తెలియవచ్చెను. వీరు శ్రద్ధగలవారు గావచ్చును, గాని మతిహీనులు కూడను. పాఠశాలలలోను, కళాశాలలలోను, మిషనరీలు చేయు మతబోధవలన బాగుగా యుపయోగించుట లేదని, తలచి, త్వరలో భారతదేశమును క్రైస్తవ మొనరింపదలంచి, సైన్యరంగమున ప్రవేశించిరి. ధనసంపాదనకొరకుగాని, వారి రుచులకు మతబోధ సరిపడబట్టిగాని, వా రీపనిలోనికి దిగియుండరనుట, నిర్వివాదాంశము. కేవలమూ, సిపాయీలను, క్రైస్తవులనుగా జే

యుటకే, మూర్ఖత గలిగియుండిరి. పల్లెపల్లెకును తిరుగ బని లేదు, ధనవ్యయ మక్కరలేదు, శ్రమ మవసరము లేదు, మరి యితరసౌకర్యము లెన్నియో యున్నవి. సైనికులు శాంతిసమయములలో బహుతీరికగా నుందురు గదా; ఎటుజూచినను "హీథెన్"లు గుంపులుగా యుంటూం టారు. వీరిలో మతబోధ చేసిన మంచిఫలిత మొనగూడ గలదు. ఇట్టి నీచకృత్యమునకు తగని పట్టుదలతో, బుద్ధి హీనతతో, అవివేకతతో, అనాలోచితముగా, యీ క్రైస్తవాధికారు లీపనిని ప్రారంభించిరి. వీరు హిందూ మహమ్మదీయ సిపాయీలలోను, ఆఫీసర్లలోను మతబోధ చేయుట, బైబిలు తర్జుమాలను, వారి వారి మతమును దూషించుచు వ్రాసిన కరపత్రములను పంచిపెట్టుట, మొదలగు కృత్యముల నొనర్చుటకు ప్రారంభించిరి. మొ దట సిపాయీలు, సహించి, యూరకొనుచుండెడివారు. ఒక్కొక్కపు డసహ్యముతోను, మరియొకపుడు నిరసనా భావముతోను, యీ అత్యాచారములను చూచుచుండిరి. కాని, యీపద్ధతి విరమింపబడక, ముదురుచుండెను. రో జురోజుకు, క్రైస్తవులనుగా మార్చు ప్రయత్నము లను పేక్షణీయములై, బాధాకరములు గాజొచ్చెను. ఉభయ మతముల సిపాయీలును దిగులు జెంద నారంభించిరి. ఈ యమర్యాదాకరమగు కృత్యముల నుపేక్షచేసి యూరకొ

ు, తమ పూర్వులను, తమ మతమును, యవమానిం
టయే యని తలంచి, రాత్రి సభలను జరపుచుండిరి.
ని యేనిశ్చయమునకును, రాలేకపోయిరి. ఈలోపున
విత్రప్రకృతిగల, యీ మతాచార్యు లూరకొంటిరా?
ాయీలు సహించి యూరకొనుటతోనే, యీ 'మిష
కలనల్', 'పాదిరీ లెఫ్టినెంటు'లు, మరింత విజృంభించి,
ందూ మహమ్మదీయ మతములను ఖండించి, యవమా
ుచుటలో, ముందడుగు వైచిరి. హిందువులను, మహ
మ్మదీయులను, వారి పరిహాసపాత్రములైన కోట్లకొలది
ల్లరదేవతలను, వారి రాము, మహమ్మదులను, పరిహ
ించి, వారు మానవపశువు లనియు, గొప్ప మోసగాం
డనియును, పలుగాకులనియు, బహిరంగముగా, చాట
ొచ్చిరి. క్రైస్తవమతమును, నమ్మి, యేకమాత్రుడగు,
ురమేశ్వరుని, అతని పుత్రుండగు యేసుక్రీస్తుద్వారా, గొ
ించి, ముక్తిని బొందుడని బోధించిరి. ........క్రమ
క్రమముగా, యీ మతబోధకులగు 'కలనల్'లు, సిపా
యీలకు లంచములను, బహుమతులను, యాసపెట్టిరి.
తమ యధికారమును, దుర్వినియోగపరచి, లజ్జాహీను
లై, తమకు ప్రసక్తిలేని మతవిషయములలోకూడ, జూప
నారంభించిరి. మతము త్యజించిన ప్రతిసిపాయిని హవల్దా
రుని చేయుటకును, ప్రతిహవల్దారుని సుబేదారు మేజరుగా

చేయుటకును, వాగ్దానములను చేయజొచ్చిరి. ప్రతి సిపాయియు, తన యసంతృప్తిని వెలిబుచ్చిరి. ఖండితముగా, తమ యనంగీకారమును సూచించిరి. ఈ విరామరహితములగు ప్రయత్నములకును, పుస్తకములకు, కరపత్రములకు, ఖర్చుచేయు, అసంఖ్యాకద్రవ్యములు, తెల్లవారియొక్క ప్రత్యేకసహాయమువల్లనే, లభించుట లేదనియును, దీనికంతకును క్రైస్తవ ప్రభుత్వమే మూలాధారమై యున్నదనియును, యనుమానించిరి. సిపాయీలు తమ యభిప్రాయములను, కష్టనిష్ఠురములను, తెలుపుకొనిరి. కాని పత్రిక లన్నియును, యీ 'మతబోధకులను' చివాట్లు పెట్టుటకు మారుగా, సిపాయీలను పరిహాసము చేసివైచెను.''

సిపాయీవిప్లవమును గురించి ప్రచురింపబడిన పుస్తకములు, కరపత్రములు, వ్యాసములు, విమర్శనలూ, అసంఖ్యాకములు. త్రైమాస, మాస, వార, దినపత్రికలలో వేటిలోను, ఆరోజులలో, యీ 'వంగదేశపు హైందవుని' వ్రాతలను, ఖండించుచు వ్రాసిన, క్రైస్తవుడే లేడు. అందుచే దీనిని సత్యేతరమని త్రోసివేయుటకు వీలు లేదు గదా!

ఈతడే, యింకను, యిట్లు వ్రాసెను:

''విప్లవ ప్రారంభములో, గవర్నరు జనరలు, ప్రకటన నొకదాని నొనరించెను. ''మా ప్రభుత్వ మెన్న

డును, దేశీయుల మతములతో, జోక్యము గలిగించుకొని యుండలేదు. భవిష్యత్తునందుకూడ, యట్లు చేయజాలదు.'' కాని మొదటి విషయము, కేవలము శుద్ధాబద్ధమని, యీ పరమప్రభునకు, హిందూదేశము, మౌనము చేతనే ప్రత్యుత్తర మొసగెను. ఇక రెండవవాగ్దానము నిట్లు నిరసించిరి. "ముం దట్లు చేయరని, మాకు నమ్మకమెట్లుండగలదు ? ఇదివరలో, యీ ప్రభుత్వమే, తనమత తాటస్థ్యసిద్ధాంతమును, వీటిబుచ్చి, మతవిషయములలో కలుగజేసికొన లేదా ?''

చాలును. ఈ 'హీథెన్' యొక్క వ్రాతల నుదాహరించుట మాని, యింక నీపత్రికకు సంపాదకుడగు, నా బ్రిటీషు క్రైస్తవుడు 'మాల్కొమ్ లెవిన్' యొక్క వ్రాతను చూచెదముగాక.

"మన మొకరినొక రెరుంగము. మానవసంఘ సభ్యతలో, మనకు చాల అంతరము గలదు. 'స్పార్టాను లకును, హిలాటులకును, యెంతయొక మతస్యకారణములు గలవో, మనకును యంతియే గలవు. మానవజీవితమును వాంఛనీయముగాను, సుఖకరముగాను, యొనరించు ప్రతి వస్తువును, బలవంతముగా ప్రజలనుండి లాగుకొని, వారిని సభ్యులనుగాను, మానవులనుగాను చేయగల ప్రతియత్నమును, యెదిరించి, వారికి ప్రబలశత్రువుల మైతిమి; వారి

మతముల నవమానించితిమి; వారి జాతిని, నిరసించితిమి; వారికి పరంపరానుగతములగు, వారసత్వపు హక్కులను, వివాహ నిబంధనలను, రద్దుపరచి, త్రోసివైచితిమి; వారి మతములలో పరమపవిత్రములగు కర్మలను, మనము త్రృణీకరించితిమి; వారి దేవాలయములయు, ధర్మములయు, ఆస్తులను, ప్రభుత్వస్వాధీనము చేసికొంటిమి; ప్రభుత్వ పుస్తకములలో, వారిని 'హీథెన్' లని పేర్కొని, న్యూనత పరచితిమి; వారి మహారాజులయు, ప్రభువులయు, రాజ్యముల నాక్రమించి, ఆస్తుల నపహరించి, జమీందారుల యెస్టేటులను, ప్రభుత్వమునకు, సంక్రమింప జేసితిమి; పన్నులను కూరిరవిధానములచే, విధించి, వసూలు చేసితిమి; దేశీయుల ప్రాణ మాన ధనములకు విలువ లేకుండ జేసితిమి; దేశమునంతను, మన నిర్బంధవిధానములచే, క్షోభింపజేసితిమి. ప్రపంచములోనికంతకును నతిపురాతనమగు, నిరంకుశప్రభువులను, వారి పాలనమును, తొలగించి, వారిని బాధింపలకన్న నధముల నొనరించియు, మనకు తృప్తి లేదు."

"తన వంశౌన్నత్యమునకు గర్వించు, తన మతప్రచారమునకై యత్యంతాసక్తిని చూపు, నా పాప్సుబరీ ప్రభువు తన స్వవిషయమున, యిట్టి మార్పునకు, అంగీకరించ గలడా?"

క్రైస్తవప్రభుత్వనిర్మాణతత్త్వము

"ఈ కవితో, నే నన్ని ముఖ్యవిషయములలోను, యేకీభవించుచున్నాను. మన పత్రిక లన్నియును, ప్రతీకారము కొరకై, ప్రోత్సహించుచున్నవి; మతములపై యుద్ధమునకు పురిగొల్పుచున్నవి; క్రైస్తవమతబోధనకై వేగిరించుచున్నవి. వీనినన్నిటిని చూచి, నామనస్సు, ఖేదపరీత మైపోవుచున్నది. ఏహిందువులసభ్యత, వేలకొలది సంవత్సరములనుండి సుప్రతిష్ఠితమై యున్నదో, యింగ్లాండు, ప్రపంచములో నెవ్వరికిని తెలియబడకపూర్వమే, యేవారినాగరికత పరిపూర్ణమై యుండెనో, యేహిందువుల కళాకౌశలమునకు, వారి దేవాలయాదులు సాక్షీభూతములై యున్నవో, యెవ్వరి శాంతసత్త్వవర్తన మన కనుభూతమో, యట్టి హిందువుల మతమును, సభ్యతను, కుంకటిర్రేళ్లతో పెల్లగించియు, మనకు సాధ్యమగునా, యనునదే, నా సందేహము. ఇంగ్లాండు ప్రయోగింపగల, గరిష్ఠబలముకూడ, యీ జాతిని కదిలించజాలకపోవచ్చునని, చూచినవారు గ్రహింపకపోరు."

"పండునుబట్టి, చెట్టును, గ్రహింప వీలగునని కదా చెప్పుదురు. ఇంగ్లాండు, యిండియాల మతములకు, పరీక్షాసాధనములుగా, ఆయా మత నీతి నియమములను గ్రహించి, సరిపోల్చినచో, యిండియాకు, ఓటమి కలుగునని తోచదు."

# 3. మహమ్మదీయమతము నణచివేయుట

ఈ క్రిందివిషయములు, 1858 మార్చి నెల, 'కలకత్తా రివ్యూ', 163-వ పుటలో వ్రాయబడి యున్నవి.

"వర్తమాన సంవత్సరములో జరిగిన కార్యముల ఫలితముగా, ప్రజలలో* విశేషాందోళన మేమియు లేనిచో, ఆశ్చర్యకరమే యని చెప్పవచ్చును. కాలానుగుణ్యముగానే ప్రజలనుండి, యీవిధమైన కేకలు వినవచ్చుచున్నవి: "హిందూదేశము క్రైస్తవము గావలెను", 'హిందూదేశము, యూరోపియనులకు వలసదేశముగా నుండవలెను', 'మహమ్మదీయమతము నణచివేయవలయును', 'దేశభాషలను త్రోసివైచి, మన మాతృభాషను, ప్రచారముకు తేవలయును." ప్రజల యాందోళనలలో, యివి లేశమాత్రమే. అయినను మనలను ఆశ్చర్యసముద్రములో ముంచజాలినవై యున్నవి. ప్రజల యుద్రేకపూరితవాక్యములును, ఆందోళనలును, రాజకీయ చర్యలకు కారణములవగల్గినచో, అథవా తర్కముయొక్కయు, ప్రజాభిప్రా

* ప్రజలలో, యంటే, తెల్లవారిలో యనియే.

యముయొక్కయు. స్థల మాక్రమింప జాలినచో, ప్రజ
లచే యింత గాఢముగా వాంఛింపబడుచున్న యీ ము
ఖ్యములై, ఆచరణ యోగ్యములైన కోరికల ప్రకారము
చేయుటయే, ప్రభుత్వముయొక్క కర్తవ్యము.”

కానింగు ప్రభువు, యీ మహమ్మదీయమతము
నణచివేయవలెనన్న యాందోళనను, సరకుగొనలేదన్న
కారణముచే, యాతని నా యుద్యోగమునుండి తప్పించి,
యింగ్లాండుకు పిలిపించవలెనని, *ప్రజలు పిటీషను పెట్టు
కొనిరి. ‘డ్యూక్ ఆఫ్ ఆర్గిల్’చే వ్రాయబడిన వ్యాసము
నుండి, యీ విషయము స్పష్టము గాగలదు.

“విప్లవపురోజులలో కూడ, కానింగుప్రభువు, అ
వకాశ మున్నప్పుడెల్ల, దేశీయులయందు సంపూర్ణవిశ్వాస
ముంచినట్లు, కనబడుచున్నాడు. ఆంగ్లేయ ప్రభుత్వము
లోని, సివిలు శాఖలలో దేశీయుల కుద్యోగము లీయ
కూడదని, చాలకాలమునుండి యాందోళన చేయుచు
న్నను, యిటీవల యీ యుద్యోగములలో, మిక్కుటము
గా, దేశీయులే చేర్చబడుచుండిరి. విప్లవము భయంకర
ముగా చెలరేగిన రోజులలో, యీ యుద్యోగీయులలో
కొందరియొద్ద, విద్రోహసూచనలు కాన్పించినవి. కాని,

* ఇట్టి స్థలములలో ప్రజలన్న, తెల్లవారనియే, పాఠకులు
గ్రహింతురు గాక.

కానింగుప్రభువు, మూలకందనుగు. నీ పద్ధతిని మార్పుచే యుటకు సమ్మతించలేము. కానింగును, యింగ్లాండుకు పిలిపించవలసినదని, కలకత్తా వాసులైన యూరోపియ నులు వ్రాసిన పిటీషనులో, యిటీవల పాట్నా డిఫ్యూటీ కమీషనరుగా, మహమ్మదీయు నొకనిని, నియమించు టయు, యింక కొందరు మహమ్మదీయులను విశ్వాసార్హ ములైన యుద్యోగములలో నియమించుటయు, తద్ద్వారా వంగదేశమందలి యూరోపియనులను, నిరుత్సాహ పరచు టయు, మొదలగునని కొన్ని ముఖ్యకారణములై యు న్నవి.'' *

ఎల్లెన్‌బరో ప్రభువు గవర్నరు జనరలుగా వచ్చిన వెంటనే, చంద్రధ్వజుల నణచియుంచుటయే, తన రాజనీతి యనియు, వారిస్థితిని బాగుపరచు యే కార్యములలోనైనను, తాను సహాయము చేయకుండుటయే గాక, వాటిని నిరుత్సాహ పరచుటకూడ తన కార్యక్రమము గాగలదని, నొక్కి చాటెను. సిమ్లానుండి, 1842 అక్టోబరు 4 తేదీని, 'డ్యూక్ ఆఫ్ విల్లింగ్టన్'కు, కాబూలు, ఘజినీలు పతన మొందినతర్వాత, యిట్లు వ్రాసియున్నాడు:

* India under Dalhousie and Canning, Page 93. By Duke of Argill, from the 'Edinburgh Review' of January and April, 1863; London, Longman, Green, Longman, Robert, and Green, 1865.

"ఆఫ్ఘనిస్థానములో, మనయొక్క అపజయమునే, యిచ్చటి మహమ్మదీయులు వాంఛించి యుండిరి. మన మీదనే కేవలమాధారపడి, మననౌకరులై యున్నవారిలో కూడ, యిట్టిభావమే వ్యాపించియున్నది."

"........తద్వ్యతిరేకముగా హిందువులు సంతోషమునే పొందిరి. పదియవవంతు జనుల శత్రుభావము మనకు స్పష్టముగా కాన్పించునపుడు, తొమ్మిదివంతుల జనసంఘముగల, విశ్వాసపాత్రులైన హిందువుల, సదభిప్రాయమును, సహాయమును, సంపాదించుట, మనకు శ్రేయస్కరము కాగలదు."

మరియొకసారి, 1843 జనవరి 18 తేదీని, యీ ఎల్లెన్‌బరో ప్రభువే, డ్యూక్ ఆఫ్ వెల్లింగ్టన్‌కు వ్రాయుచు, యిట్లు తెలిపెను:

"స్వతస్సిద్ధముగా, యీజాతి (మహమ్మదీయులు) మనయందు, మిక్కిలి ద్వేషభావము గలదను వాదనలో చాల సత్యము గలదు. అందుచే మనయొక్క నిజమైన రాజనీతి, యేదన, హిందువులను జేరదీసి, మెల్లగా దువ్వుచుండుటయే."

ఈ ప్రభూత్తముని విచిత్రమనోప్రవృత్తికిని, మహమ్మదీయులయందలి ద్వేషమునకును, కారణ మీక్రింది

ఘటన కాజాలునేమో! ఈతని భార్య, యీతనిని వదలి వైచి, యొకానొక అరబ్బీనాయకుని జనానాలో, స్వయముగా పోయి, చేరియుండెను.

ఎల్లెన్‌బరో, సింధుదేశపు అమీరుల నందరిని, నీచముగా నవమానించి, వారి రాజ్యముల నన్నిటిని, ఆక్రమించి, ఆంగ్లరాజ్యములో కలిపెను. మహమ్మదు ప్రవక్తయొక్క, అనుచరులయం దీతనికున్న ద్వేషమున కిది గొప్ప తార్కాణ గదా!

ఇండియన్ మ్యూటినీ కాలములో యీతడు జీవించియే యుండెను. ముసల్మానులయెడల యీత డెంత యీర్ష్యాగ్నిని రగుల్కొలిపెనో, యూహింపలేము.

మహమ్మదీయు లింత ద్వేషపాత్రు లగుటకు కారణములను, 1858 లో ప్రచురింపబడిన యొక కరపత్రము వల్ల తెలిసికొనగలము. బెంగాలు సివిలుసర్వీసులో పని చేసి, విరమించిన 'హెన్రీ హేరింగ్టను థామస్' అను ఆంగ్లేయునిచే, యీ కరపత్రము వ్రాయబడెను. ఈతని యభిప్రాయముప్రకారము, మ్యూటినీకి కారకులు, మహమ్మదీయులే యని; ఆత డిట్లు వ్రాసియున్నాడు:

"ఈ విప్లవమునకు, హిందువులు కారణులును, కారకులును కూడ కారని, నేను చెప్పియేయున్నాను

గదా. ఇంక దీనికి మహమ్మదీయులే కారకులని చూపె
దను. ఈకుట్ర, మన మనుకొను దానికన్న పూర్వమునుం
డియు, జరుగుచునే యున్నది. విప్లవకారకు లనుకొనిన
దానికన్న, కొన్ని కారణాంతరములవల్ల, త్వరలోనే
యీవిప్లవము బలపడి, బహిరంగముగా చెలరేగెను దే
శములోనున్న ప్రతిక్రైస్తవపురుషుని, స్త్రీని, శిశువును,
దారుణముగా వధించుటకు తలపెట్టిన, యీ యుద్యమ
మునకు, పునాదులు వేసినవా రెవరు? బీజావాపన చేసి
పోషించిన దెవరు? హిందువులను వారి స్వబుద్ధికిని,
వారి కార్యనిర్వహణాసామర్థ్యమునకును, వదలివైచిన,
వారెన్నడును, యిట్టి దారుణకృత్యమును చేయరు, చేయ
లేరు.........కాదు. మనము యీ భయంకరవిద్రో
హముకు, మూలకారణమును వెదుకవలె ననిన, హిందు
వులలో, కాదు వెతుకవలసినది; మహమ్మదీయులలోనే
గాలించవలయును.........కాని మనలను పూర్తిగా నా
శనమొనరించుటకు, పన్నబడిన యీ కుట్రలో, హిందు
వులకన్న, మహమ్మదీయులకు గలకారణములను, పూర్తి
గా అవగాహన చేసికొనవలయు నన్నచో, మహమ్మదీ
యుల స్వభావములను, సిద్ధాంతములను, తెలిసికొననిదే,
సాధ్యము కాదు. పూర్వపు 'ఖలీఫా'ల కాలమునం దె
ట్లుండిరో, నేటికిని, మహమ్మదీయు లట్టి స్వభావమునే

గల్గియున్నారు. క్రూరత్వము, పరమతాసహనము, దు ర్వము, మూర్ఖత్వము, యేకుటిలమార్గములవలనగానీ, మ హమ్మదీయ రాజత్వమును నిలుపుట కెడతెగని ప్రయత్న ములు చేయుట, క్రైస్తవులయెడల ద్వేషభావము, యి యే మహమ్మదీయుల ముఖ్యగుణములు. ఏ యితరమత మునకు సంబంధించిన ప్రభుత్వము, గానిండు, వీరు దా నిని కూలద్రోయుటకు ప్రయత్నించుచునే యుందురు 'ఖురాన్' యందలి 'ఆజ్ఞాసూత్రములు' యితరమతప్రభు త్వము నోర్వజాలవు. మహమ్మదీయుడు కాని ప్రభువు క్రింద యుండుటయన్న వీరికి కంటకముగానే యుండును. ఈ కారణములచే, వీరియెడల నెంత ప్రత్యేకాభిమాన మును చూపినను, గౌరవించినను, వారు తృప్తినొందలేరు. కాని, వారు, లొంగియున్నట్లు, యవకాశము లభించు దాక, నటించగల నేర్పుగలవారు. వారి నిజమగు స్వభా వము, అవకాశము లభించినపుడే ప్రత్యక్షమగును......

..భారతదేశములో మనయందు వారికి ద్వేష మంకురిం చుటకు, యితర కారణములు కూడ గలవు. వా రనేక తరములనుండి. ఇండియాలో ప్రభుత్వమును వహించి యున్నారు. ఈ బ్రిటీషు ప్రభుత్వమును కూలద్రోయగల్గ నవో, తాము తిరిగి హిందువులపై ప్రభుత్వమును చెలా యించవచ్చునని; వారి గాఢవిశ్వాసము. దేశీయపటాల

ములలోని, యసంతృప్తిని, గ్రహించి, కుట్రలచే దానిని జ్వలింపజేసిరి. కాని హారిక, హిందువుల తోడ్పాటు లేని దే, జయించగలమన్న, విశ్వాసము లేకపోవుటచే, హిందూసైన్యములను, తమతో చేర్చుకొనుట కూహించిరి. అందుచే, 'మీ మతము అపాయస్థితిలో నున్నదనియు, యీ ప్రభుత్వము మిమ్ములనందరను క్రైస్తవులుగా చేయుటకు ప్రయత్నించుచున్నదనియు', బ్రాహ్మణులలో ప్రచారము చేసిరి. బ్రాహ్మణులును, వారి ప్రచారమును నమ్మి దానిని తమవారిలో, ప్రతిధ్వని పజేసిరి.........

మహమ్మదీయులు, జాతీయముగా, హిందువులకన్న బుద్ధిలోను, విద్యలోను, చాల యధికులు. పోల్చి చూచినచో, హిందువులు, మహమ్మదీయులముందు, కేవలము శిశుప్రాయులు. ఇంతేకాక మహమ్మదీయులయందు కార్యనిపుణతయు, కార్యధురీణతయు, హెచ్చుగా నుంటచే, ప్రభుత్వోద్యోగములయందు వారినే యెక్కువగా నియమించిరి, అందుచేతనే ప్రభుత్వవిధానములను, తత్వములను, యెప్పటివప్పుడు తెలిసికొనజాలి యుండిరి ఈ కారణముచేకూడ, వారి యూహలకు, ప్రాముఖ్యత గల్గించుటకు, వీలు కలిగెను.........ఈ కుట్రసంతను, మహమ్మదీయులే పన్ని, నడిపించిరి. కేవలమూ మహమ్మదీయులు, తమ ఆధిక్యతను సంపాదించుటకై నలిపిన యీ

కుట్రకు, వంగదేశపు హైందవసిపాయీలు, ఉపకరణపాత్రులు; మహమ్మదీయుల చేతిలోని కీలుబొమ్మలు.*

ఈ గ్రంథకారుడే, మహమ్మదీయులను క్రైస్తవమతములోనికి చేర్చుట, యసంభవమని చెప్పుచు, యిట్లు వ్రాసియున్నాడు:

"మిషనరీలు మహమ్మదీయుల నెన్నటికిని, యొప్పించలేరు. అట్లు యొప్పించలేకపోవుటకు కారణము, యీతడు క్రైస్తవు డగుటయే సాధారణముగా మహమ్మదీయు డెన్నడును, యీతని వాదనలను, యుపదేశములను, విననేవినడు. ఒకానొకవేళ, వానిని, పూర్తిగా తిరస్కరింపకపోయినను, వారి వాదములను, చెవులలో దూరనివ్వడు. మహమ్మదీయులకంటె హిందువులు, స్వతస్సిద్ధముగా మెత్తని హృదయము గలవారు, మూర్ఖత లేనివారును యగుటచే, మిషనరీల వాక్యములను, సావధానముగా విని, వారికి లోబడుచుందురు."

Ibid Page 26.

విప్లవకాలములో స్త్రీ పురుష విపక్షత లేకుండ, క్రైస్తవు లందరిపైనను, మహమ్మదీయులు, దారుణమగు యత్యాచారములను సలిపిరని, గ్రంథకారు లనే

* The Late Rebillion in India and Our Future Policy, Pages 13-17; By Henry Harington Thomas. London, 1858.

కులు వ్రాయుచున్నారు. కాని క్రైస్తవాధికారులకు, మహమ్మదీయులపైగల పక్షపాతమును చూచిన, యిం దెంతవరకు నిజము గలదో యని, సందేహించుట కవకా శము గలుగుచున్నది. 'కలకత్తా రివ్యూ' పత్రిక యీ క్రింది వ్రాతను, గుండెలు లేకుండ, వ్రాయగలిగినది:

"మహమ్మదీయమతము నణచివేయవలెను."

"ఇంగ్లాండుయెడల, అత్యంత ద్వేషభావమును చూ పిన, మహమ్మదీయుల విషయములో, యింకముందునుండి కఠినమును, క్రూరమునైన సైనికరాజనీతిని మాత్రమే చూపవలయునని, యభిప్రాయ పడుచున్నాము. కాని, మీరొక ప్రశ్న నడుగవచ్చును. మన భావిరాజ్యాంగ తత్త్వమును నిర్ణయించుకొననిదే, వీరితో ద్వేషభావమును గలిగించుకొన వచ్చునా? యని. ఏ మూడుకోట్లజనుల నజ్ఞానాంధకారములోనే యుంచివైచినచో, వారికి మన యందున్న ద్వేషభావములు రూపుమాయునో, యట్టి రాజనీతి మనకు క్షేమదాయకమా? రష్యావారు, డేగ వలె యిండియాపైబడి తన్నుకొని పోవలెనని, కనిపెట్టి చూచుచునే యున్నారు. వారిదృష్టిలో మహమ్మదీ యులు, మంచి యవకాశముకు, ఆశ కల్గించుచున్నారు. పరిషియావారికి మార్గము కాగలదు. ముసల్మానులలో విశాలదృష్టిని కలుగచేయుటకు తగిన విద్య, శిక్షణ వారి

కీయరించో, వారి నైతిక, మతవాతావరణమును, పవిత్రీ కరణ మొనరింప, బ్రయత్నింపనిచో, వారి నిట్టే యజ్ఞాన, మూర్ఖతాంధకారములలో నుంచియే యుందువో, మనము వారివల్ల నిరుపద్రవముగా నుండజాలము. జావా ద్వీపపు చిత్తడినేలలలో, ఆరోగ్యమున నాశించు వెంగ లికివలె, మనకును అప్రాప్యమైన విషయము. అట్లు చేసి మనము వారిని, గప్యాసేతులలోనికి, బుద్ధిపూర్వకముగా పోనిచ్చినవార మగుదుము. వారికి ప్రత్యేకముగా నేర్పవ లసిన విద్యావిధానమును, ఆలోచించి, వారికి తగు జ్ఞా నాభివృద్ధి నిచ్చుటకై మన మేమియు ప్రయత్నములు చేసియుండలేదు. కొందరు బుద్ధిమంతులు, వివిధపద్ధతు లను, ప్రణాలికలను, సూచించి యుండిరి. కాని వాస్త వము చెప్పవలసినచో, వారికి ఉత్తర అమెరికా యిండి యన్‌లను గురించి యెంత తెలియునో, మహమ్మదీయుల స్వభావసాంప్రదాయములను గూర్చియు, వారెరింగిన దంతియ. మహమ్మదీయులు, తరతరములనుండియు రా జ్యవిజేతలు. స్వతహా, రాజసగుణులైన, వీరికి, యీవిష యము చాల గర్వము కలుగజేయుచున్నది. ఈ జాతి వారు ఐదు శతాబ్దములనుండి, హిందూదేశములో ని రంకుశులుగా నుండుటయేగాక, వీరిపూర్వులగు తురు ష్కులు, తమ సామ్రాజ్యము నొకానొకప్పుడు, ఫ్రాన్సు

వరకును, వ్యాపింపజేసి యుండిరి. ఇట్టి, యీ మహామ్మ
దీయులకును, స్వతంత్రాభిప్రాయశూన్యులు, పిరికివారు,
ఆశ్రితులు, వానరముఖులు, యైన బంగాళీవారికిని, ఒకే
విధానముగల, విద్యాప్రణాళిక కూడియుండునని, వారు
అభిప్రాయ మిచ్చియుండిరి. అయిదు సంవత్సరములక్రింద,
యీ వ్యాసకారుడు, ఢిల్లీకి వచ్చి; యచ్చటి మహామ్మ
దీయ వార్తాప్రచారణాసైపుణిని చూచి, పరమాశ్చర్య
మును పొందెను. ఎంతవరకు మనము, మహామ్మదీయు
లందు విశాలదృష్టిని కలుగజేయమో, యంతవరకు వారి
యసూయాద్వేషములను శాంతిపగచమో, అంతవరకును,
యీ విరోధము చల్లారదు. కత్తిచే వారి విద్వేషము
నణచి యుంచగలమే కాని, చల్లార్పలేము.”

“మహామ్మదీయుల సదభిప్రాయమును, మనము
సంపాదింపలేమని, చాలమంది చెప్పెదరు. కాని, వారిని
మనపక్షమునకు చేర్చుకొనుటకు, మన మేమిప్రయత్న
ముల నిండియులో యొనరించితిమి? నీ యుద్యానమంత
టను అడవిపెరుగనిచ్చి, తర్వాత అడవిగానున్నదని విచా
రించిన ఫలమేమి? చరిత్రలో మనము చదువుచుండుట
లేదా! అక్బరు యెట్టి మతసహనమును, సంస్కరణము
లను,విజ్ఞానవ్యాప్తిని ప్రదర్శించెను? బాగాదులోని ఖలీ
ఫాలు కూడ, యీ విశాలమగు [illegible] లేదా?

స్పెయినులోని, తమ నాలుగు శతాబ్దముల పరిపాలనలో ను, మూరు లెట్టిసహనమును చూపిరి. మహామ్మదుప్రవక్త మరణానంతరము, అరేబియా యెడారులనుండి బయలువెడలిన మూక, యెట్టి క్రూర, పశు స్వభావములు గలది? వారి సంతతివారేయగు 'హారూన్ అల్ రాశ్శీదు' చక్రవర్తి, ఉద్యోగులు, యెట్టి నాగరకులు? మధ్యయుగ మందలి అరేబియన్ వాఙ్మయమును, శాస్త్రములును, పురాతన, ఆధునిక విజ్ఞానములకు, సంబంధము కలుపుట లేదా?''

Calcutta Review Vol. 30, Pages 22-23, June, January. 1858.

కాని తరువాత కూడ యిరువదియయిదు సంవత్సరములవరకును, బ్రిటీషువారు మహామ్మదీయుల ననుమాన దృష్టితోనే చూచుచుండిరి. హిందూదేశమందలి రాజనీతిజ్ఞులలో యెక్కడైనను, యిండియాయందు దేభాగము నందుండు మహామ్మదీయులనైనను, తన యభిప్రాయము లో నమ్మదగినవారుగా సూచించి యుండలేదు.

ఈ సూత్రము ననుసరించియే కాబోలు, బీరారును, నైజాముకు కీయకుండుట! మైసూరును న్యాయమైన హక్కుదారుడగు, హిందూరాజున కిచ్చుటకు, కారణ, మీ రాజనీతియేనా? అయి యుండవచ్చును. మైసూరు

నాక్రమించి, ఆంగ్లసామ్రాజ్యములో కలుపుకొనునెడల, సంధిపరతు ననుసరించి నైజాముకు కందులో సగము పైగా, యివ్వవలయును. ఇట్లు చేయుచో బీరారును, లాగుకొనుటవల్ల గలిగిన నష్టము కూడివచ్చుటయే గాక, నైజాము మిక్కిలి బలవంతుడు కాగలడు. ఆ కారణము ననే. మైసూరురాజ్యమును, న్యాయసమ్మతమైన హక్కుదారుడగు హిందూరాజున కిచ్చి, తమ న్యాయైకపరత్వమును చూపిరి.

అంబేలా దండయాత్రకును, వాహాబీల విచారణకును, రెండవ ఆఫ్ఘన్ యుద్ధమునకును, కూడ, బ్రిటీషు వారికి మహామ్మదీయులయందున్న యీ యభిమానమే కారణమై యుండవచ్చును. యూరోపులో, 1870 తర్వాత జరిగిన టర్కీ-యుద్ధమున కిదియే హేతువు ఆంగ్ల సామ్రాజ్యమహామంత్రి 'గ్లాన్‌స్టన్', గాఢమైన మతవిశ్వాసము గలవాడు. 'క్రూసేడరుల' యందున్న మూఢ విశ్వాసము, పశుత్వము కూడ యీతనియందు మూర్తీభవించి యుండెను. ఈ మహాత్ముడు చనిపోవువరకును, మహామ్మదీయ పతనమునకు, చేయగల కృషినంతను జేయుచునే యుండెను. టర్కీ-సామ్రాజ్యమునకు, యూరోపులో జానెపుస్థలమైన లేకుండ జేయుటకును, భూలోక సంబంధమై, నశ్వరమగు సమస్తసంపదలతో తగులాట

హిందూదేశము:

మును టర్కీ ప్రభుత్వమునకు వదిలించి, యూరోపు రాజకీయరంగమునుండి టర్కీకి 'స్వస్తి' చెప్పించుటకును, యీతని చల్లనిదృష్టియే కారణమని, చరిత్రకారులు చెప్పుదురు. 1882 లో యీజిప్టుదేశమును, పశువులముచే స్వాధీనము చేసికొనుటయు నీ మంత్రిపుంగవుని కాలములోనే జరిగినది.

"శాంతులు, పరమేశ్వరునిచే ఆశీర్వదింపబడుదురు. ఎందుచేతనన వారే యీ భూమిని పొందుటకు హక్కు గలవారు." అని క్రీస్తు తన యనుచరులకు చెప్పియున్నాడు. పవిత్రమైన న్యాయాధిక్యతగానిండు, బలము, బుద్ధినైశిత్యము, ధనము, యేదిగానిండు, వీటిని గలిగియున్నవారు మదాంధులై, యీపరమసత్యమును త్రోసిపుచ్చి, సోదరమానవులపై, అధికారమును, అత్యాచారమును, సలుప వెనుకంజ వేయరు. వారు గర్విష్టులు, క్రూరులు, మర్యాదాహీనులు, పశుతుల్యులు.

'ధాక్' చెప్పినట్లుగా,

"బలమే ప్రపంచమును శాసించినది, శాసించగలదు, శాసించును; సాధుత్వము (శాంతము) బలహీనత; బలప్రయోగమే జయసాధనము."

కాని శాంతము కట్టకడకు జయమును పొందగలదు గర్విష్ఠులై, అహంకారులై, తోటిమానవులను,

క్రూరముగాను, అవమానుషముగాను చూచువారు, తమ పతనమును, త్వరపెట్టుకొన్నవారగుదురు. తార్కాణకు దూరము పోనక్కరలేదు. మహమ్మదీయసామ్రాజ్యమును చూడుడు. ఒకానొకప్పుడు మహమ్మదీయుల చంద్రధ్వజము పశ్చిమమున యట్లాంటికు మహాసముద్రమువరకును, తూర్పున బంగాళాఖాతమువరకునుగల దేశములలో, సగర్వముగా యెగురుచుండెడిది. అర్ధశతాబ్దము క్రిందటివరకును తురుష్కసామ్రాజ్యము, ప్రపంచములో నొకమహాశక్తిగలదై యుండెడిది. ఈ సామ్రాజ్యములు, తను దారుణకృత్యములకై, మతస్పర్ధలచేలన 'కాఫిర్' లను పెట్టిన దారుణహింసలకై, ప్రతీకారముగా, నశించిపోయినవి. మూరులయు, పరిషియనులయు సామ్రాజ్యము లిప్పు డెందణగిపోయినవి ?

ఘనులైన మొగలుల నామశ్రవణమాత్రమున యఖిల క్రైస్తవలోకమును భయభక్తులచే వినమ్రమగుచుండెడిది. ఆ సామ్రాజ్య మెక్కడనున్నదో, కడపటి మొగలుచక్రవర్తులు క్రూరులై, వ్యభిచారులై, దురాచారులై, బుద్ధిహీనులై తమ పతనమును, తామై తెచ్చుకొనిరి.

క్రైస్తవులు తమ ప్రవక్త వచనానుసారముగా, తమ్మొమైహికధనసంపదలనుండి, వంచించినారని, మహా

హిందూదేశము:

మ్మదీయుల, యహోహా ! ఎందుచేతనన, మహామ్మదీయులు సాధువులు గారు; అట్టివారికి యీ భూమిపై యధికార ముండరాదు గదా, క్రీస్తు వచనానుసారముగా !! చూచితిరా, క్రైస్తవులకు, తమ రక్షకుని, వచనములయం దెంతగాఢాదరమో !!!

# ౪. ద్రవ్యోత్పత్తి సాధనముల నభివృద్ధి చేయుట

హిందూదేశములో, బ్రిటీషు పరిపాలనయందు, 'పరిపాలన'—'దోపిడి' యీ రెండును పర్యాయపదములు. ఎప్పుడు బ్రిటీషువారు యిండియాలో, తమ యధికారమును స్థాపించిరో, యప్పటినుండియు వారికి 'బంగారము' మాత్రమే వాంఛనీయముగా నుండెను.

ఇండియానుండి దోచుకొనిపోబడిన యపారధనము 'ఇంగ్లాండు'లోని వ్యక్తులను కోటీశ్వరుల నొనరించుటయే గాక యింగ్లీషువారికి తమ పరిశ్రమలను, పరిశ్రమాగారములను వృద్ధిబొందించుకొన జేసెను. కాని సిపాయీల విప్లవానంతరమునుండియు, యీ 'దోపిడి', మరియొక మార్గము ననుసరించెను. అంతవరకును యిండియాలోని 'హీథెన్' రాజుల రాజ్యములను కలుపుకొని, వారి యపరిమితధనరాసులను దోచుకొనుట కవకాశము లుండెడివి. కాని యప్పటినుండియు 'సంస్థానాక్రమణతత్వము'ను విరమింపబడుటచే, మరియొక మార్గ మవలంబించవలసి వచ్చెను. హిందూదేశీయుల ఖర్చుపై, ఆంగ్లేయులను

ధనవంతులనుగా జేయు మార్గము ననుసరింపవలయును. వారి యీ కుటిలనీతిని "హిందూదేశముయొక్క ద్రవ్యోత్పత్తిసాధనముల నభివృద్ధి చేయుట" యను శ్రావ్యమగు పదజాలముతో కప్పిపుచ్చిరి. ఈ సాధనములను వృద్ధి బొందించుట, యెట్లు, యేలదులకు, యనువిషయమును రహస్యముగా నుంచ బనిలేదు. 'డ్యూక్ ఆఫ్ ఆర్గిల్' యీవిషయమున యిట్లు చెప్పియున్నాడు:

"హిందూదేశముయొక్క ఉత్పాదనశక్తిని వృద్ధి బొందించుటకై యింగ్లీషువారి ధనమును, నేర్పును, యత్నమునుగూడ, సాధ్యమైనంత యెక్కువగా, వినియోగింపవలసిన యవసరమును గూర్చి, స్టాన్లీప్రభువు చెప్పిన మాటలు, చాల విలువగలవి."*

హిందూదేశముయొక్క ద్రవ్యోత్పత్తిసాధనముల నభివృద్ధి చేయుటకై యీ క్రిందివిధానములు, ముఖ్యముగా నవలంబించబడినవి. రైల్వేలను నిర్మించుట, ప్రత్తిపంట నభివృద్ధిచేయుట; బ్రిటీషు పెట్టుబడిదారులకు ప్రత్యేకహక్కుల నిచ్చుట; ఉద్యోగములలో నాంగ్లేయుల నెక్కువగా నియమించుట; హిందూదేశమునకు స్వపరిపాలనను నిరాకరించుట; ద్రవ్యసాధనోత్పత్తికై తగు యేర్పాటులు చేయవలె నన్నచో, చాల పెట్టుబడి కావల

* 'India under Dalhousie and Canning' Page 139.

యును గదా. ఇండియా యన్ననో కడు బీదది. అందు చే యితరదేశీయులనుండి, ఋణము చేయవలయును. ఆ రోజులలో యాంగ్లేయుల పెట్టుబడి, కుందేటికొమ్మువంటిది. కాని మట్టిపిల్లియయిన నేమి యెలుకలను పట్టుచో. ఈ యబద్ధపు ఇంగ్లీషు పెట్టుబడి పేరుచెప్పి, భారతదేశరక్తమును పీల్చివేయవలెను, శాలిస్‌బరీప్రభువు చెప్పినట్లు.

ఇవన్నియు యాధారరహితములైన మాటలను కొనుచుంటిరా? పాఠకులారా! యీ గ్రంథకారునిచేతనే రచింపబడిన, 'భారతదేశ వర్తకపరిశ్రమల వినాశనము' అను గ్రంథమును చూడుడు. (7-వ ప్రకరణము.)

## రైల్వే నిర్మాణము.

భారతదేశములో రైల్వేలను నిర్మించుటలో, హిందూదేశీయులకు చాల యన్యాయము జరిగినది. 'ఆంగ్లేయపెట్టుబడి' యనబడిన ధనముచే ప్రభుత్వ పూచీగల రణములపై యివి నిర్మింపబడినవి, ప్రభుత్వపూచీపై ధనము నిచ్చుటకు, దేశీయులు సిద్ధముగా నుండగా, యాంగ్లేయులనుండి ఋణము తేవలసిన యగత్య మేమి కలదో యాలోచింపుడు.

ఇందులోని మూలరహస్య మేమనిన, హిందూదేశీయుల వ్యయముపై యాంగ్లేయులను ధనవంతులనుగా

జేయుటయే. సుప్రసిద్ధులును, నిష్కపటులును యగు సర్ ఆర్థర్ కాటన్ మహాశయునివంటి గొప్ప యింజనీరు లనేకు లా రోజులలో బహువ్యయసాధ్యములైన రైల్వేల కన్న పంటకాలువలును, కంకరబాటలును, హిందూదేశమున కత్యవసరమని వ్రాసియుండిరి.

రైల్వేలకు వ్యయపరచు ప్రతిఅణాలోను యెనిమిది పైసలు, యింగ్లాండుకు పోవునవియే. హౌస్ ఆఫ్ కామన్సు లో 1890 ఆగస్టు 14 తేదీని, మాట్లాడుచు, 'స్విఫ్టుమేక్‌నీల్' మహాశయు డిట్లు నుడివియున్నాడు:

"రైల్వేలకొరకై వ్యయము చేయదలచిన ప్రతి షిల్లింగులోను, 8 పెన్నీలు, తిరిగి యింగ్లాండుకే వచ్చి చేరును." *

రైల్వేలను నిర్మించుటలో ఆంగ్లేయులకు వారి యొక లాభము గలదు. ఇండియానుండి గోధుమలు మొదలగు నాహారపదార్థముల నతిసులభముగా యెగుమతి చేయుట కివి సహాయకారులై, యింగ్లాండులో రొట్టెఖరీదును చాల చౌక చేయును గదా!

ఇంతేగాక యింగ్లాండుయొక్క పారిశ్రామికవస్తు

* Hansard's Parliamentary Debates Vol. 248. Page 1051.

వుల నిండియాలోని, మూలమూలలకు, త్వరలో వ్యాప్త మొనరించి, హిందూదేశీయ పరిశ్రమలను, వినాశన మొన ర్చుటకు, రైల్వే లెంతయో యుపయోగించును.

పోనిండు, ఆంగ్ల పెట్టుబడిదారులకు, ఆంగ్లప్రభుత్వ మునకు, ఆంగ్లప్రజలకును గూడ, యింత మహోపకారు లైన రైల్వేలు, హిందూదేశీయులకు కొంచెమైన సహా యపడవా యని, మీరు ప్రశ్నింపవచ్చును కాని వాస్త వము చెప్పవలయు ననినచో రైల్వేలు, హిందూదేశీయుల కెంతమాత్రము లాభకరములు గాకపోవుటయే, కాక, యనేకవిధముల నష్టమునకూడ గలిగించినవి. భారతీ యులను ఋణభారముతో క్రుంగదీసినవి. వారి పరిశ్రమ లను, వినాశన మొనరించినవి. వారి యారోగ్యమును పా డొనరించినవి. పట్టణవాసులనే గాక గ్రామీణులను గూడ మలేరియాచే హతము చేసినవి. భారతదేశము క్షామదే వతకు, శాశ్వత నివాసస్థానముగా జేయుట కీరైల్వేలు సహాయకారులైనవి. రైల్వేలచే నిర్మానుష్యములైపో యిన గ్రామము లెన్నియో, హిందూదేశమున గలవు.

బ్రిటీషు ప్రభుత్వమునకు యుద్ధకాలములో సైన్య విన్యాసమున కత్యంతోపకారులై, యీ రైల్వేలు, ఆంగ్ల సామ్రాజ్యమును, సుస్థిరముగా నుండునట్లుగా జేయు చున్నవి.

ఈ విషయముల నన్నిటిని, గమనించి చూచువా
రికి, భారతదేశములో రైల్వేలు ఆర్థికముగాగాని, ఆరో
గ్యమునకై గాని, యించుకంతయు, భారతీయుల కుపకరిం
పకపోవుటయే గాక, బ్రిటీషువారికి ఆర్థికముగాను, రాజకీ
యముగాను, మిక్కిలి లాభకరమై యున్నవని, తెలియక
పోదు. *

## ప్రత్తిపంట నభివృద్ధి చేయుట.

ఆంగ్లేయులను ధనాఢ్యులనుగా జేయుటలో, యే
యితర పరిశ్రమయు, యీ ప్రత్తిపరిశ్రమయంత యెక్కు
వగా సహాయపడి యుండలేదనుట, నిశ్చయము. వా
రిదివరకే, వారి పారిశ్రామిక వస్తువులకు, యిండియాలో,
సంగడుల నేర్పరచుకొని యుంచిరి. కాని ముడివస్తువుల
కై, అమెరికాపై యధికముగా నాధారపడి యుండవలసి
వచ్చెడిది. పురాతన కాలమునుండియు, భారతదేశము,
ప్రత్తిని పండించు దేశములలో నగ్రగణ్యమైనదిగా నుం
డెను. ప్రత్తిని పండించునట్టియు, పండించుట కవకాశము
లున్నట్టియు, పరగణా లన్నియు, దేశీయప్రభువుల పరిపా
లనలోనే యుండెను. తమ కార్యసాఫల్యమునకై, యీ

* 'Railways in India' అను వ్యాసమును, 1909 జూన్ మాసపు 'మోడరన్ రివ్యూ' లో చూడుడు.

రాష్ట్రములన్నిటిని, బ్రిటిషువారు తమ యాధిక్యము క్రిందకు గొనిరావలయును గదా! బీరారు, సింధు, పంజాబు రాష్ట్రములు, ప్రశస్తమైన ప్రత్తి నుత్పత్తి చేయగలవు. వీటిని బ్రిటీషువారెట్లు ఆక్రమించినదియును, పాఠకులకు తెలిసిన విషయమే. *

---

* See Rise of the Christian Power in India 5 వాల్యూ. W. జాన్ లడ్లో నూల్ కామ్ Thoughts on the Policy of the Crown towards India అను గ్రంథములో 58. 59 పేజీలలో నిట్లు వ్రాసెను.

"ఈ వ్యవహారములలో నున్న కిటుకును, కనిపెట్టవలెననిన. పార్లమెంటరీ పేపర్లు చూచిన దొరకదు. నాగపూరుకు సంబంధించిన కాగితములు చూచిన, లభించగలదు. 1853 లో నైజాముయొక్క లొంగుబాటు, 1854 లో నాగపూరును, ఆక్రమించుటకు, కారణమయ్యెను. డల్‌హౌసీ ప్రభువు చెప్పినట్లు, బ్రిటీషువారి సౌభాగ్యము, నాగపూరు రాజ్యము బ్రిటీషులోనికి వచ్చుటయందే యున్నది. ఇండియాలోని కంతటికిని చౌకయైనట్టియు, శ్రేష్ఠమైనట్టియు ప్రత్తి బీరారు (నైజామువద్ద తీసికొనినది) లోను, దానికి 'చేరియున్న ప్రదేశము'లలోను మాత్రమే పండుచున్నది. 'చేరియున్న ప్రదేశ' మన్న నాగపూరు రాజ్యమని యర్థము క్రిందటి సంవత్సరము నైజాముతో చేసికొనిన సంధివలన బ్రిటీషువారు, బేరారుపై తమ శాశ్వతహక్కును, పాలనా స్వాతంత్ర్యమును పొందియున్నారు. కాని యీ గొప్ప ప్రత్తిపంటదేశము, రైలురోడ్లు లేకుండుటచే, చేర నశక్యముగా నున్నది. నాగపూరునుగూడ సంపాదింపవో, రైలుమార్గమును నిర్మించుటకు వీలు కలుగును. అందుచేతనే మన మీ రెండు ప్రదేశములను గూడ నాక్రమించి యుంటిమి."

హిందూదేశము:

1858-వ సంవత్సరములో మాంఛెష్టరునుండి, 'ఐ. జి. కాలిన్సు' యనునాతనిచే, యీ క్రింది విచిత్ర నామధేయముగల కరపత్ర మొకటి ప్రకటించబడినది.

"ప్రపంచమందలి ప్రత్తియంగడులలో, అమెరికా బానిసరాష్ట్రములయొక్క స్థానము నాక్రమింపగలుగునవి, భారతదేశమను లనదగు సింధు, పంజాబు రాష్ట్రములే." లేక, "ముడిప్రత్తిని సప్లయి చేయలేకపోవుట యను గొప్ప యాటంకమును, నివారించుటకై, యింగ్లీషుజాతికి, కొన్ని సూచనలు."

ఆ దినములలో 'బోర్డు ఆఫ్ కంట్రోలు'నకు ప్రెశిడెంటుగా నుండి, తరువాత మొట్టమొదటి 'సెక్రటరీ ఆఫ్ స్టేటు టు యిండియా' యయిన 'స్టాన్లీ ప్రభువు'నకు, హిందూదేశముయొక్క ఉత్పత్తిసాధనములను (ముఖ్యముగా ప్రత్తిపంటవిషయమై) అభివృద్ధి చేయుటలో, మిక్కిలి శ్రమపడి, పని చేసినందులకై, కృతజ్ఞతాపూర్వకముగా, ఆ ప్రభువు ననుమతిపై కృతిసమర్పణము చేయబడినదీ, కరపత్రము.

సింధు పంజాబు రాష్ట్రములను, బ్రిటీషువా రాక్రమించినందులకై, మన మాశ్చర్యపడవలసిన పని యేమైన నున్నదా, మరి ?

ఈ పైన వ్రాసిన కవియే, తన కరపత్రమును,

ముగింపు చేయుచు, యిట్లు వ్రాసియుండెను.

"మన తూర్పు సామ్రాజ్యమును, లాంకషైరు యొక్కయు, తద్వారా ప్రపంచము యొక్కయు, అవసరములను తీర్చునట్లు చేయుట మన చేతులయందే యున్నది. అట్లు చేయనిచో, మన నేరము క్షమార్హము గానిదియు, మన దౌర్భాగ్యము కొలువఁ దరానిదియు, కాగలదు. ఈ విషయములలో, ప్రజ్ఞానిధియగు స్నో, చెప్పియే యున్నాడు: 'అమెరికాలోని అప్లాండు మో బైలు, న్యూ ఆర్లియన్సులయందలి ప్రత్తికన్న శ్రేష్ఠమైన దానిని, యిండియా, సగముకంటె తక్కువ ఖరీదుమాత్రమే, సప్లయి చేయగలదని, నా దృఢవిశ్వాసము. మీకు అసాధ్యమై కాన్పించినను, నాకు మరియొక, యభిప్రాయముకూడ గలదు. ఇండియాప్రత్తి, యింగ్లీషు మార్కెటునుండి, అమెరికా ప్రత్తిని పారద్రోలుటయేగాక, మనమే యమెరికాకు చౌకగా ప్రత్తిని విక్రయింపగలుగుదుము.' అందుచే వాలస్యము వలదు. వెంటనే కార్యారంభమునకు, దిగుడు. కుందేలు వంటయింటనే దొరకబడి యున్నది. దాని పనిపట్టుటకు, మనకు, యిచ్ఛమాత్రమున్న జాలును."

శీఘ్రముగానే, 'యీస్టు యిండియా కాటన్ కంపెనీ' నొకదానిని, ప్రారంభించుటకై, ప్రాస్పెక్టసును త

తయారు చేసిరి. వాటా 1 టికి, 10 పౌనులు చొప్పున, 100000 వాటాలు గలిగి, యిండియాలో ప్రత్తిని పండించుటకును, కొనుటకును, యీకంపెనీ యుద్దేశింపబడి యుండెను.

'కాటన్ సప్లై యెసోసియేషన్' యను పేరితో 'జాన్ చీధామ్' M. P. (పార్లమెంటు మెంబరు) యొక్క ఆధిపత్యమున నొక కంపెనీని, బయలుదేర దీసిరి. 1859 జాన్యుయరిలో లండనునుండి, J. B. స్మిత్తు, యీ జాన్ ఛీధామ్ కు త్తరము వ్రాయుచు, యిట్లు చెప్పెను.

"మనము ప్రత్తికొరకై, అమెరికాకు బోవుటకు కారణము. అచ్చట యితర చోట్లకంటె చౌకగా ప్రత్తి దొరకుటయేగదా.........యంత్రాగారము లెన్నియైనను, ఒకటి రెండేండ్లలో స్థాపించి, పనిచేయగలము. కాని ముడిసరకుల తయారట్లు సులభసాధ్యము గాదు. చాల కాలములోగాని మనకు వలసిన ముడివస్తువులను, తయారొనరించు సట్లొనర్పజాలము గాన, మనము వెంటనే యీపనికి పూనుకొని, మార్గముననున్న యాటంకములను, వెంటనే తొలగింప, ప్రయత్నించ వలయును."

"మన కర్తవ్యమేమనిన, అమెరికా ప్రత్తికంటె చౌకగా గాని, అధరకైన గాని, యితర స్థలమునుండి ప్రత్తిని కొనుటకు, ప్రయత్నింపవలయును. ఈ కార్యము,

కుసకు సాధ్యమగునా ?......... సాధ్యమే యగుచో, యిరువది సంవత్సరములలో, అమెరికా ప్రత్తిని, పడగొట్టగలిగినది, హిందూదేశముకన్న మరియొకటి యేది? అందుచే మీ ప్రయత్నముల నన్నిటిని, భారతదేశముపైననే కేంద్రీకరించుడు.''

ఇంగ్లాండు, తన ముడిపదార్థములకై, యిండియాపై యెట్లాధారపడి యున్నదియు తెలుపుట కింతకన్న నిదర్శన మేమి కావలయును? ఇండియా, తన ప్రత్తినంతను, యింగ్లాండునకు, సప్లయి చేయుటయేగాక, లాంకషైరు మిల్లులలో తయారగు బట్టలనన్నిటిని, విక్రయించుటకు, తగిన బజారుగా చేయబడెను. ప్రత్తికొరకై, భారతదేశమున కిచ్చిన స్వల్పమూల్యమును గూడ, తనబట్టల నిండియాపై కట్టబెట్టి యింగ్లాండు, వడ్డీతోను, కాంపౌండు వడ్డీతోను లాగుకొనెను.

## బ్రిటీషు పెట్టుబడిదారులకు సౌకర్యములు.

భారతదేశమును, బ్రిటీషువారి, వలసరాజ్యముగా కొనసాగింప నూహించి, వారి కిచ్చుట ప్రత్యేక సౌకర్యముల గల్పించిరి. ఇట్లు చేయుటచే, యిండియాను శాశ్వతముగా, తెల్లపెట్టుబడిదారులదిగానే యుంచుటకు, ఆంగ్లరాజనీతిజ్ఞు లూహించిరి. వీరి కీదేశమున గల్పించిన ప్రత్యేక

సౌకర్యము లెట్టివో, వివరముగా తెలిసికొనఁ గోరువారు, యీ గ్రంథకర్తచే రచింపబడిన, 'The Colonisation of India by Europeans' యను గ్రంథమును చూచిన, తెలుసుకొనగలరు.

హిందూదేశములో ప్రత్యేక సౌకర్యములను పొందిన యూరోపియనులు, దేశీయులను కట్టెలు కొట్టువారిని గాను, నీళ్ళు మోయువారినిగాను, జేసి, వారి పరిశ్రమలు నాశనము చేసి, దేశసౌభాగ్యమును, తామే యనుభవింప దలచిరి. రాజకీయముగా వారు పొందిన యాధిక్యతను పురస్కరించుకొని, దేశీయుల నిక్కడనే బానిసలుగా జేసి, తాము పరాన్నభుక్కులై, మదించి, దేశీయులను తమ కాలిక్రింద, శాశ్వతముగా యణచి యుంచగోరు వీరిని క్రైస్తవు లనవలెనో, లేక మరేమనవలెనో చెప్పుడు. శారీరక, ధన, బుద్ధి బలములున్న వారు, న్యాయముపేరు చెప్పి, యమాయికులను, బలహీనులను, వంచించుట చూచుచున్న మీకీ సంఘముయొక్క నీతియందు విశ్వాస మున్నదా? ఈ క్రైస్తవులలో చాలమంది నీలిమందుపంటలో నిమగ్నులైరి. ఈ నీలిమందుపంట యసహాయులై, అభాగ్యులగు హిందూదేశ వ్యవసాయికులకు మారణయంత్ర మయ్యెను. ఆంగ్లేయాధికారులు తమ నాగరక క్రూరకృత్యములచే, దేశీయుల నణచివైచి, నా

నము జేసి, వారి కష్టముల ఫలితమును తామే యనుభ
వించుచుండిరి. దేశమంతటను వీరి క్రూరకృత్యములను
చూచి, గగ్గోలు బయలుదేరెను. గవర్నమెంటు చాల
కాలజడి జరిగినమీదట, యనేక ప్రకటనల నొనరించిరి.
కాని యవియన్నియును, పశుప్రాయులును, స్వార్థపరు
లును, అగు నీ ఆంగ్లేయపెట్టుబడిదారుల యమానుష
కృత్యములను, కప్పిపుచ్చుటకే యైయుండెను. *

---

* 1860 జూలై 21 తేదీ శనివారమున, కలకత్తాలో 'యిం
డిగో కమీషన్' యెదుట సాక్ష్యమిచ్చుచు గౌరవనీయు డైన ఈడెన్
(తరువాత నీతడే 'సర్ ఆష్లి ఈడెన్' ఆయి, బెంగాలు లెఫ్టినెం
ట్ గవర్నరుపదము నధిష్టించెను) యిట్లు చెప్పెను:

"ఇండియాలో నీలిమందుపంట, కేవలమూ పరిభూత్యబలవం
తముపైననే గాని, రైతులు స్వయముగా వేయలేదు" ఇట్లు అభి
ప్రాయపడుటకు తగిన కార్యకారణ, నిదర్శనములను చూపవలసినది
గా కోరబడి, యిట్లు సమాధాన మిచ్చెను:

"1. ఈ వ్యవసాయము, లాభదాయకమైనది గాదని నా
యభిప్రాయము. అందుచే తనకు ఆర్థికముగా చాల నష్టదాయక
మైన, యీ వ్యవసాయము నే రైతూ, స్వబుద్ధిచే చేయుటకిచ్చగిం
పడని నేను నమ్ముచున్నాను.

2 ఇందులో, పరుల జోక్యమున్నది గాన బాధాకరమైన
దీ యనవసరమైనది పనుటకు, యే స్వతంత్రుడును కోరడని, నా
భావన

3. వంగదేశపు క్రిమినలు రికార్డులుబట్టి చూచినచో, జే

హిందూదేశము:

తేయాకు తోటల పరిశ్రమయును, ప్రభుత్వమువల్ల ప్రోత్సహింపబడినదే. ఇది బానిసకృషివల్లగాని, లాభప్రదము కానేరదు. 'రస్సెలుస్మిత్' తన 'యిండస్ట్రియల్

---

...యా రైతు లీ వ్యవసాయమునే చేయుచుండునట్లొనరించుటకై, ఆంగ్లపెట్టుబడిదారులగు 'ప్లాంటరులు', యెట్టి దారుణ, భయావహ కృత్యముల నొనరించిరో, తెలియగలుగు

4. రైతులు స్వేచ్ఛగా వదలివేయబడుచో, నీలిమందు వ్యవసాయము చేయుట కిష్టపడరని, మన 'ప్లాంటరులే', ఒప్పుకొనుచున్నారు,

5. మన 'ప్లాంటరులు', జమీందారీలు మొదలగువాటి నమిత ధనవ్యయము చేసి, కొని, తమ జమీందారీలోని రైతులను, (తమకున్న ప్రభుత్వసహాయమును పురస్కరించుకొని) నీలిమందు పంట పండించుటకు బలవంతముగా యొడంబడ జేయుచున్నారు

6. నేను పనిచేసియున్న జిల్లాలలోని ప్రజలయు, రైతులయు, వాఙ్మూలములవల్ల కూడ యీవిషయము ధ్రువపడుచున్నది

7. ప్రజ లెప్పుడు, తాము న్యాయచట్టములవల్లను, ప్రత్యక్షముగాను కూడ స్వతంత్రులమని తెలిసికొనిరో, యప్పుడే యీపంటను, వారందరును మానివేసి యుండుటచేతను; తిరిగి ప్రారంభింప నిరాకరించుటచేతను కూడ, నే నిట్లు విశ్వసించుచున్నాను.

నీలిపంట గుత్తదారులై, బ్రిటీషువారు చేసిన దౌర్జన్యములకును, అమానుష కృత్యములకును, యింతకన్న వేరొక నిదర్శన మేమి కావలెనో, తెలుపుడు.

అండ్ కమర్షియల్ జాగ్రఫీ' యందు, 301-302 పేజీలలో
ఇట్లు వ్రాసియున్నాడు:

"సంయుక్తపరగణాల తేయాకుపంట, కూలీల సమస్య"

తేయాకు చెట్లను జాగ్రతగా పెంచుటలోనూ, కత్తి
రించుటలోనూ, చాలమంది కూలీ లవసరమై యుందురు.
అంతేకాక, తేయాకు నేరుటలోనూ, తయారు చేయుట
లోనూ గూడ, బహు కృషి కావలయును. ఇందువలన
నే, యిండియా, సిలోనులు రెండింటికంటెను, నూరురెట్లు
అధికముగా తేయాకును బండింప వీలున్నను, యిచ్చట
తేయాకు పరిశ్రమ వెనుకబడి యున్నది. ఛార్లెస్ టన్
వద్ద, కేవలమూ నీగ్రోపిల్లల కృషిమూలమున, శ్రేష్ఠమగు
తేయాకు స్వల్పముగా, తయారగుచున్నది. కాని, మి
క్కిలి హెచ్చుకూలి యివ్వవలసిన, యీ దేశములో, తే
యాకు పరిశ్రమ వృద్ధిబొందు సూచనలు గాన్పింపవు. ద
క్షిణకరోలినాలో ఒకపౌను తేయాకు నేరుటకు, 15 సెం
ట్లు కూలి యగును. ఇచ్చట కూలీలకు తేయాకును కో
యు నేర్పుకూడ లేదు. మొగ్గలను త్రుంపకుండ, ఆకును
బహులాఘవముగా కోయుచు, పోవులను వీ రెరుంగరు,
అందుచే వారు, ఆకులో మూడవభాగమువరకు వదలి
వేసి, మిగిలినదానినే త్రుంచుదురు."

హిందూదేశము:

"ప్రాముఖ్యత వహించని తేయాకు పరగణాలు."

ప్రకృతిసిద్ధముగా తేయాకు పెరుగు స్థలములలో, ప్రపంచమునందన్ని భాగములలోను, క్రొంతెయిగా తేయాకు తోటలను పెంచ నారంభించిరి. వాటిలో ముఖ్యోద్యోపకల్పమునందలి స్ట్రెయిట్సు సెటిల్మెంటులోని ప్రావిన్సు, ఫ్రెంచిట్వాన్‌కిన్, దక్షిణబర్మా, జమైకా, ఫిజీ ద్వీపములు, మెడగాస్కరు, బ్రెజిల్, ట్రాన్సుకకేషియా యును పేర్కొనదగి యున్నవి. కాని, యిన్నిటిలో నొక్కచోటనైనను, యీ పరిశ్రమ వృద్ధిబొందలేదు. కారణము, కూలీల సమస్యయే."

ఉద్యోగములలో బ్రిటీషువారి నెక్కువగా నియమించుట.

'సర్ ఎడ్వర్డు సల్లివాన్', 1858 లో 'Letters on India' లో యిట్లు వ్రాసెను:

"గ్రేటు బ్రిటనులోని విద్యావంతులకు, యిండియా మొకతెరిపి లేకుండ పని కల్పించగలదు. ఏ యితర దేశములలోను దొరకజాలని వేతనములపై, మన విద్యావంతులకు తగు నుద్యోగము లిండియాలోనే దొరకగలవు."

"..........విద్యావంతులకు తగు జీవనోపాధుల

గల్పింపలేని, మన దేశములో నిరుద్యోగసమస్య ప్రబలు చున్నది. చదువుకొని, నిరుద్యోగులై, జీవనాధారమున కై యటమటించు, మధ్యతరగతి ప్రజలు, ప్రభుత్వమున కెంత యుపద్రవకారులో, యోచించినవారికి, యిండియా సంతను, అథవా చాలభాగమును, మన యధికారముక్రింద నే యుంచుకొను టెంత యవసరమో, తెలియగలదు. దేశములోని, నిరుద్యోగులకు దారి కల్పించునదియై, మ నకు లోబడి, యిండియా యుండుటచేతనే, యూరోపం తయు క్షోభించుచున్నను యింగ్లాండు శాంతముగా నుం డుటకు కారణమని చెప్పుటతిశయోక్తి కానేరదు.''

29 పేజీ.

"..........అమెరికాయొక్క శక్తి సామర్థ్యము లకు, తగు వినియోగమును, పశ్చిమరాష్ట్రము లెట్లు క ల్పించుచున్నవో యట్లే, మన దేశీయుల విద్యాబుద్ధు లకు, ఇండియా అరువది సంవత్సరములనుండియు, పని గల్పించుచున్నది. ప్రతిసంవత్సరమును, అధికమగుచున్న మన దేశీయుల శక్తికిని, ఆశకును తగు వినిమయమును గల్పించుచున్నది, యిండియాయే. ఏ దేశములోనైనను, సాహసికులును, అత్యధికసంఖ్యాకులును అగు యే ప్రజా సంఘమునను, సాధారణ కుటుంబములకు చెంది, చదువు కొని, వాంఛలచే ప్రేరేపితులై, నిశితముగా నున్న పోటీ

లో తమకు లభించునన్న యొగిలిమెతుకులకన్న, తమ మునకు పాత్రులమన్న విశ్వాసముగల, కొద్దిమంది రధిక యువకులవలన గలుగు, నుపద్రవములో, నగమైనను గల్పింప జాలరు.”

“ఇండియాలో, చదువుకొన్న మనవారికి లభించు ప్రతిఫలము, ప్రపంచములో నురెచ్చటనైనను దొరకు దానికన్న కనీసము రెండింతలైనను, గలదు.” *

1925 డిసెంబరు నెల The Century Magazine లో, అమెరికా సోషియలిష్టు ప్రొఫెసరు ఎడ్వర్డు ఆల్సె వరురాస్, యిండియాలో నుద్యోగములు చేయుచున్న ఆంగ్లేయు లందరును, తమ దేశములోకన్న రెండురెట్లు సంపాదించుచున్నారని వ్రాసియున్నాడు

ఆంగ్లేయులను, యిండియాలో, దేశీయుల ఖర్చుపై, ఉద్యోగములలో నుంచుటచే, దేశమునందలి ద్రవ్యమునంతటిని దోచివైచి, భారతదేశమును ఋణములలో ముంచివైచుచు, తమ ప్రభుత్వము సుస్థిర మొనరించుకొనిరి. †

---

* Ibid Page 51-52.

† మేజరు విన్‌గేటు యొక్క A few words on our Financial Relations to India, యను గ్రంథములో మొదటి యధ్యాయమును చూడుడు.

## ౩౨ స్వప్రభుత్వనిర్మాణతత్త్వము

## స్వపరిపాలనను నిరాకరించుట.

స్కాట్లండు దేశీయుడై, యిండియాలోని యొక సంస్థానములో రెసిడెంటుగా నున్న యొక పెద్దమనిషి, యీ గ్రంథకర్తను కలసికొని, యిట్లు చెప్పెను:

"మేము మీ దేశీయులను విద్యావంతులనుగా జేసితిమి మీ రిప్పుడు కండ్లు తెరచి, హక్కులు కావలె నని యాందోళన చేయుచున్నారు. మీ క్షేమాభివృద్ధులు, మాకు హానికరములు, కాగలవు. కాన మీ కోరికల నన్నిటిని, మేము మన్నింపజాలము."

బ్రిటీషువా రిండియాకు కేవలము వర్తకులుగా వచ్చిరి. వారికి దేశీయప్రభువు లన్నివిధములను, సహాయములను జేసి యుండిరి. కాని బ్రిటీషువారు, రాజ్యాధిపత్యమునకు వచ్చియు, వెనుకటి, వాసనను వీడలేదు. వారు కేవలమూ దుకాణదారుల, పెట్టుబడిదారుల సంఘము వారు. హిందూదేశీయులు కూడ వర్తకమును జేయుచుండిరి. ఒకేపనిలోనున్న యిద్దరి కెప్పుడును, సఖ్యత పొసగదు. అందుచే ప్రభుత్వబలము నూతగాగొని, ఆంగ్లేయులు, యిండియాయొక్క వర్తకమును, పరిశ్రమలను, నాశన మొనరించి, తమపై నాధారపడి యుండునట్లు చేసిరి.

హిందూదేశము:

ఇండియనులకు స్వపరిపాలన నిచ్చుచో, తమ ప్రత్య క్షదోపిడికి వీలు కలుగదనియే, వారు నిరాకరించి యున్నారు.

ఈవిధమున, ఆంగ్లేయులు భారతదేశమును ఆర్థిక బానిసత్వమునకు లోబరచి, తమ సామ్రాజ్య స్థిరీకరణమునకు, పునాదులు వైచికొనిరి.

విప్లవముతర్వాత హిందూదేశసైన్య పునర్నిర్మాణము.

హిందువులు తెలివిగలవారు, ధైర్యవంతులు, నీతిమంతులు, శాసనములకు బద్ధులగుదురు; కాని దేశాభిమానవిహీనులు. ఈ విషయమును, ఫ్రెంచివారు కనిపెట్టిరి. ఫ్రెంచి సాహసికుడగు, 'గవర్నరు డూప్లే' యిండియనులకు, యూరోపియన్ యుద్ధక్రమమును నేర్పించి, వారిని తన రాజ్య మిండియాలో వ్యాపింపజేయుటలో యుపయోగించి, యితరులకు మార్గదర్శకు డయ్యెను.

ఫ్రెంచివారి నుదాహరణగా తీసికొని, ఇంగ్లీషు వారు కూడ, యిండియనులకు పటాలములుగా తరిఫీదు యిచ్చి, వారి సహాయమువల్లనే యీ భారతదేశమందు, తమ సామ్రాజ్యమును వ్యాపింప జేసికొనిరి. హిందూసిపాయీల శక్తిసామర్థ్యములను, స్వామిభక్తిని చూచి, పాశ్చాత్యు లనేకులు వేనోళ్ల బొగడియుండిరి.

## కై) స్వప్రభుత్వనిర్మాణతత్త్వము

ఎంత స్వామిభక్తి గలిగి యూరోపియనులను సేవించియున్నను, దేశీయసిపాయీ యెప్పుడును, యజమానులవల్ల, ఆదరమును పొందియుండలేదు. వీరి కఠినజీవితమును, దయనీయపరిస్థితులను చక్కజేయుటకు, యీస్టిండియా కంపెనీ జీవించియుండగా, యెన్నడును, కొంచెమైనను ప్రయత్నించియుండలేదు. బ్రిటీషు సోల్జర్లను, తెగబలియునట్లు, పోషించెడివారు. పరిశుభ్రములై, విలువగల దుస్తుల నిచ్చి, చక్కని గృహములలో నుంచెడివారు దివ్యభోగముల ననుభవింప, సర్వసౌకర్యముల నొసంగెడివారు. ఇవన్నియును, శ్రమజీవులై, పొట్టకూటికిని, గుడ్డకును కరవైయున్న దేశీయుల, ఖర్చుపైననే యనుమాట మరువకుడు. ఇది యిట్లుండ దేశీయపటాలములలోని సిపాయీలకు, యీ సౌకర్యములు లేకపోవుటయే గాక, విదేశీ సోల్జరుకంటె కఠినముగా పని చేయవలసివచ్చెడిది. డల్‌హౌసీప్రభువు, యిండియా గవర్నరు జనరలు పదవినుండి విరమించునప్పుడు, వ్రాసిన మినిటు, యిట్లు చెప్పుచున్నది:

"సోల్జరుల నివాసస్థానములను, బాగుగా అభివృద్ధి చేసియుంటిమి. హిందూదేశములోని, మన సోల్జరుల నివాసస్థానములకన్న యెక్కువవాటిని గాని, వాటితో సమానము లగువాటిని గాని, ప్రపంచములో యేజాతి

యు, యే ప్రభుత్వమును, తన పటాలములకు నిర్మించి యిచ్చియుండలేదు ''

తన ప్రత్యేకాజ్ఞలపై, బ్రిటీషుసోల్జర్ల 'బారక్సు' లలో, యెన్ని నూతనాభివృద్ధులు కల్పింపబడినవో, యీ క్రైస్తవ ప్రభువరేణ్యుడు, వివరముగానే వ్రాసికొనెను. కాని క్రైస్తవులుగాని సిపాయీల క్షేమసౌకర్యములనూ, గలుగజేయుట, యవసరము గాదని, యీతని సంపూర్ణ విశ్వాసము.

"హిందూదేశములో, దేశీయ సిపాయీలయొక్క పరిస్థితు లెప్పుడును, యిట్లే యున్నవి. వీ రా పరిస్థితులకు చిరకాలమునుండి యలవాటుపడి యున్నారు. అందుచే యీతని క్షేమ, యభివృద్ధియు కలిగించు నవసరము గాన్పింపదు.''

'హీథెన్' సిపాయీలు, తమ విదేశీయ క్రైస్తవ యజమానులు పెట్టుచున్న యవమానములకు, అభిమానమునే పొందుచుండిరి.

తెల్లసైనికులు: సాధారణముగా, యింగ్లాండు, ఐర్లాండు దేశములోని క్రిమినలు నేరస్థులనుండియు, పాపర్లనుండియు, యితర గౌరవహీనుల నుండియు, వేరి తీసుకొని రాబడుచుండిరి.

'సర్ జాన్ కేయీ' తన 'History of the sepoy

war' లో, తెల్లసోల్జరును గురించియు, నల్ల సిపాయీని గురించియు, యిట్లు వ్రాసియున్నాడు:

"హిందూదేశములో సైన్యమును గూర్చుటయు, యింగ్లాండులో సైన్యమును గూర్చుటయు, వీటిలోనున్న విపరీతమగు భేదము, మరియే ద్వివిధములగు జీవిత మార్గములందును గాన్పింపదు. ఇంగ్లాండులో సైన్యములలో చేరుట గౌరవముగా యెవ్వరును భావి పరు. ఒక లాభకరమగు ధనార్జనోపాయముగానూ, భావింపరు. ఉన్నత పదవికి వచ్చుటకును, సంతోషోత్సాహములతోనూ, సైన్యములలో చేరువారు బహు తక్కువ. మిగిలిన యుద్యోగములు వేటికిని బనికిరాక, త్రోసి వేయబడిన వారే పటాలములలో చేరుదురు. ధనవిహీనులై, యెచ్చటనూ, యేవిధమైన పరపతియు లేనివారే, ఆశపడి, మోసగింపబడి, సైన్యములలోనికి ఆకర్షింప బడుదురు. గోడలపై నంటించబడిన యబద్ధపు ప్రకటనలును, కల్లు అంగడులలో యేజంట్ల దుష్ప్రచారమును, సార్జంటుల యొక్క రంగురంగుల దుస్తులు, డోలు, తిత్తియును, ఘాటైన సారాయియు, ఆతనికి ఆశగొల్పి వలలో పడవేయును. ఆతడు, తన యర్ధాంగితో పోట్లాడినవాడో, తన యజమానుని మోసగించినవాడో, యైయుండును. తన స్వంత కుటుంబము వారియొక్క తాలిమి నంతయు ఖర్చు

పెట్టించియు, సంఘముచే తిరస్కరింపబడియు, మరియొక గతి కానక సైన్యములలో చేరును. ఎప్పుడాతడు వారి యొక్క షిల్లింగును తీసికొన్నాడో, యప్పుడే యాతని కుటుంబ బంధనములు తెగిపోయినవి; మానవసంఘ సభ్యుడుగా నాతని జీవితచర్య ముగింపు చెందినది. ఆతని ప్రస్తుత యోగ్యత యేమనిన, సైన్యములలోని, పటాలములో వెయ్యవవంతు యని మాత్రమే. బహుశా యాతడు తన పేరును మార్చుకొనును. తన్ను గుర్తింపదగిన పోలికల నన్నింటిని మాపివేయును. ఏది యెట్లున్నను, మానవసంఘమున కాతడు జీవన్మృతుడు. ఆతని సంగతులేవియు లోకమునకు, వినబడవు. ఎవ్వనికైనను ముదుసలితల్లి, యెచ్చటనైనను బ్రతికియున్నచో, ఆమె మినహాగా, యీతని గూర్చి, వినుటకైనను కోరువారుండరు. మాతృప్రేమ, నిర్భాగ్యుడగు తనయునిపైననే, యెక్కువగా ప్రసరించునుగదా! ప్రజల ఖర్చుపై, ఖైదులో పోషింపబడుచున్న, నేరస్థునికన్న, రాణిసైన్యములో చేరియున్నాడనుట, ఇంగ్లాండులో నేకుటుంబము వారికిని, గౌరవాస్పదము గాదనుట, ప్రసిద్ధమైన విషయము.”

“కాని యిండియాలో దేశీయసైనికుని విషయమట్లుగాదు. ఆతడు సైన్యములో చేరుటతోనే సభ్య

సంఘముతో నాతని బంధనములు తెగిపోవు ఆతని సంసారసంబంధము చెడదు. పౌరహక్కులు నశింపవు. ఆతడు బహిష్కృతుడు గాడు ఇంతియగాక తన కుటుంబమునకు, గౌరవాస్పదుడై గర్వించదగినవాడై యున్నాడు అప్పుడప్పుడు, తన యింటికివచ్చి చూచి పోవుచుండును. తన జీతములో చాలభాగమును, కుటుంబపోషణకై, యొసంగుచుండును. తాము దేశములోని, గొప్ప ప్రభుత్వమునకు చెందిన వారమను గర్వముగలిగి, తమ జాతి, కులాభిమానములకు వన్నె దెచ్చుటకే, జీవింతురు. సైన్యోద్యోగము, ఇండియాలో గౌరవనీయమై, యున్నత వంశీయుల చేతనే కోరబడును. ఉద్యోగమునుండి తొలగింపబడుటయే వారికి పెద్దశిక్ష; చాల యవమానకరమగు సంఘటనము.''

''ఇచ్చట మరియొక విషయము చెప్పవలయును. భూములపై వంశపారంపర్యపు హక్కుగలిగియున్న దేశీయులయెడల యొక్కువ రాజభక్తికిని, సత్ప్రవర్తనకును తావు గలిగియున్నది. ఆతడొక్క సైనికమాత్రుడే గాదు; కంపెనీయొక్క పటాలములలో, కుడినుండి, మూడవలైనునందలి, 2 వ సిపాయీమాత్రమే గాదు. తన సంఘములో నొక ముఖ్యసభ్యుడు; తన గ్రామములో గౌరవనీయుడును యగు వ్యక్తి. పటాలములలో నాతని

కెంతవిలువగలదో, దేశీయులలోనూ అంతటి సభ్యతగల వాడే. ఇతరులను గౌరవించును, తన ఆత్మగౌరవమును నిలుపుకొనును. తాను సేవించుచున్న ప్రభుత్వము యొక్క క్షేమాభివృద్ధులలో, స్థిరత్వములో, నాతనికి కొంత స్వార్థముకూడ గలదు ''

ఇంతేగాక సిపాయీల జీతములుకూడ, చాల స్వల్పముగా నుండెను. సర్ హెన్రి లారెన్సు, సిపాయి ముట్యాటినీకి, సంవత్సరము ముందుగానే యిట్లు సూచించి యున్నాడు:

ప్రస్తుత పరిస్థితులను శ్రద్ధగా పరికించినవారికిని, హైందవీయ సైనిక చరిత్రమును చదివినవారికిని, యీ క్రింది విషయము స్పష్టముగా, కాన్పించ గలదు. ప్రతి విప్లవమును, అల్లరియును, గొప్పది కానీ, కొద్దిపాటిదే గానీ, మన పొరపాటువల్లనో, తప్పువల్లనో సంభవించు చున్నది. జీతములవిషయము మనకు పెద్ద ఆటంకముగా నున్నది. చాల తిరుగుబాటులకు కారణము, ప్రభుత్వ ముయెడల, జీతముల విషయములోనైన సందేహముల చేతనే.'' Calcutta Review of March 1856.

ఏ తెల్ల సోల్జరుకన్నను, అనేక విషయములలో తానెక్కుడయ్యును, అతనికంటె జీతములో చాల తక్కువగానూ, ఆదరములో నీచముగానూ, చూడబడుచుంటి

నని దేశీయసిపాయీలు తలపోయుట, స్వభావేతరము గాజాలదు.

సిపాయీ విప్లవానంతరము రాయల్ కమీషను నేర్పరచిరి. ఇందువల్లనైన యుపకారము లేకపోవుటయే గాక, యీతని స్థితి మఱియూ, సైన్యముకును, అగౌరవముకును బాల్పడెను.

1858 యేప్రిలులో, జె. కాల్ ఫీల్డు, యఫ్. ఆర్. జి. యస్. చే, 'India as connected with a native army' అను వ్యాసములో యిట్లు వ్రాయబడెను:

"ఇండియాలో సైన్యమును కూర్చు పద్ధతిలో, మనము చాల గొప్ప పొరపాటును చేసితిమి. తెల్లసోల్జరుల కిచ్చు శిక్షణను, దుస్తులను, ఆయుధములను, సిపాయీల కిచ్చుటయే గాక, వారి పటాలములలో చాలమంది తెల్ల యుద్యోగస్థుల నేర్పరచితిమి. ఈ పద్ధతిచే, సిపాయీలను, సోల్జరులను, సమానప్రతిపత్తి గలవారినిగా చేయ సమకట్టితిమి. ఇట్లు చేయుటచే ఆర్థికముగాకూడ, మనకు చాల లాభకరమని, తలంచుచున్నారు. కాని నేను చెప్పునది, అట్లు చేయుట చాల వ్యయకారణ మగుననియే. ఈ విషయమును, సులభముగా నిరూపింపగలను."

ఇందుచేతనే 'యిండియన్ సైన్య పునర్నిర్మాణా' వసరము గల్గినది.

హిందూదేశము:

ఈ పునర్నిర్మాణము, యిండియన్లకు 'ఆర్టిలరీ' లో బనిచేయు నవకాశము లేకుండ చేసినది. ఈ శాఖలో యిండియనుల కవకాశము లేకుండ చేసిన కారణమును, పై నుదాహరింపబడిన 'కాల్ఫీల్డు' యిట్లు నుడువుచున్నాడు. "హైందవ సిపాయీలు యే యాయుధప్రయోగము నందైనను ఆదర్శప్రాయమగు పేర్పును సంపాదింప గల్గు చో, నది తుపాకియు, ఫిరంగియునే యై యున్నవి"

హిందూదేశీయ సిపాయీల విషయములో 'సామర్థ్యము'ను గూర్చి బహు జాగ్రత తీసికొనిరి. 'భేదించి పాలించుడు' అను నీతినిబట్టి, సిపాయీల కెట్టికార్యములందును, స్వాతంత్ర్య మివ్వక, కేవలమూ, తమ తెల్ల యధికారులపైననే, యాధారపడి యుండునట్లు చేసిరి. ఇంతేగాక వీరికిచ్చు యాయుధములు కూడ, తోటి తెల్ల క్రిస్టియన్ సోల్జరున కిచ్చువానికంటె యధమములు.

సిపాయీలయొక్క కష్టములు, బాధలు, యనేకములుగా నుండెను. వానిని నవరించుట కెవ్వరును, యెట్టి చర్యను గైకొనరైరి. ప్రతి స్వల్పవిషయములోనను, ఆతనిని, న్యూనత పరచుచుండిరి. తాను హీనుడనని, యాతడనుకొనునట్లు చేయుటయే, వారికి గావలసినది. ఇంత వ్యర్థునిగా చేసియు, ఆతడే యీ విప్లవముకు కారణు డనిరి. ఊకనుండి బియ్యము దంచెనను టెట్టిదే కాబోలు!

పాష్ట్సుబరీప్రభువు యిట్లు ప్రశ్నించెను.

"ఈ విప్లవకారు లెవరు? ఈ పారుబోతు విద్రోహము, యెవనివలన గలిగెను?"

ఈ క్రైస్తవ ప్రభువు, యిచ్చవచ్చినరీతిని, తన ప్రశ్నకు సమాధానముగా యిట్లు చెప్పెను:

"పనిపాటులు లేని, తెగబలియబెట్టిన, ముఖస్తుతియబడిన, పారుబోతులగు, యీ సోమరి సిపాయీలవలనే, యీ విప్లవము చెలరేగినది."

ఇట్లు చెప్పుట కాతడు జంకలేదు.

అందుచే యనర్థదాయకమైన యీ దేశీయసైన్యమును, పూర్తిగా తీసివైచి, దానిస్థానమున యూరోపియనుసైన్యము నుంచుటకు, చాలమంది క్రైస్తవులు అభిప్రాయములను జెప్పిరి. 1858 లో లండనునుండి, యేకగ్రీవముగా ప్రచురింపబడిన 'యిండియన్ పోలసీ' యను కరపత్రములో యిట్లు వ్రాయబడినది:

"ఈ క్లిష్టసమస్యను విడదీయుట కొక్కటే, మార్గమున్నది. అదేదన, కేవలము తెల్లవారినే సైన్యములలో నుంచుట. ఈ పద్ధతివలన కలుగు లాభము లనేకము లున్నవి. అయితే, దీనికి రెండు పెద్ద ఆటంకములు లేకపోవు. మొదటిది మనకు తగుజనము దొరకరు. రెండవది

హిందూదేశము:

అపరిమితవ్యయము."

ఇట్లు, యీ చిక్కును విడదీయు దారిలేక, యీ క్రైస్తవప్రముఖు డిట్లు చెప్పెను:

"పత్రికలు మొదలగువాటిలో, క్రిందటి సంవత్సరమునుండియు జరుగుచున్న నాదోపవాదములు వినినవారికి, దేశీయసైన్యముల నుంచుటలో, మన బుద్ధిహీనత, వేరే తెలుపనక్కరలేదు. దేశీయపటాలముల నెన్నిటి నుంచుదుమో, యంతకు, మిక్కిలిగా, వాటిని జాగ్రత్తగా చూచుచుండుటకై, తెల్లసైన్యముల నుంచుటవసరము;........"

"నా చెప్పు విధానములోనున్న విశేషమేమనిన, యిండియాలోనున్న మనకార్య నిర్వాహకులకు, ప్రజలతోగల తమ కర్తవ్యమును తెలిసికొని, నిర్భయముగా వారితో వ్యవహరింప వీలుగలిగించును; ప్రజలపై వేసియున్న నీచమును, క్రూరమును యగు ఉప్పుపన్నును తొలగించి, ధనవంతులపై రాబడిపన్నునుగాని, మరియొక పన్నునుగాని ధైర్యముగా విధింపవచ్చును; బాహాటముగా, తాము క్రైస్తవమతమును ప్రోత్సాహపరచుదురని, ప్రభుత్వము చాటవచ్చును; నావిధానము, మన కార్య నిర్వాహకులకు, గోడమీది పిల్లివాటముగా నుండనక్కరలేకుండ జేయును. మత జాతి కులభేదములను, విగ్రహా

రాధనను, నిరుత్సాహ పరుపవచ్చును. దేవాలయాదుల కును, ఉత్సవములకును, ధనమీయ నిరాకరింపవచ్చును. సిపాయీల సణుగులకు సావకాశముండదు;.........
ఇంత యెందులకు? కేవలమూ యూరోపియన్ సైన్యము లనే యుంచుచో, మనకు న్యాయమని తోచుదానిని, నిర్భయముగా చేయుటకు చాల సావకాశముండును. మనకు యిష్టమగుచో.........''

''యూరోపియన్ సైన్యము పనికిరాదనువారు మరియొక ఆటంకమును జెప్పెదరు దేశీయుల వద్దనుండి పన్నులరూపమున తీసికొన్న డబ్బును, కేవలమూ, విదేశీయులకే యిచ్చివేయుచున్నచో, వారి జన్మహక్కులకు, దురన్యాయముగా భంగము కలుగజేసినవార మగుదుమనియే! కాని కేవల యూరోపియను సైన్యమునే యుంచుటవల్ల, దేశీయ విదేశీయ సైన్యములను, రెండింటినీ యుంచుటవల్లకంటె, తక్కువ వ్యయమగుచో, ఆ మొత్తము, యేటా హిందూదేశీయులకు, లాభమే గాదా?... .....''

''ఇంక కొందరు, మరియొక నిరాధారమైన భయమును సూచించుచున్నారు. నిరంకుశులైన గవర్నరు జనరలు, తిరుగబడి, యిండియాలో రెండవ నెపోలియన్‌గా తయారగునేమోయని. కాని యీయుద్దేశ్యము......

హిందూదేశము:

...నాకు.........చాల హాస్యాస్పదముగా కాన్పించు చున్నది."

ఈఆంగ్ల చరిత్రకారుడు తప్పనివో, పూర్తిగా దేశీయులగువారిని చేర్చుటకంటె, యూరోపియనులను చేర్చుట, ఉత్తమ పక్షముని, కూడ వ్రాయ సాహసించి యున్నాడు:

"యూరోపియను, అన్ని ప్రభుత్వ శాఖలలోనికిని, ఉచిత పద్ధతులపై తీసికొనవలెను. ఇదికూడ, నానామాన్య రాజనీతియే, సైన్యములలో చేరుటకుకూడ, వీరికి పూర్తిగా, యవకాశ మీయవలెను. ఎందుచేతననిన, వీరిలో దేశీయరక్తము, రూపాయిలో యెనిమిదణాలకంటె మించియుండదు."

కాని పూర్తిగా యూరోపియన్ సైన్యముల నుంచుటకు, మన ఆంగ్లప్రభుత్వముకు సాధ్యమునూ కాలేదు, శక్యమునూ కాలేదు. రాజకీయముగాకూడ, ఆట్టే ప్రోత్సాహకరముగా కాన్పించలేదు. అందుచే మధ్యమపక్షముగా, ప్రపంచమండలి, ఉష్ణదేశీయులతో సైన్యములను, నింపుట కాలోచించిరి. కాల్‌ఫీల్డు యిట్లు వ్రాసెను:

"మన హిందూదేశ సైన్యములలో, ప్రపంచమండలి, ఉష్ణదేశీయులను చేర్చుట మిక్కలి ప్రాముఖ్యత

వహింపదగియున్నది. శీతలదేశీయులమగు మనము, చేయ లేని, కఠినతరములగు పనులను చేయుటకు, వారవసరము. కాని యిట్టి సైన్యములసంఖ్య, వీలుగా నుండునంత తక్కువగా నుంచవలెను. మరియు వారిని, కేవలము, ఉపకరణ మాత్రులనుగానే, తీసికొనవలెను ''

ఇట్లు మనదేశరక్షణకై, కూలికి దీసికొని రాదల చినవారిలో అరబ్బియులు, బర్మీయులు, మలయాలు, ఆఫ్రికన్ నీగ్రోలు, కలరు. అరబ్బీల సంతతివారగు మోపలాలను సిపాయీలకుహానంతరము నుండియు, యెక్కువగా సైన్యములలోచేర్చి, చాల పటాలములుగా నుంచిరి.

నీగ్రోలను గూర్చి పై గ్రంథకారు డిట్లు చెప్పు చున్నాడు:

''తూర్పు పశ్చిమతీరములలోని ఆఫ్రికా నీగ్రోలు, మన హిందూదేశ సైన్యములలో చేర్పదగిన వారిలో ముఖ్యులుగా, పరిగణించుచున్నారు. కాని, వారు యు పనిలోనికి తగియుండలేదు. యూరోపియనులను తెచ్చు ట కెంతఖర్చగునో, వీరిని తెచ్చుటకును, అంతఖర్చు నూ, కాగలదు. వీరిని, యూరోపియన్ యుద్యోగుల, యధీనమున నుంచవలయును. లేనిచో నిరుపయోగులు... ......మనకొకప్పుడు, సిలోన్‌లో కొన్ని నీగ్రోపటాల

ములుండెడివి. వారు బుద్ధిహీనులుగాను, మందమతులు గాను, తమత్రోనే బనిచేయు మలయాలకన్న వెనుకబడి యు, నుండెడివారు ''

మలయాలు, ప్రపంచములో చాల స్వల్పముగా నున్నారు. ఇంతేగాక వారు జలమున కలవాటుపడిన వారగుటచే, నావికాసైన్యమునకు తగినవారు స్థల సైన్యమున కంతగా నుపయోగింపరు. మనసైన్యములో 'శిలోన్ రైఫిల్సు' అను చిన్న పటాలమున్నది. వెనుక డచ్చివారిచే సింహళములో నుంచబడిన, మలయాప్రజ లలోనుండి, (సిలోన్ ప్రభుత్వసహాయమున) మనుష్యులను తెచ్చుచున్నను, యీయొక్క పటాలము నుంచుటకే, చాలీచాలక యున్నారు.''

ఇంత బర్మీయులు, సైన్యములకు తగినవారుగా, యెప్పుడునూ యెన్నబడుటలేదు.

అందుచే దేశీయులను, సైన్యములలో చేర్చు కొనక, తప్పలేదు. కాని, ప్రభుత్వమువారు, యీవిష యములో కూడ, తగినజాగ్రత తీసికొనిరి. తరతరముల నుండి, బ్రిటీషుయిండియాలో నివసించుచున్న వారినిగాక, స్వదేశసంస్థానములలో నివసించుచున్నట్టియు, ఒక విధ ముగా విదేశీయులైనట్టియు, వారినే పటాలములలో ముఖ్యముగా, చేర్చుకొనుచుండిరి. నేపాళమందలి ఘూ

ఖ్రాలను, ఆఫ్ఘనిస్థానమందలి పఠానులను, జమ్ములోని డోగ్రాలను, రాజస్థానమందలి రాజపుత్రులను, దక్కను లోనున్న మరాఠీ సంస్థానములోని మహారాష్ట్రులను, పాటియాలాయందలి శిక్కులను, ముఖ్యముగా పటాలము లలో చేర్చుచు బ్రిటీషుయిండియాలోనున్న, వీరజాతు లలోని వారినికూడ, కొంచెముగా చేర్చి పటాలములను కూర్చుచుందురు.

కాని నిరపరాధులైన యిండియన్ సిపాయిలసే కులు, సిపాయీమ్యూటినీ యణచబడినతర్వాత దారుణ శిక్షలకు బాల్పడిరి. ఇట్టి యమానుష శిక్షలకు, వీరు పాత్రు లెట్లయిరో, మనకు తెలియదు.

ఇండియాకు సెక్రటరీ ఆఫ్ స్టేటుగానున్నపుడు, డ్యూక్ ఆఫ్ ఆర్గిలు, తన 'India under Dalhousie and Canning' యను పుస్తకవిమర్శలో యిట్లు వ్రాసెను:

"లార్డు కానింగు, యిండియన్ పటాలము లన్ని యును, విప్లవము చేసెననుటను, విశ్వసించ లేదు...... విప్లవము ప్రారంభమైనపుడు, దక్షిణ రాష్ట్రములన్నిటి లోనూ 2400 తెల్ల సోల్జరులు మాత్రమే యుండిరి. ఆరాష్ట్రములలోనే సిపాయీలు 29000 మంది యుండిరి. కాని యీభాగములోనే విప్లవము, చాల తక్కువగా చెలరేగినది." పేజీ 94.

హిందూదేశము:

ఈతడే మరియొకచో నిట్లు వ్రాసెను:

"దేశీయసైన్యముల సహాయము లేనిదే, మనము జయించిన యుద్ధ మొకటియు లేదు. ముఖ్యముగా వారి పైననే మన మాధారపడి యుంటిమి.........మనము యీ క్లిష్టసమయములోనే, వారిపై నెక్కువ నమ్మక ముంచవలసి వచ్చినది. వారును, మన విశ్వాసమును, రిత్త యొనరించి యుండలేదు. మన కిప్పుడు సహాయము చేసినట్లు, మరెప్పుడును, చేసియుండ లేదనిన, సత్యదూరము గాదు." Ibid 100-101.

దేశీయ సైన్యములలో కొంతభాగము మాత్రమే విప్లవము చేసియుండగా, యుక్తాయుక్తవిచక్షణ లేకుండ, యావత్తు దేశీయసైన్యములును దారుణముగా శిక్షింపబడుటకు హేతు వేమి? దేశీయ సైనికులకు, విశ్వాసహీనులగు తమ తెల్లయధికారులపై, న్యాయమగు కోపకారణము లనేకములు గలవు. కలనల్ మాలీసన్ యిట్లు వ్రాసి యున్నాడు:

"సిపాయీలలో అసంతృప్తిని గలుగజేసినది, మనకు వారియందు గల విశ్వాసహీనతయే."

"మొదటి ఆఫ్ఘన్ యుద్ధ మైనప్పటినుండియు, వారియెడల మన విశ్వాసహీనత కనుపట్టుచున్నది."

సిపాయీలకు డబుల్ బేటా యిచ్చు విషయములో కంపెనీవారు తమ మాట నెట్లు తప్పిరో, మాలీసస్ వ్రాసెను.

"ప్రభుత్వమువారు భంగముచేసిన వాగ్దానమునే, సిపాయీలు చెల్లించ నిరాకరించినందులకు, శిక్షించిరి."

అందుచే మాలీసన్ యుద్దేశప్రకారము, విశ్వాసహీనులైన కంపెనీ ప్రభుత్వమువారియెడల, సిపాయీలకు ద్వేషకారణములు గలవు ఇట్లుండ దేశీయసైనికులను తప్పించి, విదేశీయ జీతగాండ్రను, వారిస్థానే నియమించుటకు, ప్రభుత్వమువారు పూనిరి. విప్లవాత్పూర్వమునుండియు, హిందూదేశమును, ఆంగ్లేయ సైనికులకు తరిఫీదు నిచ్చుటకు తగిన స్థలముగా జేయుటకు, బ్రిటీషు ఉద్యోగులు ఆలోచించుచునే యుండిరి. కలకత్తా రివ్యూ 26 వాల్యూం, 177 పేజీలో 'సర్ హెన్రి లారెన్సు', బేజన్ కోర్టు అను ఫ్రెంచి బారన్ వ్రాతను క్రోడీకరించెను. ఈ బేజన్ కోర్టు, Five months in the camp before Sebestapole' అను పుస్తకములో, యిట్లు వ్రాసెను:

"ఆంగ్లేయులు........దండయాత్రకు ప్రారంభమునుండియు, మిక్కిలి దురవస్థలో నుండిరి. ఆంతరంగికపరిపాలన, అసామాన్యముగా నుండుటచే, వారి సైన్యములు మిగుల బలహీనములై యుండెను. సైనికులలో

అవినీతియు, దౌర్భాగ్యమును, నే వర్ణింపలేనంత యెక్కు
వగా ప్రబలియుండెను........ఆఫ్రికాలోని యుద్ధమే,
మనకు చాల యనుభవము నిచ్చి, సురక్షితులనుగా చేసి
యున్నది. మన సైన్యములకు, విడియుటలో గల యను
భవమును, వ్యూహరచనాపాటవమును, ఖండాంతరమున
సల్పిన దీర్ఘప్రయాణానుభవమును, మనకు చాల యుపక
రించినవి. క్రిమియాలో మనకు చాల యుపయోగపడినది,
మనకు యీ స్వల్పవిషయములలో గల పరిచయమే!"

ఈ వ్రాతను క్రోడీకరించుచు, సర్ హెన్రీ లారె
న్స యిట్లు వ్రాసెను:

"ఉపయోగించుకొనుట తెలిసియున్నచో, యిం
డియా మనకు ఆఫ్రికావంటిదే. కేవలమూ అంతేగాదు.
మన కచ్చట దండయాత్రలు, ముట్టడులు. సైనికనివేశా
నుభవమును, అన్నియును గలవు. వాటివలన, అనుభవ
జ్ఞానమును, లాభమును బొందుచున్న వా రెందరు
న్నారు?"*

ఈ సిపాయీల కలహమును, సాకుగా గొని, చిర
కాలమునుండి కాంక్షించుచున్న, వారి కోరికను తీర్చుకొ
నిరి. ఇండియాను, ఆంగ్లసోల్జరులతో నింపివేసిరి. దేశీయు

* 'Who Should Pay the Piper' in Modern Review for October 1908, Page 332.

౦కు 'ఆర్టిలరీ' (ఫిరంగిదళము) లో స్థానము లేకుండ జే
యుటయే గాక యితర పటాలములలో గూడ చేర్చుట
లేక, కఠిననిబంధనల నేర్పరచిరి.

ఈవిప్లవము నణచుటకైన ఖర్చులకన్నిటికిని, భార
తదేశమును కర్తగాజేసి, ఋణమునంతను, హిందూదేశ
ముపై నంటగట్టిరి: బ్రిటీషుదేశములోనుండి సోల్జరులను
పోగుజేసి, తరిఫీదునిచ్చి, యిండియాకు తెచ్చుచుండు
టకును, అందులకగుఖర్చు వెచ్చములనన్నిటిని, యిండి
యాపైననే విధించుచుండుటకును, నిశ్చయించిరి. మేజరు
వినగేటు 'A Few words on our Financial Relations with India' యను పుస్తకములో యిట్లు
వ్రాసెను: *

"హిందూదేశముయొక్క జాతీయ ఋణము
లోనూ, సైనిక వ్యయములోనూ, చాల భాగము.
వలసరాజ్యములతోటి యుద్ధములయందును, సామ్రాజ్య
క్షేమమునకును, మాత్రమే ఖర్చుచేయబడి యున్నది.
1857 వ సంవత్సరమందలి, యేవిప్లవము, మన హైందవ
సామ్రాజ్యమును ప్రమాదస్థితికి దెచ్చినదో, మన జాతి
యూరోపులో ప్రథమగణ్యముగా పరిగణింపబడుటకు
భంగము జేసియుండెడిదో, అట్టి సిపాయీవిప్లవము నణ

* ఈకరతపత్రము నీతడు తిరిగి ప్రచురించి యున్నాడు.

చుటలోకూడ మనము, ఒక్కపైసనైనను ఖర్చుచేయలేదు. (విప్లవము సణచుటకైన యుద్ధవ్యయములోనగు ఋణమును మనము భరించుటకీయకొనలేదు.) ఎప్పుడైనను బ్రిటీషువారు గొప్పధైర్యసాహసములను, త్యాగమును చూపవలసి వచ్చినచో, అట్టి తరుణము విప్లవకాలములోనే, యనక తప్పదు. ఏలనన బ్రిటీషు సామ్రాజ్యమందమూల్య మణియనదగు హిందూదేశము, మనహస్తములనుండి పెరికివేయబడుటకు. సిద్ధముగా నుండెను. మన చరిత్రలో బహు ప్రమాదకరమైన యాఘట్టమున గూడ, మన యిండియారాజనీతి, స్వార్థపరత్వమును వీడజాలకపోయినది అద్వితీయమును, అనుపమానమును, యగు నీచత్వమును ప్రదర్శించి, యిదివరకే తలమునిగియున్న భారతదేశమును, అదనపు ఋణభారముచే ముంచివైచితిమి. మన ఆంగ్లసామ్రాజ్యమును సంరక్షించుకొనుటకైన, యుద్ధవ్యయమును, హిందూదేశముపై గట్టుటలోగల హేతువులేవియో! ప్రయత్నమేదైన విఫలముగావచ్చును, గాని దానిని ప్రేరేపించిన శక్తిని యసమర్థమనిగాని, దూష్యమనిగాని చెప్పవీలులేదు. వలసరాజ్యములకు, విదేశరాష్ట్రములకు, అవసరమైనపుడు ధనసహాయము నుదారబుద్ధితో చేయు, నీబ్రిటీషుసామ్రాజ్యము అనూహ్యమైనట్టియు, అభ్యాసములేనట్టియు, లోభత్వ

ముతో, తనకు అమూల్యమగు యిండియన్ సామ్రాజ్యమును, మిక్కిలి ప్రమాదకరమైన అర్థికదురవస్థలో నుండ గాకూడ, సహాయముచేయ నిరాకరించుట, చాల ఆశ్చర్యకరము, విచారకరము, లజ్జాకరము!"

"పాఠకులకు, మనజాతీయాపరాధము నింతకన్న స్పష్టముగా జెప్పుటకు, ఋణగ్రస్తమైయున్న, శిథిలావస్థలోనున్న, భారతదేశ ఆర్థిక సామ్రాజ్యపై, మనము వేసిన అదనపు భారములను, వివరింపవలయును. ఇటీవలనే కామన్సుసభవారి యెదుట పెట్టబడిన 'సైనికవ్యయము. అంచనాలు (Army Estimates) ను బట్టి చూచిన, హిందూదేశములో నుంచబడియుండి, యిండియాఖజానా నుండి, పోషింపబడు, అన్నితరగతుల సైనికులను గలసి 91897 గురున్నట్లు తెలియుచున్నది. వీరందరును మహారాజ్ఞియొక్క శాశ్వతపటాలములకు జెందినవారే. ఈ పటాలము లన్నియును, యిండియాలో నుంచబడియున్నను, బ్రిటీషుసామ్రాజ్యముయొక్క రక్షణకై యుంచబడినవేగావున, బ్రిటీషుఖజానానుండి పోషించుచున్నచో, యేమియు ననబనిలేదు. కాని వీరేగాక, ఫిబ్రవరి మొదటి తేదీవరకు లెక్కచూచిన, యిండియాలోని వివిధసైనిక శిబిరాలకు జెందియున్న, 16427 గురు సైనికులు, మనదేశములోనే (యింగ్లాండు) యుంచబడియు, యిండియాఖజా

నాచే పోషింపబడుచున్నారు. ఇంగ్లాండులోనే యుంచ
బడి, బ్రిటీషు సామ్రాజ్యములో నెచ్చటి కవసరము గలి
గినను పంపుటకు వీలుగా నుంచిన, యీ 16427 గురు
సైనికులును, కేవలమూ వారు యిండియన్ పటాలపు
డిపోలకు చెందియున్నారను హాస్యాస్పదమైన కారణము
చేతనే, హిందూదేశ సిబ్బందిగా లెక్కించబడి, యిండి
యా ఖజానానుండి పోషింపబడుచున్నారు!* ఈ విధ
మున, పటాలములు, బ్రిటీషుదీవులలో పని చేయుచున్నను
హిందూదేశ సిబ్బందిగా లెక్కించబడి, ఆఫీసర్ల జీతములు,
ఖర్చులు, సాదర్లు సహా, యిండియా ఖజానానుండి వసూ
లు చేయబడుచున్నవి. ఈవిధమగు దురన్యాయము, బ్రి
టీషువారి, యే యితర సామ్రాజ్యము విషయములోనూ
జరుపలేకపోవుచున్నాము. ఉదాహరణకు దూరము పో
నక్కరలేదు. ఇండియాతీరమునకు కాన్పించుచునేయుండు
సింహళములో నుంచబడియున్న, బ్రిటీషు రెజిమెంటు

* 1858 మార్చి 4 తేదీని, కామన్సుసభలో, ఆర్మీయెస్టిమేటు
నుగూర్చి, యుపన్యసించుచు, జనరల్ పీల్, యిట్లు చెప్పెను:
"ఈ 16427 గురు సోల్జరులును, హిందూదేశమును రక్షించుటకుం
చిన 105685 గురు సైన్యములోనూ, ఒకభాగము మాత్రమే.
"1859 మార్చి 5 తేది 'టైమ్సు' పత్రికలో జనరలు పీల్ యొక్క
ఉపన్యాసమును చూడుడు.

యొక్క జీతభత్యము లన్నియు, బ్రిటీషు ఖజానానుండి యే, చెల్లింపబడుచున్నవి ”

“నీచాతినీచమగు విషయమును నిరీక్షింకను తెలుపలేదు. ఇటీవల జరిగిన యల్లరుల విషయములో జరిగినట్లుగా, అదనపుపటాలములను యిండియాకు పంపవలసి వచ్చుచో, ఆపటాలములు బయలుదేసుటకు ఆరుమాసములు ముందునుండియు, వాటికగు జీతభత్యములు, ఖర్చులు, ప్రయాణవ్యయములు, మొదలగునవన్నియు, యిండియావల్ల రావలసిన ఋణముగా యెంచబడి, ‘బ్రిటీషువే ఆఫీసు’ వల్ల వసూలుచేయబడును.

ఇండియా ప్రభుత్వమువల్ల రావలసిన ఋణమేమనిన, పంపబడిన అదనపు పటాలములయొక్క తరిఫీదు, దుస్తులు, భోజనము వగైరాలకు, పంపబడుట కారుమాసముల పూర్వమునుండియు, యగు ఖర్చులే!’

“హైందవ విప్లవ సమయములోను, తరువాతను గూడ, ఆర్థికసౌష్ఠవముకు భంగము గలిగెను. ఇండియాకు అదనముగా పంపబడిన పటాలముల జీతభత్యములు, ప్రయాణాది వ్యయములు, ఆరుమాసములు పూర్వము నుండియుగూడ, బ్రిటిషుప్రభుత్వము, యిండియావల్ల వసూలు చేసినది. ఇంగ్లాండులో బనిచేసిన ఆరుమాసము

లకునుకూడ యగు ఖర్చువెచ్చముల, నిండియానుండి యణాపైసలతో లాగుకొనుటకు కారణమేమి? హిందూ దేశము మనపాదములయొద్ద పరాభూతమై పడియున్న దనియేనా? ఇంగ్లాండునందలి పెట్టుబడి దారులయు, ప్రభువులయు స్వలాభమునకై పంపబడిన పటాలముల వ్యయమును, యిదివరకే గుంగదీయబడియున్న యిండియాపై రుద్దుట, మనకేవిధమైన న్యాయమో, నీతియో, గౌరవ వ్యాపారమో, సమాధానము చెప్పవలసిన నైతిక బాధ్యత మనపై నిలచియున్నది. ఈపటాలములను, మనమేమైన, యిండియా ప్రజల సంరక్షణకుగాని, వారి యుపయోగమునకుగాని పంపియుంటిమా?''

హైందవసైన్య సంస్కరణము, యిండియా చెల్లించవలసిన మొత్తమును (యింగ్లాండుకు) చాల హెచ్చు చేసినది. అంతేగాక యిండియన్‌లను నిర్వీర్యుల నొనరించినది. దేశీయ సిపాయీలను, సైన్యనాయకత్వమునకు అసమర్థులనుగాను, వ్యర్థులుగాను, అసహ్యులుగాను చేసినది ఈపరిస్థితులు బ్రిటీషువారికి చాల యుత్సాహము గొల్పినది. అందుచేతనే 'రాబర్ట్సు ప్రభువు' యిట్లు వ్రాయుటకు సిగ్గును, సంకోచమును, పొందియుండలేదు. 'ఇండియాలో నలుబదియొక్క వత్సరములు' అను తన గ్రంథములో, ''అన్ని జాతులవలెనే, యిండియన్ సిపా

యీలుకూడ యితరులచేతనే నడిపింపబడవలెను. తూర్పు జాతులవారు, యుద్ధములందారితేరి యుండియు, అత్యంత ధైర్యవంతులయ్యును, నాయకత్వము వహించుటకు తగు గుణములు కలవారుకారని, మనకు చరిత్రయు, స్వానుభవమును చెప్పుచునే యున్నవి. (మనయదృష్ట వశమున) దేశయోద్యోగు లెన్నటికిని, బ్రిటీషు ఆఫీసర్ల పదవి నధిష్ఠించుటకు తగరు.''

ఈసందర్భములో 'లార్డు రాబర్ట్సు' యింకొక విషయమునుకూడ చెప్పియుండిన సమంజసముగా నుండి యుండును. 'తూర్పుజాతులు నాయ్యకత్వము వహించి నడుపజాలకి పోవుటకు కారణము సిపాయీ విద్రోహము తర్వాతను, వెనుకనూ గూడ) తూర్పు యిండియా కంపెనీ వారిచేతను,) (యితర రాజకీయవేత్తల సలహాపై, ప్రస్తుత ప్రభుత్వముచేతను) యిండియాదేశీయ పటాలము లలో ప్రవేశపెట్టబడిన సంస్కారణలే' యని.

ఈవిషయములయొక్క సంభవా సంభవములను, కేయీ, మాలీసన్‌లచే రచింపబడిన 'యిండియన్ విప్లవ చరిత్ర' లో History of the Indian Mutiny of 1857-58 by Kaye and Malleson, Vol 1. Page 148 చూడ గలము. ఈఆంగ్ల చరిత్రకారులు, మొదటి, యిండియన్ సిపాయీలయు, వారి దేశీయ సైన్యాధిపతు

లయు, సామర్థ్యములను గూర్చి యిట్లు వ్రాయు చున్నారు.

“మధురాపట్టణమును ముట్టడించుటలో వారెంత నిర్భయముగా యుద్ధముచేసిరో, ఆర్కాటును రక్షించు నపుడు వారెంత ధైర్యసాహసములను చూపి పోరాడిరో, గూడలూరువద్ద, ఫ్రెంచివారి ఉత్కృష్టసైన్యములతో ఖడ్గాఖడ్గి నెట్లు పోరాడిరో, వర్ణించుటకు, చరిత్రకారులు ఆనందమును, గర్వమును, జెందియున్నారు. సర్వాధికారములును, బాధ్యతలును, గౌరవములును, బహూకరణములును, ఆరోజులలో కేవలము ఆంగ్ల సైన్యాధిపతులకే గుత్తకీబడి యుండలేదు. బహు ప్రమాదకరములును, కష్టసాధ్యములు నగు, కార్యములను, సాధించుటకై, గొప్ప సైన్యములను హైందవ సైన్యాధిపతుల క్రింద పంపుచుండిరి. ఆరోజులలో, యేతెల్ల సోల్జరును, నల్ల సైన్యాధిపతిక్రింద పనిచేయుటకు పంపబడుటను, గౌరవహీనతగా పరిగణించెడివాడు గాదు. నల్లసైన్యాధిపతులు, రంగుభేదమున్నను, గొప్పవారుగనే తలంపబడుచుండెడివారు. తన సైన్యముల పురోభాగమున, అశ్వారోహియైయుండ, ఆతని యాజ్ఞలను, మరియొక దేశీయ జాతు, పటాలముల సుబేదారుల కందరకును, అందజేసెడి వాడు. ధైర్యసాహసములుగల్గి, నేర్పరులగువారు, కేవ

ంమూ తమ ధైర్యసాహసములచేతనే గౌరవింపబడెడు వారుగాని, నెత్తిపై పాగాయున్నదా, టోపీయున్నదా, యను, నీచవిభేదమునకు పాల్పడెడివారు గారు!"

ఈచరిత్రకారులు, దేశీయ సైన్యాధిపతులు, కంపెనీ వారిచే అనుమానింపబడి, అవమానింపబడి, కడు హీనస్థితి కెట్లు గొనిరాబడిరో కూడ వ్రాసియున్నారు.

"దేశీయులనుండి కూర్చబడి, ఆదేశీయులలోనే ఉన్నత వంశీకులచే నడిపింపబడుచున్న (ఉన్నతజాతివారై తమ తాబేదారులనుండి ఆజ్ఞానిర్వహణము చేయించుకొనుట కలవాటు బడియున్న సైన్యములయొక్క విలువను కనిపెట్టియే, మనవారు, దేశీయసైన్యములను గూర్చిరి. కాని మన ఆధిక్యతయు, ప్రభుత్వమునూ, బలపడుచున్నకొలదియు, యూరోపియనులకు సహజమగు పట్టుదలతో, దేశీయోద్యోగులను తప్పించి, వారిని స్థానభ్రష్టులను చేయగలిగితిమి ఇందులో ప్రకృతి విరుద్ధమేమియును లేదు. తన పొరుగువారికన్న ప్రతిపనిని బాగుగా నెరవేర్చ గలనని, తెల్లవారు తలంచుచుందురు. అట్లే మనము చేయుచున్న మంచియందు ఆత్మవిశ్వాసము గలవారమై, మనస్ఫూర్తిగానే, మనము దేశముయొక్క సివిలు, మిలిటరీ ప్రభుత్వకళ్ళెములను మనకైవశము చేసుకొంటిమి. ఉన్నతాధికారము లన్నిటిని, మనిచేతుల

లోనికి తీసికొని, నీచములు, హీనములు, కష్టతరములు నైనట్టి పనులనన్నిటిని దేశీయులచేతనే చేయించుచు, వారిని గులాములుగా నొనరించితిమి. న్యాయమును, విశాలమునగు దృష్టితో, యీసమస్యను గుఱించి యాలోచించియున్నచో, నెప్పటికైనను మనపై నెదురుతిరుగుటకే యుద్యుక్తులగు, నీదేశీయులయందే, మిలిటరీ ప్రభుత్వము నుంచియుందుము; యిట్టి దృష్టితో విచారించియే యున్నచో, బ్రిటీషుప్రభుత్వమును బలపరచుటకో తమ నైతికపతనమును గుర్తింపలేని విదేశీయ దురాశాపరుల చేతులలో, యీఘనసైనిక శక్తినుంచుటకు, కలలోనైన యూహింపజాలియుండము. కాని మన మట్లుగాక, ఆంగ్లజాతికి సహజమగు పద్ధతినే యవలంబించితిమి. అట్లు కానిచో మన యాంగ్లప్రభుత్వ మేమైపోయియుండెడిదో! ఇప్పటివరకును పటాలములలో నాధిపత్యమును వహించి, అనేక సారులు తమ తమ వ్యక్తిసామర్థ్యములకై బహూకరింపబడి, వారి పదవులలోనుండుట కుదారగర్వమును పొందుచున్న, దేశీయులను త్రోసివైచి, వారిని నామమాత్రావశేషులనుగా జేసి, వారి యధికారమును కైవశము జేసుకొని, విదేశీయులమగు మన మాక్రమించితిమి. ప్రతిసైన్య విభాగమునకును, ఒక్కొక్క ఆంగ్ల ఉపసైన్యాధికారి నియమింపబడెను. దేశీయ సైన్యాధికారులు

క్రైస్తవప్రభుత్వనిర్మాణతత్వము

ఛాయామాత్రముగా నిలిచియుంప బడెరి."

దేశీయ సైనికోద్యోగుల హీనదశతోపాటు, సైనికుల వ్యవస్థయే మారిపోయెను. గౌరవనీయులై, యున్నతవంశములకు జెంది, ఆజ్ఞాపించుటకే యలవాటుపడి యున్న వారెవ్వరును, సైనికులుగా జేరుట కుత్సహింప రైరి. సైన్యములలో జేరి, తమ జీవితము నౌన్నత్యముకు గొనివచ్చుటకు, ఆశించుట వ్యర్థమైపోయెను. సైనికగౌరవము లన్నియు నశించిపోయెను. దేశీయ సైనికులను జేర్చుపద్ధతి, బహు హీనదశకు వచ్చినది. నామమాత్రముగా కొందరి కధికారపదవులు లభించుచుండెను. ఉద్యోగములు, చాల యెక్కువగానే కల్పింపబడినవి, గాని ఉన్నతపదవులకు వచ్చు సావకాశములు, దేశీయుల కెవ్వరికిని మిగులలేదు. అందుచేతనే యప్పటినుండియు, సిపాయీలను హీనజాతులనుండియు, అల్పులనుండియు, మాత్రమే చేర్చుకొనవలసి వచ్చినది. ఉన్నతవంశసంభవులగువా రెవ్వరైన, యుద్ధశాఖలోనికి చొరదలచినచో, దేశీయ సంస్థానములకు బోయి, ఆ యా ప్రభువులకే తమ ఖడ్గముల నర్పించుచుండిరి."

# ౫. 'భేదించి పాలించుట'

సిపాయీల కలహామునకు పూర్వము సుమారు నలుబది సంవత్సరములు, అనగా 1821 మే నెల 'ఏషియాటిక్ జర్నల్' లో ఒక బ్రిటీషు ఉద్యోగి 'కర్నాటికస్' అను పేరుతో యిట్లు వ్రాసెను:

" 'Divide at Empera' యనునదియే, మన మూలసూత్రముగా నుండగలదు. రాజకీయ, సైనిక, సివిలు పరిపాలనలలో దేనినైనను, మనము భేదోపాయ ప్రయోగము వలననే జరిగించవలెను.

ఆ రోజులలో బ్రిటీషు యధికారుల యుద్దేశ్యము లట్టివైనను, యిండియా గవర్నమెంటు, వాటిని బహిరంగముగా చాటజాలకపోయిరి. ఇండియస్ విప్లవము జరిగినతర్వాత, వారనేకమారులు, వారి యుద్దేశ్యములను బాహాటముగా జాటిరి. బాధ్యతాహీనులైన పత్రికాధిపతులే గాక, ప్రభుత్వోద్యోగులు కూడ, యిండియాలోని జాతి, మత, కులద్వేషములను ప్రోత్సహించుటకు సిగ్గుపడరైరి. మొరాదాబాదులో, బాధ్యతగల సేనాధిపతిగానున్న 'లెఫ్టినెంటు కలనల్ జాన్ కోక్' యిట్లు వ్రాసియున్నాడు:

"మన యదృష్టవశమున, యిండియాలో ప్రబలి యున్న వివిధమతములు, జాతులు, కులములు, పరస్పర మాత్సర్యముతో యున్నవి. వీటిలో నైకమత్యమును గలిగించి, యీ బాహ్యాభేదములను తొలగించుటకు, మన మెంతమాత్రమును ప్రయత్నించ గూడదు. ఇంతేగాక వాటిని వృద్ధిచేయుటకే మనము సహాయపడవలెను. ఇండియా ప్రభుత్వపు రాజనీతి, 'భేదించి పాలించుము' అనున దియె."

1859 మే 14 తేదీని, బొంబాయిగవర్నరు ఎల్ఫిన్‌స్టన్ ప్రభు విల్లు వ్రాసెను:

"పూర్వపు రోమనుల రాజనీతియగు, 'భేదించి పాలించుడు' అనునదియే, మనకును, యిండియాలో యను సరణీయము."

ఇటువంటి యుదాహరణ లెన్నియేని చూపవచ్చును గాని, వాటివల్ల ప్రయోజన మేమి?

ఇంతకును, యిండియాలో తమ ప్రభుత్వము స్థిరముగా నుండునట్లు చేసికొనుటకై, యవలంబించిన రాజనీతులలో కుటిలమైన యీపద్ధతి మిక్కిలి ప్రాముఖ్యత గాంచిన దనిన చాలును.

## ౬. రాష్ట్రీయ స్వపరిపాలన

సిపాయీల విప్లవ మణచబడినతర్వాత, యిండి యాలో బ్రిటీషు ప్రభుత్వమును సుస్థిర మొనరించుకొనుట కై, వేసిన యెత్తులలో నిది యొకటి. వాస్తవమునకు సామ్రాజ్యమును చీలికలుగా చేయుటయే ముఖ్యసూత్ర మైనను, రాజకీయవేత్తలు, యీ పద్ధతికి, 'రాష్ట్రీయ స్వపరిపాలన' యను మృదువైన నామధేయ మిచ్చిరి. బ్రిటీషువారు వలస వచ్చి, స్థిరనివాసము లిండియాలో యేర్ప రచుకొను విషయమున ప్రశ్నింపబడినపుడు, మేజరు విన్ గేట్, 1858 జూలై 13 తేదీని, పార్లమెంటరీ కమిటీ యెదుట నిట్లు సాక్ష్య మిచ్చెను:

"7771. కేంద్రప్రభుత్వమువలన గలుగు నపాయ ములను గూర్చి మాట్లాడుచున్నావు. ఈ విధమైన ప్రభుత్వమువలన, ప్రజలలో యేకసూత్రబద్ధమైన భావము లు, లక్ష్యములు గలుగుటకును, అపాయకరము లగుట కును, అవకాశము లుండునని యేనా, మీ యూహ?"

"అవును. ఏదైన యొక కార్యవిషయమున, యిం డియాప్రజల కందరకును, యేకాభిప్రాయమున్నచో, మన

విదేశీయపాలకుల కది ప్రమాదజనకము గావచ్చును. కాని వేర్వేరు రాష్ట్రములుగా విడదీయుచో, యే రాష్ట్రములోనేని, యొకవైపు ప్రజలలో మనయందు విరుద్ధాభిప్రాయము గలిగినను, దానిని లక్ష్యము చేయవలయునంతవరకు రాజాలదు. ఈ సూత్రము ననుసరించియే సామ్రాజ్యము నంతను యుక్రూత లూగించు సమస్యలు వచ్చుచో, మనకు యేయొక్క రాష్ట్రములో నైనను గలుగు సంచలనముకన్న, మన సామ్రాజ్యపతనమున కెక్కువ తోడ్పడ గలదు."

"7772. డాన్‌బీ సేమూర్."

"హిందూదేశపు ప్రజలందరును, యేవిషయమును గురించియైనను, యేకకాలమునందు, యేకాభిప్రాయులై ఆందోళన సలుపుదురనియేనా, మీ యభిప్రాయము ?"

"అవును. అట్లు జరుగవచ్చునని యే నే నూహించుచున్నాను."

ఆ రోజులలో బ్రిటీషువారి నందరిని, కలవరపెట్టు చున్న యూహాలనే యాతడు వ్యక్తీకరించెను. ఇండియాలోని జాతి, మత, కుల, వర్ణ, శాఖావిభేదముల నింకను పరిస్ఫుటములుగా జేసి, వారిలో నైక్యత, జాతీయత కలుగనీయకుండ చేయుటకే, ఆంగ్లరాజనీతిజ్ఞులు, పాటుబడుచుం

హిందూదేశము:

౪౭. పురాతనకాలమునుండియు నిట్టి కలహముల కాకరమైన యిండియనులలో, నవీనసర్వమానవసమానత్వసిద్ధాంతము, వ్యాపింపనీయక, నవ్యనాగరకతా విదూరులగావించి, పరస్పరద్వేషభావములలో ముంచివైచి, దౌర్భాగ్యులగావించుటలో కృతార్థులైరి. కాని యిండియా, బహుపురాతనకాలమునుండియు నొకేజాతికి చెందియున్నదని, యొకదృష్ట్యా చెప్పకతీరదు.

# ౭. ప్రభుత్వశక్తిని కేంద్రీకరించుట

ఒకానొక బ్రిటీషు ఆఫీసరు యిట్లు వ్రాసియున్నాడు.

"దేశీయుల సత్ప్రవర్తనను, నేను గౌరవముచేతనే బహూకరింతునుగాని, అధికారమిచ్చుటచేగాదు..."

"దేశీయుల కధికారమివ్వనక్కరలేకుండగనే, వారి సదభిప్రాయమును, మనము చూరగొనవచ్చును. కేవలము అధికారచిహ్నమును మాత్రము ఇచ్చినచో చాలును. రోచిఫాకల్టు మహాశయుడు చెప్పినట్లు, 'నీ స్నేహితులతో ప్రవర్తిల్లునపుడు, వారెప్పుడో యొకరోజున నీకు శత్రులుగాగలరని తలచుచునే, జాగ్రతగా ప్రవర్తించుము' అను విషయమును, నావ్యక్తిగత జీవితములో, నే నసహ్యించుకొందును. కాని బ్రిటీషు ప్రభుత్వము వారు మాత్రము, యిండియాను పరిపాలించు నంతకాలమును, యీసూత్రమును బాగుగా, దృష్టిపథమునందుంచుకొనవలయును." *

---

* తూర్పు యిండియా కంపెనీ వ్యవహారములపై సెలెక్టు కమిటీ రిపోర్టుకు అనుబంధమును చూడుడు. 1832 సం॥ వాల్యూము 5, మిలిటరీ, పేజీ 481-483 కెప్టెను పి. పేజీయొక్క మెమొరాండము.

హిందూదేశము:

ఈసలహాల ననుసరించియే బ్రిటీషు రాజనీతివేత్తలు, సిపాయీలవిప్లవమణచి వైవబడినతర్వాత, తమప్రభుత్వముసు సుస్థాపితమొనరించుకొనుటలో ప్రవర్తించుచుండిరి. సైన్యములలోనికి విద్యావంతులై, యున్నతపదములను వాంఛించినట్టివారిని, చేర్చుకొనుటకు నిరాకరించిరి. అధికారమంతయు, విదేశీయప్రధానోద్యోగుల హస్తములలో నుంచబడెను. కోట్లకొలదిగానున్న, హిందూదేశపు 'హీథెన్' ప్రజల, జీవితమును వాంఛనీయముగాచేయుట కెవ్వరును శ్రద్ధచూపలేదు. వారిని 'మానవుల' నుగా పరిగణించుటకే వారిష్టపడలేదు. ప్రభుత్వశక్తినంతను కైవసమొనరించుకొనిన విదేశీయక్రైస్తవ పరిపాలకులకు, యిండియాలోని 'హీథెన్' ప్రజలెట్లుబోయిననేమి ? శక్తియంతయు, వీరియందు కేంద్రీకరింపబడెను. ఈపద్ధతిచే పురాతనకాలమునుండియు, యిండియాలోనున్న సుప్రతిష్ఠితమగు రాజ్యపద్ధతి నశింపుజేయబడినది. పరిపాలకులయొక్కయు, పాలితులగు ప్రజాసామాన్యముయొక్కయు, పరస్పరసంబంధములనుగూర్చి మేజరు యివాన్సుబెల్ యిట్లు వ్రాసియున్నాడు.

"ప్రతిపరగణాలోనూ, కర్షకునికి ప్రభుత్వముతో గల సంబంధమును నిర్మూలనముచేసితిమి. మంచియో, చెడ్డయో మనకు తోచినట్లుచేసితిమి. మద్రాసు రాజ

భాగియందంతటను, రాజులు, జమీందారులు, మహా
రాజులు, పాలిగార్లు, అందరును మాయధికారచక్రము
క్రిందబడి నలిగి, రూపుమాసిపోయిరి. వారిరాజ్యముల
నాక్రమించితిమి. స్థిరచరాస్థులను కబళించితిమి. వారి
రైతులనందరను, వ్యవసాయదారులకు మహామారులన
దగు, కరణము తహసీలుదారుల కప్పగించితిమి. రైతు
నకును, భూస్వామికినియున్న గౌరవనీయమైన సంబంధ
మును నిర్మూలనము జేసి, ప్రాచీనహైందవసాంఘికవ్యవస్థను
పాడొనరించితిమి. ఈవిధానముచే. పనిపాటులులేక త్రిప్ప
బాటుగలిగియుండు జనసంఘమును పారద్రోలి, మన
రాజ్యమును స్థిరస్థాపితమొనరించుకొంటిమి.'' *

* డి. యి. వాచా, తన 'యిండియన్ పోలిటీ' యనుగ్రంథములో, 43 పేజీలో, ప్రమాణముగా యిచ్చియున్నారు.
Bombay 1895.

# ౭. హిందూదేశము—పీనలుకోడ్

1833-వ సంవత్సరపు ఛార్టరు (సన్నదు), హిందూదేశమునకు గుండెలమీది కుంపటివంటి లామెంబరు నొకనిని ప్రసాదించియున్నది. మనదేశముకు మొదటి లామెంబరు, మెకాలేప్రభువు. ఈతడే పీనలుకోడ్‌ను తయారుచేసెను. కాని యీస్టు యిండియా కంపెనీ పరిపాలించినంతకాలమును, దీని నమలులో నుంచలేదు. ఆంగ్ల దేశీయులగు సిపాయీల పరిపాలనయంతమొంది, హిందూదేశము రాణిప్రభుత్వమునకు వచ్చినప్పటినుండియు, యీ పీనలుకోడ్, చట్టముగా చేయబడి, యమలులోనుంచిరి.

ఐరిష్ దేశపు మహావక్త, 'ఎడ్మండుబర్కు', ఐరిష్ పీనలుకోడ్‌ను గురించి యిట్లు చెప్పియున్నాడు.

"ప్రతివిషయమును బాగుగా యోచింపబడియే, కాగితముపై పెట్టబడియున్నది. ప్రజలకు దారిద్ర్యమును, పీడనమును, హింసను, ఆత్మహైన్యతను, అనతికాలములో గొని రాజాలిన, అమోఘ, సుఘటిత, మారణయంత్ర మనజెల్లు, నీచట్టమును కుమార్గగామియగు మానవుని చావు తెలివితేటలచే యోచింపబడిన, దుష్పథములపుట్ట, మానవస్వభావమునే సంకుచితమొనరింపజాలిన దీచట్టము."

## కై) స్వప్రభుత్వనిర్మాణతత్త్వము

ఇండియన్ పీనలుకోడ్, ఐరిష్ పీనలుకోడ్ కన్న నైచ్యతగలది. న్యాయదృష్టిలో సర్వమానవులును సమానులన్న, ముఖ్యసూత్రమునే, యీచట్టనిర్మాతలు త్రోసివైచిరి చట్టములోకూడ రంగువిభేదములను ప్రవేశపెట్టుటచేతనే, వీరి నీచస్వభావము, పక్షపాతబుద్ధియు, తెల్లమగుచున్నవి దీనికితోడు, క్రిమినల్ ప్రొసీజరుకోడ్ యొకటి. తెల్లవేరస్థుని క్రూర, అమానుషచర్యలనుండి, నల్లవాడు, అధముడగు 'హీథెన్' నల్లవాడు, తగుపరిహారములను బొందుటను, కేవలమూ అసంభవముగా చేసిన దీచట్టమే. ఇండియన్ల కుత్తుకలపై కత్తినుంచి, వారినెల్లపుడును, తమకు పాదాక్రాంతులనుగా నుంచుకొని, వారియందు బానిసవృత్తిని కల్పించుటచేత, హిందూదేశములో, తమ సామ్రాజ్యమును సుస్థిరముగా నుంచుటకు సంకల్పించిరి, యీమనప్రభువులు.

చట్టమునుగురించి చెప్పుచు సమర్థుడగు నొక న్యాయాధికారి, 'విలియమ్ గాడ్విన్' యిట్లు చెప్పుచున్నాడు.

'చట్టమనగా, మానవత్వమును వినాశనమొందించు తత్వముగల సంస్థ.'

అధికారముగలవారు, యెట్టిహింసలను, అత్యాచారములను, చేసినను, 'లా అండు ఆర్డరు' ల పేరిటనే చేయుచున్నారు. ఈవిషయము, హిందూదేశములో ప్రత్యక్షమైనట్లింకొకచోట, చూడజాలము.

# ౯. హిందూదేశము—ఆంగ్లేయుల వలస

డార్విన్, వెల్లెస్‌ల కాలమునుండియు, పరిణామవాదులు, పరిస్థితులకు సరిపడుట నొక సృష్టిని నియమముగా తలంచుచుండిరి. జీవనయుద్ధములో, పరిస్థితుల కెవరు సరిపడుదురో, వారే కడకు జయించగలవారు. సరిపడుట యనిన, శీతోష్ణ పరిస్థితులకు, దేశకాలపాత్రములకు, యితర పరిసరపరిస్థితులకు, తన్నుతా సరిపెట్టుకొనుటయే. ఇండియా విప్లవముతరువాతనే కొందరు యూరోపియన్‌లు, తమ ప్రభుత్వము, యిండియాలో స్థిరత్వము పొందుటకు దీని నొక ముఖ్యసూత్రముగా గ్రహించిరి. కలకత్తా రివ్యూ యిట్లు వ్రాసెను:

“మన భవిష్యద్రాజనీతిలో ‘ఎడాప్టేషన్’ అనునదియే ముఖ్యసూత్రముగా నుండవలయును. ప్రాక్పశ్చిమదేశీయుల బుద్ధికి చాల భేదమున్నది. వస్తుప్రకృతిలోను, శీతోష్ణపరిస్థితులలోను, జాతినియమములలోను, సంఘకట్టుబాట్లలోను, చారిత్రకస్మృతిలోను, యన్నిటిలోననూ బహుళవిభేద మున్నది. దానిని మన మీరోజున మార్చలేము. ఒక్కమారుగా మార్చబ్రయత్నించుచో,

మొద్దు ననుకరింపదలచిన నప్పవలె, ఆత్మవినాశనమునకు దారితీసికొననవారమగుదుము. ఐక్యతలేకుండగనే, మనము మైక్యతను ప్రదర్శింపవచ్చును. మతములోను, విద్యలోను, భాషలోను, మైక్యతనుగూర్చి సాహసించిన గత చక్రవర్తు లెట్టిస్థితికివచ్చిరో హిందూదేశచరిత్ర చెప్పుచునే యున్నది. ప్రాచ్యపాశ్చాత్యబుద్ధుల మధ్య యఘాతమ్లేయుండవలెను. కాని రెండు వోట్ల వంతెనలు యేర్పాట్లుచేయవచ్చును. ఒకటి క్రైస్తవమతము, రెండు విజ్ఞానము, ప్రాగ్దేశీయుల యభిరుచికి తగువిధమున ఆంగ్లేయవిజ్ఞానమును, యిండియాలో విస్తరింపజేయవలయును." 30 వాల్యూము, 32 పేజీ.

ఫ్రెంచివారు దేశపరిస్థితుల కనుగుణముగా నడచుటచేతనే ప్రజారంజకులైరను విషయమును, ఆంగ్లేయులు మరువలేదు. సుప్రసిద్ధయాత్రికుడగు హేబర్ యిట్లు వ్రాయుచున్నాడు.

"ఇండియాలోని యీప్రాంతములలో ఫ్రెంచివారి ప్రతిభ, చాలకాలము ప్రజ్వలించియున్నది. వారికి ప్రజలలో యెవ్విధమైన ప్రతీతి యున్నదను విషయమును, వాకబుచేయుటకు, నా యీయవకాశమును వినియోగించితిని. వారుకూడ కఠినులనియు, క్రూరులనియు చాలమంది చెప్పిరి. కాని, యింగ్లీషు సాహెబులకన్న, ప్రజారంజక

ములును, సమాధానకరములును యగు నలవాట్లుగలవా రని చెప్పిరి. వారిలో చాలమంది, దేశీయుల వేషభాషా చారముల నవలంబించి, ప్రజలతో కలసిమెలసియుండిరని తెలియుచున్నది ఇంగ్లీషువారట్లుగాక ఒంటెత్తుగా, ప్రజ లకు దూరముగానుండి, అసహనశీలురై యుందురు ఈగు ణములు, వీరికిసహజములై, వారెచ్చటికిబోయినను, వా రియందు ద్వేషముకలుగజేయునవియై యుండును. వీరితరు లను ద్వేషించి, వారిచే ద్వేషింపబడుదురు. ఈవిధమగు మూర్ఖపు, గర్విష్ఠి, దుస్స్వభావపు, జాతీయాహంభావము ను, నేను నిత్యమును యిచ్చట ప్రత్యక్షముగా, చూచు చునేయున్నాను. ఇచ్చటకూడ యిట్టిస్వభావమువల్లగలు గు కీడులు స్వల్పములుగావు మనసూ్ఫర్తిగా, అన్యాయ ము, హింస, చేయుచున్నామనుటగాదు. కాని దేశీయుల తోడ మాట్లాడుటలోకూడ, మనము అవమానకరమైన, చిరచిరలాడుస్వభావమును వెల్లడించుచు, అహంభావము తో వారిని మనసంఘమునుండి వెలిబెట్టుచున్నాము.''

కావి యిండియాను వలసరాజ్యముగాచేయుట యసంభవమని తలచినప్పటినుండియు, యూరోపియన్‌లు, యీ 'ఎడాప్టేషన్' నొకపద్ధతిగా వదలివైచి, తమప్రభు త్వమును స్థిరమొనరించుకొనుట కితరమార్గములనే యవ లంబించుచు వచ్చిరి.

# ౧౦. దూరస్థిత సామ్రాజ్యము

బ్రిటీషువారు యిండియాను పాలించుటలో, స్థిరమైన నీతి నవలంబించలేదు. 'స్థిరమైన రాజ్యపాలనా నీతి' యను మాటను, కంపెనీవారెంగనే యెఱుంగరు. మనుష్యద్వేషియగునా 'మార్క్వేస్ ఆఫ్ శాలిస్ బరీ', కూడ యిట్లు వ్రాసియున్నాడు.

"ఏప్రోత్త రాజ్యాంగవిధానమునకును, స్థిరత్వమును కల్పించుటకు, మనకుశక్తిలేదు. మనపూర్వుల యేపద్ధతులను మనమతిక్రమించియుంటిమో, యట్లే మన ముందుసంతతివారుకూడ చేయకుందురను నమ్మకమేమి యున్నది? మనపూర్వులయెడల మన మెట్టిగౌరవమును చూపితిమో, యట్టిగౌరవమునే, మనసంతతివారివలన బొందనాశింపవచ్చును. సర్ లూయి మేలట్, హిందూదేశప్రభుత్వవిధానమందలి, యనేక పరస్పరవిభేదములను గూర్చి, జాబితా వ్రాసియున్నాడు. ఈపద్ధతి యింతటితోనైన విరమింపబడునని తలంచుటకు అవకాశమేమున్నది? ఈమార్పులు కేవలమూ నిందాపాత్రములు మాత్రమేగాక, యిండియా గవర్నమెంటు విధానమునుగూర్చి ముందువారికి హెచ్చరికగూర్పగలవు. కార్యస్థితి క్రమ

హిందూదేశము:

మునుబట్టి చూచిన, యిండియా ప్రభుత్వము మార్పుల పుట్టయని బోధపడగలదు. శీతోష్ణపరిస్థితులవలన పంచవర్ష పరిమితమైన ప్రభుత్వముగల, నిరంకుశప్రభువుల పరిపాలనయది. వీనిని, నియమించు అధికారముగలిగినదేదైన, యింగ్లాండులో నున్నదనిన యదియు నిరంతరము మారుచుండెడి సభ్యులుగల కౌన్సిలునందును, త్రింశతి మాసపరిమితాధికారముగల యొక రాజకీయోద్యోగియందును, నిలచియున్నది. ప్రభుత్వమే పరిపాలనజరుపవలెననినచో, నిరంతరచలనశీలమగు యీప్రభుత్వవర్గముపలెనే రాజకీయతత్వములును మారకతీరదుగదా? ఇచ్చటి (యిండియాలోని) రాజకీయోద్యోగులును, ఆంగ్లో హైందవులును, స్థిరాభిప్రాయులై బలపడుచో, శాశ్వత రాజనీతి తత్వమును ప్రవేశపెట్టవచ్చును. కాని యట్టిది జరుగునట్లు తోచదు. తాత్కాలికమగు యేమార్పును, యభివృద్ధియని జెప్పవీలులేదు. అట్టిది ప్రస్తుతప్రభుత్వముచే శిరసావహింపబడవచ్చును. తరువాతిప్రభుత్వముచే త్రోసివేయబడవచ్చునుగూడ. రాజకీయవిధానమందలి మార్పుల జాబితా నభివృద్ధినొందించుటకే, యిట్టివి తోడ్పడగలవు. ఇట్టివి ముందువారి తీవ్రవిమర్శనలకు గురికాగలవు.''
ఇండియన్ లాండు రివెన్యూపై నోట్సు.

హిందూదేశములో క్రైస్తవప్రభుత్వమును సుస్థిర

మొనర్చుకొనుటకై, రాజకీయనీతిని మార్చుకొనుటయే ముఖ్యసూత్రముగా గ్రిటీష్‌వారు గైకొనిరి. కాని రేండి యెల్లెన్నను, యీవిధానములనన్నిటిని మించి, అందరి చేతను సమ్మతింపబడు శాశ్వతనీతి యొకటిలేకపోలేదు. ఇండియా పోతరించియున్నది. దానిరక్తము పిండివేయ వలయును.

# ౧౧. హిందూదేశమును ఋణమున ముంచివైచుట

యూరోపియన్ రాజనీతివేత్త లొకశతాబ్దపు అనుభవముచేతనే, హైందవప్రభువులు, ఋణమున కెట్లు లోబడుదురో బాగుగా గ్రహించిరి వారెంత సులభముగా ఋణమను యెరకు లొంగియుందురో గ్రహించుటయే గాక, ఋణమును తీర్చుటకు వారెంత యలసులో కూడ గ్రహించిరి. తెల్లవారివద్ద గైకొనిన యీఋణమే, పాపమీప్రభువులను, వారి రాజ్యములనుండి, యెడబాపుచుండెడిది. రాజ్యలక్ష్మీవిధురులైన యీయప్రయోజకులు, కంపెనీవారిచ్చు భరణమును గైకొని, మూలపడియుండుటయే మామూలైపోయినది. హిందూదేశపటములో చాలభాగము యెర్రనిరంగుగా, యీపై విధముననే మార్చబడినదని, చరిత్రపాఠకు లెరుగకపోలేదు.

ఈపై పద్ధతియేగాక, యిండియనులను ఋణబద్ధులనుగా జేయుటకు, మరియొకవిధానమును కనిపెట్టిరి. సర్ జాన్ లారెన్సు మొదలగు పంజాబు రాజనీతిజ్ఞులు, భారతీయులు తమకు సమ్మానబంటులై యుండునట్లుగా జేయు

టకై యీవిధానమును ప్రయోగించిరి సిపాయీల కలహ ప్రారంభదినములలో పంజాబీయులవద్దనుండి బలవంతముగా, ఋణముల పేరు జెప్పి, ధనము గుంజుటలోనే, యీ రాజనీతి నుపయోగించిరి. 'బాస్వర్తు స్మిత్తు' యిట్లు వ్రాసియున్నాడు *

"సర్ జాన్ లారెన్సుయొక్క ఆజ్ఞలపైననే పంజాబులోని వివిధ రాష్ట్రములలో, ప్రజలవద్దనుండి, నూటికి ఆరుచొప్పున వడ్డికై, ఋణములు బలవంతముగా ప్రోగు జేయబడెను. ధనప్రియులగు సిక్కులు, సుకరముగా, తమ యొక్క ధనమును, సంశయాస్పదమైన కార్యమునకై వినియోగింప సమ్మతింతురా? సిపాయీ విప్లవము నణచుటకై వారు ప్రభుత్వోద్యోగుల బలవంతముపైననే, తమధనము నొసంగుటకు సిద్ధపడిరి. ఎట్లో యొకలాగున ధనము సమకూర్చబడెను. రాజనీతియందు, యీపద్ధతి, అద్వితీయమైనదై యున్నది. దీనివలన మనకు అత్యవసర సమయములో వలయుధనము లభించుటయేగాక, పంజాబునందలి గొప్పభూస్వాములను, వర్తకులను, మనప్రభుత్వ స్థిరీకరణోద్యమమునందు, మనపక్షమున నిలుచునట్లుచేసి యున్నది. ఈవ్యక్తులు, తమకు మనప్రభుత్వముయొక్క

* బాస్వర్తు స్మిత్ చే వ్రాయబడిన 'లారెన్సు ప్రభువు జీవితము' రెండవవాల్యూము, 308 పేజీ చూడుడు.

స్థిరత్వమునుగూర్చి యెట్టి ఆదరాభిమానములుండవలె యునో, యెరుగకపోరు."

హిందూదేశీయులను తమకేవిధముననైన ఋణస్థులనుగాజేయు నీపద్ధతి, యాంగ్లేయులకు క్రొత్తయునూ గాదు, విశేషమునూగాదు. యూరోపియను లీపద్ధతి నితరస్థలములలో ప్రయోగించి, తమ వలసరాజ్యములను స్థాపించుటలో కృతార్థులైరి. సుప్రసిద్ధుడైన యొకానొక మనుష్యమానసికతత్వవేత్త యిట్లు వ్రాసియున్నాడు.

"యూరోపియనులతో శత్రుభావముతోనున్నను అమెరికన్ యిండియనులు సాంఘికఘోరదుర్మరణములకు లోనై, వినాశముందిరి. పోనీ మిత్రభావముతోనున్నచో వీరభివృద్ధికి వచ్చెదరనినను, యూరోపియనులతోటి మైత్రివలన శత్రుత్వమువలనకంటె యెక్కువ వినాశము గలుగుచుండెను. భవిష్యద్దూరదృష్టి లేకుండగనే, ఉత్తరమెరికాయాదిమ నివాసులు, లక్షలకొలదిమైళ్ల వైశాల్యముగల ప్రదేశములను, యూరోపియనులకు యిచ్చివైచిరి. అనేకసార్లు దేశీయులు మోసగింపబడుటయో, వధింపబడుటయో జరగుచుండెను. తత్ఫలితములు చాల హృదయవిదారకములైనవి. ఒక్కవిషయము నిచ్చట చెప్పెదను. క్రీకులు, నలువదిసంవత్సరముల లోపలనే 2,80,00,000 యకరములభూమిని యిచ్చివైచిరి. వారికి

యితరప్రదేశములు నిర్ణయింపబడినవి. వారికి ఋణదాత లుగా, యూరోపియన్‌లు, యీసువిశాలభూఖండమునకు యేకమాత్ర సర్వాధికారులై రనుటకు మీకాశ్చర్యము గలుగుచున్నదా!'' *

ఇటువంటి మూలసూత్రములపై నాధారపడియే బ్రిటీషువారు యిండియా దేశస్థులకు పెద్దమొత్తములను, ఋణములనుపేర నంటగట్టిరి. ఈ 'ఋణముల' స్వభావ మునుగూర్చి మేజరు వినగేటు తన 'A Few words on our Financial Relations with India.' యను గ్రంథములో వ్రాసియున్నాడు. ఈకరపత్రము మొదట 1859 లో ప్రచురింపబడి, తిరిగి 1926 లో, అలహాబాదులో ప్రచురింపబడెను.) అందులో యిండియా జయింపబడినట్టి సామంతరాజ్యముగాననే యింగ్లాండుకు కప్పము చెల్లించు చున్నదని వ్రాయుచు,

''కప్పమనిన, జయింపబడిన దేశము, తన్ను జయిం చిన దేశమున కొసంగుద్రవ్యము. సామంతరాజ్యముయొ క్క ఆదాయములోని, కొంతభాగమును ప్రతిఫలరహిత ముగా, సామ్రాజ్యమున కిచ్చుటయే దీని విధానము. దీనికి ఫలితముగా, ఒకదేశము నిర్భాగ్యమైపోవుచుండ,

* లైటన్ వ్రాసిన మనుష్యమానసికశాస్త్రము పేజ 151. Anthropology.

మరియొక దేశము ధనవంతమగుచుండును. ఈపై పరిస్థితు లెచ్చటనుండునో, యచ్చట సాలీనా యిట్టి ప్రతిఫలశూన్యద్రవ్యము, (కప్పమనబడవలెను లేక మరియొకపేర పిలువబడవలెను) విధింపబడుచునేయున్నది. ఆంగ్లేయులకు, 'జయింపబడిన యిండియానుండి కప్పము' యనుమాటలు శ్రవణకటువుగాను, దౌర్జన్యముగాను యుండును. అందుచేతనే యీాకఠినపదములను బహుజాగ్రతగా (యిందులో తెలివితేటలేవీ యవసరములేదు లెండి) 'హోము ఛార్జస్ ఆఫ్ ది యిండియన్ గవర్న మెంటు' యను మృదుపదరచనలలో యిమిడ్చి, బ్రిటీషువారికి శ్రవణానందముగొల్పిరి.''

''1834-35 మొదలుకొని 1850-51 వరకుగల పదునేడుసంవత్సరములలోనూ 'హోము ఛార్జస్' పేరుజెప్పి యింగ్లాండు, యిండియానుండి లాగినద్రవ్యము యించుమించుగా 5,76,00,159 పౌను లుండునని, 1852 లో పార్లమెంటులో దాఖలుజేయబడిన, యొకానొక 'రిటరన్' నుబట్టి తేలుచున్నది. ఈమొత్తములో కేవలమూ 60,00,000 పౌనులకుమాత్రము యిచ్చటినుండి మందుగుండు మొదలయిన సామానులు పంపబడినట్లు కనబడుచున్నది. ఇదియును, మరికొన్ని అనామతు చిల్లరలును దప్ప, యీాయపారద్రవ్యమునకు ప్రతిఫల మెంతమాత్రమును, యిండియాకు ముట్టియుండలేదు. ఈద్రవ్యమంత

ము 'హోము గవర్నమెంటు', 'యీస్టిండియా స్టాక్', బాండు' ఋణములపై డివిడెండునిచ్చుటకును; యిండియన్ మిలిటరీ, మెరైన్, సివిల్ సర్వీసులతాలూకు యూరోప్యనుద్యోగులకు పెన్షనులు, సెలవులపై జీతములు యిచ్చుటకును; యిండియాలో నుంచబడిన యూంగ్లరాణీ పటాలములకు జీతములనిచ్చుటకును; ప్రతిఫలరహితములైన యిట్టి యితరఖర్చులు చేయుటకును వ్యయమగుచున్నది. యివన్నియయూ ఆలోచించినచో, యీధనమంతయు బ్రిటీషువారి స్వలాభమునకై ఖర్చుపెట్టబడుచున్నదని, నిష్పక్షపాతబుద్ధితో చూచువారికి స్ఫురించకపోదు. ఏయిండియనులనుండి పన్నులమూలముగా, యీద్రవ్యమంతయు పిండబడినదో, ఆహిందూదేశీయుల యభివృద్ధికై యిందులో నొకపెన్నియయినను ఖర్చుపెట్టియుండలేదు. హిందూదేశపు రాబడినుండి, మనదేశపురాబడికి, యీమొత్తమంతయు చేర్చబడినది; నిర్మొగమాటముగా మాట్లాడునో దీనిని కప్పము తీసికొనుటయే యని చెప్పవలెను. ఈ పద్ధతి హిందూదేశముయొక్క భాగ్యములో నొకభాగమును, గ్రేటుబ్రిటనుకుచేర్చి, ఆమొత్తముయొక్క పరిమితికి బ్రిటనును భాగ్యవంతముగాను, యిండియాను దరిద్రవంతముగాను చేయునదిగాయున్నది. ఈఖర్చులన్నియు, యిండియాపరిపాలనతో సంబంధించియున్నవను కారణము

చేతనే వీటి యార్థికప్రయోజనము కొరతపడజాలదు. హిందూదేశపు రివెన్యూగాబడి గ్రేటుబ్రిటన్‌యొక్క పారిశ్రామికాభ్యున్నతికై, పరోక్షముగా ఖర్చుచేయబడు చున్నదనుటను, యీకారణములు బలహీనపరచజాలవు. ఏదియెట్లున్నను, యీయపారధనము, బ్రిటీషువారి యాధిక్యత నిండియాలో స్థిరపరచుటకై యే యుపయోగపడు చున్నది"

"1852 కు పూర్వము యిండియానుండి దోచిన ధనముయొక్క మొత్తము, యిదివరలో చెప్పిన 'హోము ఛార్జీలు' 5,00,00,000 పౌనులు మాత్రమేగాదు. అనేక మంది బ్రిటీషు ఉద్యోగులు, వర్తకులు, తమకుటుంబముల పోషణపేరుచెప్పి, యిచ్చటికపారధనప్రవాహమును పంపి యున్నారు. అచ్చటినుండి యుద్యోగమును విరమించి, స్వగృహాభిముఖులగువారు తమయపారసంపదల నిచ్చటికి కొనిపోదలచిన దారిఖర్చులక్రిందనే లెక్కించరానిమొత్తములను పంపియుండిరి."

"హిందూదేశములోనే కూర్చబడిన యిండియా ఋణము 6,00,00,000 పౌనులలోను సుమారు 3½ కోట్ల పౌనులవరకును యాంగ్లేయులనుండియే గైకొనబడినదై యున్నది. ఈబ్రిటీషువారి ధనమంతయు, వీరు యిండియాతోడి సంబంధముగలవారగుటచేతనే సంపాదించినది. ఈ

ధనమునే యిండియాప్రభుత్వమునకు ఋణముగా నిచ్చుట చే, యిదియంతయు బ్రిటీషుజాతికి, ఆస్తిగానే చేర్చ బడినది. ఈమొత్తముతోడుగా, యాంగ్లేయులు యిండి యాలో పెట్టుబడిపెట్టినధనమును, బ్యాంకులలో నిలువ జేసినధనమునుగూడ మనకు జాతీయాదాయమైయున్నది. ఇదియంతయు, యిండియా బ్రిటీషువారితోడి సంబంధము వలన గోల్పోయినదేగదా !"

ఇవన్నియును సిపాయీల విప్లవాత్పూర్వపుపరిస్థి తులు. విప్లవానంతరము, యిండియాను బాగుగా శిక్షిం చుటకై, యీ 'కప్పమును' బాగుగా వృద్ధిబొందించిరి. ఇండియాయొక్క కోశము, దీనిని చెల్లించలేనిస్థితిలోనుం డుటచే, ప్రతివత్సరమును, ఋణములలో మునిగిపోవుచు వచ్చెను. ఈఋణములపై భరింపరానివడ్డీలు, యిండి యాను శాశ్వతముగా ఆర్థికదాస్యములో ముంచివైచెను.

## ౧౨. రాణీ ప్రకటన

హిందూదేశ పరిపాలనాబాధ్యతను వహించునప్పుడు, విక్టోరియా చక్రవర్తిని, యీప్రకటనను జేయవలసిన యవసరకారణములను గురించి, యీగ్రంథకర్తచే వ్రాయబడిన 'Rise of the Christian Power in India' యను గ్రంథములో 5 వాల్యూము 414 పేజీ చూచినవారికి తెలియగలదు. అమాయికులగు హిందువులు, రాణీగారి ప్రకటనయే తమకు దాస్యవిముక్తి జేయు స్వాతంత్ర్యదానపత్రమని నమ్మిరి. జరిగిన వాస్తవమేమన, యీప్రకటనలోని తియ్యనిమాటలకు వారు సమ్మోహితులై పోయిరి. ఇది బ్రిటీషుప్రభుత్వము యిండియాలో స్థిరముగానుండుటకు చాలతోడ్పడినది. సుప్రసిద్ధచరిత్రకారుడగు 'ఫ్రీమేన్' యిటువంటి 'రాజప్రకటనల' ను గురించి చెప్పినదానిని, యిండియను లెరుగరు, పాపము! "మనస్ఫూర్తిగా కోరుకొనియే, మన మీయసత్యవాగ్భూమిలోనికి వచ్చియున్నాము." దీనినిబట్టి విక్టోరియా రాణి, యిండియాప్రజలను వంచింపసమకట్టినదని నుడువజాలము. ఆమె మనస్ఫూర్తిగా, నిష్కల్మషహృదయముతోనే, యీప్రకటనను గావించియుండవచ్చును. కాని యనేకమంది బ్రిటిషురాజ

సితివేత్తలును, రాజ్యతంత్రజ్ఞులును, యీప్రకటనకు కూడ ఫ్రీమేన్ రాజప్రకటనలకు సాధారణముగా యెంతవిలువ నిచ్చియున్నాడో, యంతకన్న నెక్కుడు విలువనిచ్చి యుండలేదు. ఉదాహరణగా కావలసిన 'మార్క్వెస్ ఆఫ్ శాలిస్ బరి' చెప్పినదే తార్కాణ. 'ఇంగ్లాండు, యిండియాకు చేసిన వాగ్దానములన్నియు రాజ్యతంత్రము నందలి కూటనీతులు" అనియే.

వెనుకనొకప్పుడు యిండియా గవర్నమెంటునకు లా మెంబరుగానుండిన 'సర్ జేమ్సు ఫిట్జ్ జేమ్సు స్టీఫెన్ కె. సి. ఎస్. ఐ; డి. సి ఎల్' యిట్లు నుడివియున్నాడు. ఈవ్రాతను వ్రాయునప్పుడాతడు తన్నుదా తెలిసికొనే స్థితిలోనే యుండియుండవలెనని యూహించుట కవకాశములు గలవు.

"ఏదియెట్లున్నను, యీప్రకటనకు చట్టబద్ధమగు అర్థములేదు. పార్లమెంటు ఆక్టుకుకూడ, అందులోని మాటలలో యిమిడియుండుదానికన్న యెక్కువ యర్థాధికారములులేవు. ఈపార్లమెంటు ఆక్టు, యిండియా లెజిస్లేటివు కౌన్సిలుకు, చట్టబద్ధమైన యధికారపరిమితినిదాటి విధింపబడిన నియమముల నతిక్రమించి, యెక్కువ యధికారము నీయజాలదు. ఈవిషయమును గురించి యనేక తప్పభిప్రాయములు వ్యాపించియున్నవి. ఇండియా గవర్న

హిందూదేశము:

మెంటు ఆక్టుచే, యీప్రకటనకు న్యాయనిర్ణీతమైన హక్కు గలుగజేయబడినదను వాదన నిరాధారమైనది. ఆ ఆక్టులో యేప్రకటననుగూర్చియైనను ఒక్కసారిమాత్రమే 73-వ సెక్షనులో వ్రాయబడియున్నది. "ఈ ఆక్టు చేరినతర్వాత వీలయినంతత్వరలోనే గవర్నరు జనరలుచేత వివిధరాష్ట్రములలోను, గవర్నమెంటులలోను ప్రకటన గావింపబడవలెను" అనియే. తదనుగుణ్యముగానే 1858 నవంబరు 1-వ తేదీని యీయాక్టునుగూర్చి వివిధప్రాంతములలో ప్రకటించినంతనే, యిది యమలులోనికి వచ్చియున్నది. ఒక్కమాట- ప్రకటనలోని సంస్థానాధీశుల హక్కులతో సంబంధించినట్టియు, యిండియా ఫారెన్ ఆఫీసునకును, యీస్వదేశప్రభువులకును సంబంధించినట్టియు, భాగములకు మాత్రమే న్యాయబద్ధమైన యధికారముగలదు. అంతియేకాని మిగిలినభాగములలో లేటికిని చట్టబద్ధమైన విలువలేదు. ప్రకటనకు మూడుసంవత్సరములు తర్వాత, 1861 లో చట్టముగా జేయబడిన యిండియన్ కౌన్సిలు ఆక్టువల్ల, యిండియా లెజిస్లేటివు కౌన్సిలునకీయబడిన యధికారములలో దేనినికూడ యీప్రకటన సంకుచితపరుపదు, పరుపజాలదు. ఈప్రకటన కేవలమూ ఆచారముమాత్రమేమైయున్నది. మరియొక్కదృష్ట్యా దీనికి విలువనెంచజాలము. రాజకీయదృష్టిలో, యిది కేవలమూ అభి

ప్రాయమును, సంకల్పమును మాత్రమే. ప్రకటనలో లేని
యభిప్రాయములకు, సంకల్పములకు నెంతవిలువగలదో
ప్రకటనలోని వీటికిని యంతియ విలువగలదు. నాయభి
ప్రాయములో, యిట్టి విశాలతత్వముగల అస్పష్టప్రకటన
లకు, యెంతమాత్రమును విలువనుంచరాదనియే. వీటిలో
న్యాయచట్టనిర్ణీతమైన హక్కు లెంతమాత్రమును లేవని
యే. విషయనిర్ణయమున కివి యెంతమాత్రమును ఆధార
భూతములు గాజాలవు. కర్తలచే కేవలమూ ఘనతకొరకై
గంభీరముగా చెప్పబడిన మాటలపొందికమాత్రమే.'' *

ఘనతవహించిన రాణీగారి ప్రకటనలను గురించి,
యింతకంటె యెక్కువగా వ్యాఖ్యానమొనరించి, యనవ
సరప్రాముఖ్యమొసంగు టసమంజసము.

* 'Letters on the Ilbert Bill'-Times పత్రికనుండి
పునర్ముద్రితము. మేక్మిలన్ అండు కో 1883, పేజి 39-40. లండను.

# ౧౩. పంజాబీలను భయపెట్టి పందలను జేయుట

ఇండియాలోని, యేయితరప్రదేశమునుకన్న, పంజాబు నాక్రమించుటలోనే యీస్టు యిండియా కంపెనీ వారు యెక్కువగా 'క్రైస్తవ' పద్ధతుల నుపయోగించి యున్నారు. ఈకారణమువలననే పంచనదీ దేశప్రజలును, సర్దారులును విచిత్రమగు 'క్రైస్తవ' ఆదరణనుబడసిరి. ఈవిషయములో వివరములు 'Rise of the Christian Powes in India' 5 వాల్యూము 377-79 పేజీలు చదువుచో బడయగలరు. అందువలననే పాంచాలమును: మాదిరి క్రైస్తవ పరగణాగమార్చుటకు ఘనయత్నములు సలుపబడినవి.

పంజాబు సహాయమే లేనిచో, 1857 లో యింగ్లాండు, యిండియా సామ్రాజ్యమును కోల్పోయి యుండెడిదని, ప్రభుత్వ రికార్డులలోనే వ్రాసియున్నారు. పాంచాలురు చూపిన రాజభక్తికి తగు బహూకృతులివ్వవలయునుగదా! హైందవ సిపాయీలను కూర్చుకొనుటకు, పంజాబునే ముఖ్యస్థానముగా జేసికొనియుండిరి. సిపా

యీకాల విప్లవానంతరమునుండియు, యీపంజాబీయులను 'ఫిరంగిసైన్యము' లలో పనిచేయునర్హతను తొలగించుట లో, పాంచాలకేసరులకు యుక్తబహూకృతి కాలేదా ? పంజాబీయులతి రాజభక్తిగలవారగుటను, "అతి సర్వత్ర వర్జయేత్తను" నార్యోక్తిని పాటించిరో యన్నట్లు, యీయతిభక్తిపరులను పాలించుటకు, బహుకఠినశాసనములను నిర్మించి, వారి నణచియుంచిన యీస్టు యిండియా కంపెనీవారి కృతజ్ఞతాబుద్ధి నేమనవలయునో తెలియకున్నది !

పంజాబులో విప్లవప్రారంభమునుండి, విప్లవానంతరము కొంతకాలమువరకును, క్రైస్తవమతావలంబులైన సర్ జాన్ లారెన్సు, సర్ రాబర్టు మాంటుగోమరీ, మొదలగు బాధ్యతగల యుద్యోగులుకూడ బహుక్రూరములు, అమానుషములునగు సంఘహత్యల నొనరించినది, తమకు ప్రభుత్వప్రోత్సాహము వెనుకనుండబట్టియేగదా ! ఈస్టు యిండియా కంపెనీవారి స్వర్గీయప్రభుత్వములోని, పవిత్రహృదయుడగు నుద్యోగి, ఫ్రెడరిక్ కూపర్, తన 'The Crisis in the Punjab' యను గ్రంథములో యిట్లు వ్రాయుట కెంతమాత్రమును సిగ్గునుబొందలేదు.

"హిందూస్థానములోని, యీభయంకర ఘటనలకు, ఉత్పాతములకు సూచన, ఉద్యోగులయందలి యవి

శ్వాసము, రాజద్రోహచింతనయునై యున్నది. న్యాయ విచారణసమయములలో యొగతాళిచేయబడి, తమక్రింద యుద్యోగులవల్లనే, దేశీయసేవకులవల్లనే, యతిసాహస ముగా హత్యచేయబడిన జడ్జీలను, కలక్టరులనుగూర్చి చదివియున్నాము. సాధారణముగా యీసాహసులు మహమ్మదీయులై యున్నారు. పాంచాలములో ప్రజలు, రాజభక్తిపరులుగానే యున్నారు. కాని యిచ్చటకూడ మాంటుగోమరీ యాజ్జిల్లపై శిక్కు బేటిలియన్ సుబేదారు నొకనిని, ప్రభుత్వవిధులను సక్రమముగా నెరవేర్చలేదను నెపముపై నురితీయవలసివచ్చినది. అట్లే యుశ్వారోహు లగు పోలీసుల రసూలుదారు నొకనిని, జైలుదరోగా నొకనినికూడ బహిరంగముగా నురితీసిరి. ఈప్రాంతముల మోటు, యనాగరకప్రజలలో ప్రభుత్వమునెడల భయ భక్తులుగలుగజేయుట కిట్టి బహిరంగ కఠినశిక్షలు నిర్వ హించుటకు పంజాబులోని ప్రభుత్వోద్యోగు లెంతమా త్రమును వెనుదీయరని, యిందువలనగూడ, పాంచాలు రకు బోధపడగలదు. ప్రజలనుండి నిర్మలమైన, దృఢమైన, స్పష్టమైన రాజభక్తిని మినహాగా, యీప్రభుత్వము, దేనిని సహింపదని ప్రజలు గ్రహింతురు. ఈమనప్రభుత్వము ప్రజలనీతిబాహ్యప్రవర్తనమును చూచియు చూడనట్లూ రుకోనజాలదు. పంజాబీయుల మనస్సులను భయపూరిత

ము లోనర్పుటకు యిచ్చుటి యధికారులెంతయు ముందం
జవేసియున్నారు.'' *

జాన్ మాల్ కామ్ లడ్లో, యీగ్రంథభాగమును
గూర్చి విమర్శించుచు, తన 'Thoughts on the Policy
of the Crown towards India' యను గ్రంథములో
యిట్లు వ్రాసియున్నాడు. (ఈగ్రంథము అలహాబాదులో
పునర్ముద్రణమొందియున్నది. పేజీ 180-181.)

"ఫ్రెడరిక్ కూపరు, తోటిమానవులలో నుమా
రయిదువందలమందిని కసాయివానివలె వధించిగాని,
యూపిరాడనీయక చంపిగాని, సిగ్గుపడుటలేదు. అంతియ
గాక యీ క్రైస్తవుడు తనఘనకార్యమునుగూర్చి 'దేవ
పితృకర్మలందలి బలిసమర్పణ' ను గురించివలె, నీచమైన
గర్వముతో ప్రగల్భములు పలుకుచున్నాడు. మానవుని
శిక్షించుటలో న్యాయదయాగుణముల నతిక్రమించి, క్ష
మాశీలుడును, సర్వకారుణికుడును యగు పరమేశ్వరునికిని
హృదయముగల సర్వమానవులకును, మహాద్రోహియగు
యీమానవ కులకళంకుడు, తనకార్యమందలి నైచ్యమును
గుర్తించి, తలవంచుకొనునట్లు చేయవలసినబాధ్యత యం
దరకును గలదని విన్నవించుచున్నాను. చక్రవర్తి మొదలు

* The Crisis in the Punjab పేజీలు 151-152.

కూలిపానివరకునగల ప్రతిమానవుడును, యీపనిలో పాల్గొనవలసినది విధియైయున్నది.'' *

"దయాదాక్షిణ్యములు చూపుచుండ వలసినదని కాగితములలో వ్రాసిన చాలదు. కూపరువంటివారు,

---

* కూపరు గ్రంథమగు 'The crisis in the Punjab' లో 152-171 పేజీలు చూచినచో యీ భీభత్సకథనము గాంచవగును. ఈతడు వ్రాసిన మనుష్యులు నిరాయుధులు గావింపబడిన దేశీయుపటాలమునకు జెందినవారు వారొక వేళ తిరుగుబాటు చేసియున్ననో, అది కేవలమూ ఆత్మరక్షణకొరకే యయి యుండును. వారు ప్రాణరక్షణకొరకై పరుగిడుచు పరిశ్రాంతులై దయాభిక్షను, శరణును కోరుచుండిరి వారు తమ్ము పట్టుకొన్నవారికన్న యత్యధిక సంఖ్యాకులు. సుశిక్షితులు వారికి దయ చూపబడునని నమ్మకము తోచునట్లు నటించి, వారి నందరిని తమవలలోనికి ఆకర్షించుటలో, యీ పైశాచికహృదయుడు, మిగుల ద్రోహి యయ్యెను. తర్వాత యురిదీయుటకు తీసికొనిపోవుటలో, పాపము కొందరు 'సాహిబ్' కు యాంత్రికవందనము చేయనిమ్మని కోరిరట! శిఖు తలవరులలో నొకడు 150 మందిని కాల్చినప్పటికి, స్మృతి తప్పి పడిపోయెను. 45 గురిని, యూపిరాడనీయక చంపి, యీ ఘనకార్యమును 'బ్లాక్ హోలు ఆఫ్ కలకత్తా' కు ప్రతిక్రియ యనుచు, తృప్తి వహించిన, హృదయవిహీనుడు. ఈ మానవకళేబరములను దాపుననున్న నూతిలోనికి త్రోసివైచి, కాన్పూరునూతికి ప్రతియనుచు నుడివిన, పిశాచహృదయుడు. సర్ జాన్ లారెన్సు, మాంటుగోమరీలు, తొందరపడి యీశిక్షలకు ఆజ్ఞనిచ్చితిమని తప్పుకొన చూచినంతమాత్రమున, వారి బాధ్యత తప్పిపోజాలదు. 'Thoughts on the Policy of the Crown towards India' లో జాన్ మాల్కామ్ లడ్లో వ్రాసినది.

వాటిని దుర్వినియోగపరచి, యవమానపరచుటకు సమ
ర్థులు. చక్రవర్తిని పరిపాలన గాని, 'కూపరిజమ్' గాని
రెండిటిలో నేదో యొకటియే, యీ లోకములో నుండ
గలదు గాని, యేకదేశములో యేకకాలమున, రెండింటి
కిని స్థాన ముండజాలదు. రెండవదానిని సమర్థించువారు
రాణికి భక్తులు గాజాలరు.''

కాని మాంటుగోమరీ యీ యాజ్ఞను తొందరపడి
యిచ్చియుండలేదు. వాస్తవము చెప్పవలసి వచ్చునో
నాత డతిసాహసముతోనే యీ యాజ్ఞ నిచ్చియుండెను.
థర్లో తన 'India under the Company and the
Crown' యను గ్రంథములో యిట్లు వ్రాసియున్నాడు.
(అలహాబాదులో తిరిగి ముద్రించబడియున్నది 82-83
పేజీలు.)

''దైవనిర్ణయమున యీ కార్యములన్నియు ఉల్లాస
కరప్రకృతిగల సమున్నతశరీరునిచేతనే జరిగియున్నవి.
ఈతని వినీతస్వరూపము చూచినతోడనే అందరకు తెలిసి
యున్న యీతని పరమకఠినస్వభావము నమ్మదగినదిగా
కాన్పించదు. ఈతడు పవిత్రమతకర్మలన్నిటికిని హాజరగు
ను; బిగ్గరగా పురోహితుని మతశ్లోకములకు ప్రతిగాన
మొనరించును; మతవ్యాప్తికై జరుగు మిషనరీల పనులన్ని
టిలోను శ్రద్ధవహించును; కాని యీ కార్యము లేవియును,

యాతడు మరణశిక్షను విధింపకుండను, అథవా దయచూపనుగాని, యీతని యనుచరులు యుక్రొత్తాటిని స్వేచ్ఛగా నుపయోగించుటనుగాని కొంచెమైనను శ్లాఘింపకుండ నుంచజాలకపోయెను. ఈమతావేశపరునియందలి యీ గర్హనీయ, అమానుషత్వము, గ్రంథకర్తల సునిశిత, నిష్పక్షపాతవిమర్శనల కిదివరకే గురియైనది. ఈ సర్ రాబర్టు మాంటుగొమరీనిగూర్చి, కూర్టిన్ మహాశయుడు, తన 'Progress and Present state of British India' యను గ్రంథములో వ్రాసియున్నాడు. అందులో లెప్టినెంటు గవర్నరు మాంటుగొమరీ తన 'తలారి కమీషనరు' కూపరు నభివందించుచు, లాహోరునుండి ఆదివారము 9 గంటలకు వ్రాసిన ఉత్తరము నొకదాని నుదాహరించెను. కూపర్, 20-వ దేశీయపదాతి పటాలమును, కేవలము సంశయాస్పదమైన ప్రవర్తనగలిగియున్నారను యనుమానముపై యిహలోకమునుండి తుడిచివైచి నందుల కభినందించుటయేగాక, ఆజాబులోనే యీసత్కృత్యము, తనవద్ద మరియీమూడుపటాలములు కదలికగలిగియున్నవనియు, తానవి యెదురుతిరుగుటనే వాంఛించుచుంటిననియు, యిట్లున్నచో యవి చాలరోతగానున్నవనియు, యెదురుతిరిగినచో వాటిలో ఒక్కనినైన బ్రతికిపోనీయననియు వ్రాసియుండెను. క్రైస్తవమతవ్యాప్తికై పరితపిం

చెడి ఒకానొకవ్యక్తికి, వేయిమందిమానవుల మరణ మెట్లు యభినందింపదగియుండెనో, మరి మూడువేలమం దిని తుడిచివేయుటకు తగునెపమునకై వేచియుండుట యెట్లుపొసగెనో, సరిపెట్టుట సాధ్యముకాలేదు. కాని దేశమును జయించుటలో కృతార్థతపొందిన యూరోపి యనులు, మతబోధకులుగా అపజయముగాంచుటకు కారణమును తెలిసికొనగలిగితిమి. మాంటుగొమరీ, తన కితరులిచ్చిన యధికారములను పూర్తిగా జరుపగలిగినంత వరకు యమముజరుపుటచేతనే పాలించెను. మానవుల యొక్క యిష్టానిష్టముల నాతడు పాటించలేదు. మూడవ నెపోలియన్ కనిపెట్టిన వోటుపద్ధతిని, ప్రవేశపెట్టియున్న చో, యీతని పరిపాలన యెన్నడో యంతరించియుండు ను. పాంచాలములో యీతడు, తనవ్యక్తిగౌరవమువలన గాదు, అధికారము వహించియున్నడు. తనస్వాధీనమం దున్న ఫిరంగుల బలమువలననే, పాంచాలమునం దీతని నిరంకుశాధికారము సాగియుండెను. ఈతనివంటి పురుషులు అల్లరి, విప్లవము, యుద్ధము, వీటితో కల్లోలముగానున్న పుడే ప్రకాశించెదరుగాని, శాంతిసమయములలో, దేశము సుభిక్షముగానున్నపుడు యెందుకూ పనికిరారని తెలుప వలసివచ్చుచున్నది.”

పంజాబులోని సివిలియనుల తరెక్షీదు యిటువంటిదై

యుండెను. వారిమనఃప్రవృత్తి యెట్లున్నదియు, మనకు యిటీవల 'జలియన్ వాలాబాగ్' లోని దారుణ, అమానుషహత్యాకాండలు వెల్లడిజేసియేయున్నవి. *

---

* పంజాబులో నివసించుసామాన్యక్రైస్తవులను బ్రిటీషువారి గొప్పయుద్దేశ్యములు, మనోవృత్తి, యిండియన్‌లను గురించి. యానని యభిప్రాయములను. లాహోరు సివిలు అండ్ మిలిటరీ గెజిట్, 1906 సెప్టెంబరు 5-వ తేదిని ప్రచురింపబడినదానిలో, 'శగలేరియన్' యను పేరిట ప్రచురింపబడిన జాబునుబట్టి తెలిసికొనగలము.

"నేనెంతమాత్రమును కంగారుపడకుండ శాంతముగాను, వివేకముతోను యీవిషయమును గురించి ఆలోచించియున్నాను. 'స్వాధీనజాతి' యందు ప్రబలుచున్న రాజద్రోహము, అగౌరవను, పొగరుబోతుతనము, అధిక్రసంగిత్వమును మనకందరకును నిత్యమును అనుభూతములగుచునేయున్నవి. 'పరాధీనజాతి' యను మాటలలోని సంపూర్ణార్థమును గ్రహించుడు. హైందవులు గొప్పయున్నతవంశీకులుగాని, గొంతధనవంతులుగాని, విద్యావంతులుగాని, గొప్పయుద్యోగములలో నుండినవారు, విజేతలు. బ్రిటీషు శక్తము వారినిజయించియున్నది, పాలించుచున్నది. బ్రిటీషువారికిని, యిండియన్‌లకును, యెల్లకాలము లందును, ప్రతివోటును భేదము చూపబడవలెను. ఇండియన్‌లకంటె, బ్రిటీషువారధిక గౌరవార్హులు'

ఈభాగములను తన 'India and the Future' యను గ్రంధములో నుదాహరించెను. 'విలియమ్ ఆర్చర్' (113-114 పేజీలు) యిందుండియే మరిరెండుమాటల నుదాహరించెదను

"మనము వారిని ప్రభుత్వశాఖలలోనికి మనతో భాగస్వాములుగాకాదు చేర్చుకొనినది, కేవలము సేవకులనుగా మాత్రమే

విప్లవ వ్యాజమున ఢిల్లీప్రజలపై ప్రతిక్రియ చేయ దలచి, నిరుపద్రవులును, అనాయుధులును, నిర్దోషులు నగు ప్రజల ననేకులను, ప్రభుత్వాధికారులు క్రూరకృత్య

---

చేర్చుకొంటిమని యీబాబూలందరును తెలిసికొందురు గాక. మన సోపియాపలుకు వల్లవారితో భాగస్వామిత్వము గొనుటకెట్టిదైనను యుండనకతప్పనిచో అట్టిదైనను పాలకజాతులతో నేగాని పాలితజాతులతో మాత్రము గారాదు.”

“తిరిగి సవిమర్శదృష్టితో జూచు యింగ్లాండు ప్రజ లీనాటికే యీవిషయము నవగాహన జేసికొని యుందురు. నాచాలులై, అనక తవకమాటలు కూయుచుండు, బి. యే. ల సొగ్గమెంటుకన్న, మహా రాజా ఆఫ్ బికనీరుయొక్క ఆలోచనాసమితియందలి యాగపెజను మంచి బుద్ధిమంతులే విలువయుంచదగినవారనుటను ”

ఇంకను, ‘యిండియాలో యేబదివత్సరములు’ అను బాబులో “స్వదేశీజము క్రమముగా రౌడీయిజముగామారి, రాజద్రోహమును, తెల్లజాతులయందలి ద్వేషమును, వెలిగించినపుడు నేను చెప్పిన దేమన, ‘చెబుకు’ ‘కొరడా’ యనియే.”

అందుచేతనే ‘విలియమ్ ఆర్చర్’ తనగ్రంథములో యిట్లు వ్రాసి, దనన్యాయాపరత్వమును వెల్లడించియున్నాడు

“మనకు యిండియాపై నధికారము, మనలోనున్న చాలనా శక్తినలనగాక శ్వేతలమూ యింగ్లాండులోని ప్రతితెల్లచర్మముగల కూలి పిల్లవానికిని భగవద్దత్తముగా నిరంకుశపాలనకు తగుతెలివితేటలున్న వనియును, యిండియాను పాలించుటకు మనము స్వర్గమునుండి శాశ్వతసన్నదును పొందియున్నామని తలంచువారి నిరాధారపు టూహలవల్లనే యిట్టి బుద్ధిమాలినమాటలు పలుకునంతటి తెగువకలిగి నదేగాని వేరుగాదు.”

ముల కెరజేసిరి. పంజాబు సరిహద్దు పాంచాలప్రభుత్వా ధీనమున నున్నంతకాలము 'ఫ్రాంటీర్ లా' అమలులో నుంచబడెను. పెద్దనేరము లన్నింటికిని, ఉరిశిక్షను గాని ద్వీపాంతరవాసశిక్షను గాని విధించుటచేతను గూడ ప్రభుత్వాధికారులు తృప్తినొందెడివారు కారు

ఈ కార్యకారణములను బట్టిచూచినచో పంజాబీయులలో భీభత్సము కలుగజేయుటమూలమున కై స్వప్రభుత్వమును, హిందూదేశములో సుప్రతిష్ఠిత మొనరింప, నాంగ్లేయులు చూచిరని విస్పష్టము గాకపోదు.

పంజాబును రాజభక్తి గలిగియుండునట్లొనరింప వలయును గదా! కాన యచ్చటి విద్యావిధానమును కేవలమూ ప్రాచ్యపద్ధతులపై నడుపవలెను రాజనీతినిపుణులును, మిషనరీలు వగైరాలందరును యీ పద్ధతినే యామోదించిరి. పాంచాలములో ప్రాగ్దేశీయ సనాతన విద్యా, కళా, విశ్వవిద్యాలయమును నిర్మించుటకై తెల్లవారందరును, యేకకంఠముతో గోల చేసిరి. పాపము! వారి కీ ఆర్యుల సనాతనధర్మముపై నెంతపక్షపాతమో! వారి కీ కంఠశోష యెందులకో!

విప్లవకాలములో యూరోపియనులవల్ల మిక్కిలి బాధచెందినవారు మహమ్మదీయులు. హిందువులకన్న మహమ్మదీయులే యెక్కువగా యురి తీయబడిరి, ఫిరం

సులవాత బడిరి, చిత్రవధ చేయబడిరి, మానభంగ మొ నరింపబడిరి. అందువల్లనే నడపటి ఫిల్లిచర్ వర్డి యిట్లు వ్రాసియున్నాడు:

'లక్షలకొలదిగా అమాయికప్రజలు విచారణ లే కుండగనే ఉరి తీయబడిరి.'

'లాఖోల్ బిగనహ్గోన్ కో దియా ఫాంసి.'

కాని ప్రస్తుతము మహమ్మదీయులె ప్రభుత్వమునకు ప్రియతములై యున్నారు. అందుచే నీ 'ప్రియురాలికి' విప్లవసమయమున జరిగిన గౌరవమర్యాదల నీ శుభసమ యమున జ్ఞప్తికి తెచ్చుట మంచిది కాదు. పాపము, కొందరు ఆంగ్లగ్రంథకారు లీయుదంతములను కప్పియుంచి. అసత్య ప్రకటనల జేయుటకు, చాల శ్రమపడిరి. ప్రస్తు తము యిండియాలోని సుప్రసిద్ధ క్రైస్తవ దినపత్రిక 'పయొనీర్', విప్లవకాలములో కాన్పూరు, లక్నో పట్ట ణములు జయింపబడిన తర్వాత యమాయికులగు హిం దువు లనేకులు, విచారణ సల్పబడి, ఉరి తీయబడి రనుట యేగాక, మహమ్మదీయు లేగతికి బాల్పడిరో కప్పిపెట్ట బ్రయత్నించెను.

ఫ్రెడరిక్ కూపర్ వ్రాసిన గ్రంథప్రకరణమందలి మొదటి వాక్యము లీవరలో నిచ్చియున్నాము. అందు లోనే యీసదయు డీకథను గావించినాడు.

హింద్రూదేశము:

'మధ్యాహ్నమునకు వార్త వచ్చెను, జూలై 31 తేదీని, రావినది యెడమయొడ్డుననుండి పోవుచుండగా, తహసీల్దారు కొందరుపోలీసులతోను, గ్రామస్థులతోను వెళ్ళి, స్టేషనుకు 3½ రుపడియారు మైళ్ళ దూరములోనున్న ఘట్టములో వారిని, తలవనితలంపుగా యెదిరించినట్లు. ఈ మూకను వెంబడించుటకై తగు యేర్పాట్లు చేయబడెను.

సాయంకాలము నాలుగు గంటలకు యెనుబది, తొంబదిమంది గుర్రపుస్వారులతో కూడ డిస్ట్రిక్టు ఆఫీసరు అచ్చటికి చేరెను. పెద్ద దొమ్మి జరిగిన యానవాళ్లు స్పష్టముగా కాన్పించుచుండెను. నేల యంతయు రక్తమయము; వందలకొలది జనులపదసంఘట్టనమున చదిసినభూమి; విరిగిన నదీతీరము; యిటీవల కురిసిన వర్షములచే పొంగి ప్రవహించుచుండిన నదీప్రవాహము; యివన్నియు నచ్చట దొమ్మి జరిగినట్లు సాక్ష్య మిచ్చుచుండెను. విప్లవకారులను నదీతీరమున యెదిరించి, తుపాకులతో కాల్చి, వెనుకకు నదిలోనికి నెట్టివేయుటచే, 150 మంది నదిలో పడి మునిగిపోయిరి. పాపము, వారదివరకే నలుబది మైళ్లు ప్రాణభీతిచే పరుగిడి వచ్చి,' వరదలతో పొంగుచున్న నదిలో యీదజాలకపోయిరి. వీరిలో చాలమంది యెగువకు పరుగెత్తిపోయి, తెప్పలపై కొందరున, యీది కొందరును

తీరమునకు మైలుదూరములోనున్న లంకపై చేరిరి. అ
క్కడ చలిచే గజగజలాడుచు కూర్చున్న, యీసంఘము,
చూచుటకు అడవి బొమ్మలగుంపువలె నుండెను. వీరిని
పట్టుకొని, అర్హమైన శిక్షను విధింపవలసి యుండెను.

విద్రోహుల దురదృష్టమున కన్నియు అనుకూల
ముగానే యుండెను. దైవిక, మానుష, కాలీనములగు
సర్వకార్యములును వారికి వ్యతిరేకముగా యేర్పడుట
చేతనే వారిని తగుశిక్ష చేయుటకు వీలుగలిగెను. దినమం
తయు చాల చల్లగానుండెను. అమృతసరమునుండి ప్రయా
ణముచేసి వచ్చినది, చాల దూరమయ్యును గుర్రము
లేవియు చనిపోలేదు. అమృతసరముచటికి 26 మైళ్లుం
డెను. సూర్యుడపరాద్రిని చేరనుండెను. విద్రోహులు
నిరుత్సాహులై యుండిరి. బహుశః తమ్ముమెదుర్కొ
నవచ్చిన శత్రువుల సంఖ్యనుగురించి, వారు భ్రమపడి
యుందురు. వాస్తవముకన్న యధికులుగా నున్నారని
యూహించుటకు తగుపరిస్థితు లేర్పడియుండెను. ఇంతియ
గాక మధ్యాహ్నము గాఢముగా పోరాడిన తహసీలు
దారుడుకూడ గ్రామస్థులతో గూడి తీరముననే యుండి
యుండునని, వారు తలంచియుందురు. కాని గ్రామస్థు
లలో చాలమంది, పారిపోయిన విద్రోహులను వెంబడిం
చుటకై పోయియుండిరి. డిస్ట్రిక్టుఆఫీసరు ఊహాలు కడకు

హిందూదేశము:

యథార్థములే యయ్యెను.

రంగమున ఆసమయమున సాధుస్థితియందున్న పడవలు రెండు మాత్రమే యుండెను. పడవవాండ్రుకూడ నేర్పరులుగారు. పట్టుటకు బోవుచారిలో హిందూస్థానీయులు చాలమంది కాన్పించుచో కల్లోలమునకును, ప్రమాదమున పారిపోవుటకును విద్రోహుల కవకాశము గల్పింపవచ్చును. ముఖ్యసమస్య, వీరందరును యెదురొక్కసఖండ లొంగిపోయిననూ, పట్టుకొని, యీావలి తీరమునకు చేర్చుటెట్లనియే. రెండు మూడు పడవలకుగాని వీరందరిని, తీరమునకు జేర్చుటసంభవము. ఒకవేళ మొదటిసారి కొందరిని తీరమునకు పడవలో చేర్చుసమయమున, లంకమీాదివారు, గాపలాదారుల నెదిరించి తప్పించుకొని పోవచ్చును; లేదా మొదటిగుంపు తీరము చేరినతర్వాత, వారిని 'గుఱ్ఱముల కాపలాకై' ప్రత్యక్షముగా నియమించి, మిగిలినవారికై, లంకమీాదికి బోవుటకూడ, ప్రమాదకరముగావచ్చును. ఇదివరలో జరగియున్న పోరాటమునుబట్టి చూచిన, నిరాశచే సాహసికులైన, యీాసిపాయీాలు, సుకరముగా లొంగరని తలంపబడెను.

వెంటనే ముప్పదిమంది సోవారు లశ్వావతరణ మొనరించి, పడవలలో ప్రవేశించిరి. వీరిలో హిందూస్థా

నీయు లుండకుండునట్లును, వారందరును తీరమునసే యుం
డునట్లును జాగ్రత వహించితిమి. కొంత కష్టముపై
పడవలు రెండునుకూడ, లంకకు యిరువది నిమిషములలో
చేరుకొనెను. లంకయంతయు రెల్లుతో నిండి, భీభత్స
ముగా నుండెను. ప్రవాహము హెచ్చుచుండెను. పిద్రో
హులు నిరుత్సాహులు, నిరాహారులు. తిండిలేక, కప్పు
కొనుటకు పాడిబట్టలైనను లేక. చలికాచుకొనుటకు కట్టె
లులేక, అలసిపోయి, బహుశోచనీయస్థితిలో నుండిరి.
ఇవన్నియు యిట్లుండ తోడేళ్లగుంపువలె పైబడనున్న
శత్రువులు. శత్రువులేవేళ పైబడుదురో యని నిరీక్షిం
చుచు, ఆభయంకర ప్రదేశమున నుండుటయనిన గుండె
లు నీరగుచున్నవి. సూర్యుడు బంగరు కాంతితో గ్రుంక
నుండెను. పడవలనుండి యిరువది తుపాకులొకవంక బారు
పెట్టబడియుండెను. ఇవిగాక పిస్తోళ్లు రివాల్వరులు కూడ
గురిపెట్టబడి యుండెను. క్రమముగా పడవలు, లంకను
సమీపించుచుండెను. దురదృష్టవంతులగు నాసిపాయీలు
చేతులు జోడించి, పైకెత్తుకొని, దయాబిక్షను వేడుచు,
నీటిదరికి మెల్లగా మూగుకొనిరి. వారిలో నలుబది,
యేబదిమంద నిరీహులై, ప్రాణభయముచే నొక్కపెట్టున
నీటిలోనికి దుమికి, ప్రవాహవేగమున మునిగి, కొట్టు
కొని పోయిరి. వీరు కొంత దూరమున తలలను పైకెత్తి

రిగాని, నిర్దయమైరావీనదీ ప్రవాహము, వారి ననంతా వకాశములో లీనముచేసివైచెను.

ముప్పదిమంది 'సోవారులు' వెంటనే నీట దుమికి, చేతులలో సంకెలలను బట్టుకొని, లంకయొక్క దిగువభాగము నాక్రమించిరి. సంకెల లత్యంతోపయోగకరములని, యిదివరకే జాగ్రత చేయబడి యుండెను. ఈదిపోవుచున్న విద్రోహులను గురిచూచి, వీరు తుపాకుల నెత్తిరి. కాని వెంటనే 'కాల్చవ' ద్దని యాజ్ఞాపింపబడిరి. అకస్మాత్తుగాను, అనాలోచితముగాను యివ్వబడిన యీ యాజ్ఞ వలన పరిస్థితులు మారిపోయెను. విద్రోహుల సంక్షోభిత హృదయములలో నాశాతటిల్లత మెరసెను. వారికి పిచ్చినమ్మకము తోచెను; తమ్ము వెంటనే కాల్చివేయుటకై గాక, బందీలనుగా జేసి, విశ్రాంతి నిచ్చి, తర్వాత విచారణ చేసియే శిక్షించెదరను యూహతో, వారి కంఠ రకను జీవితాశ లంకరించెను. వెంటనే బేడీలతో నొక నిని గట్టునకు బంపిరి. ఆజానుబాహులు, సమున్నతదృఢ శరీరులు నగు, యిరువదియారుగురు సిపాయీలు, కేవల మొక్కనిచేతనే సంకెలలు వేయబడుటకై లొంగిపోయిరి. బానిసలను పడవేసినట్లుగా వీరందరి నొక ఖాళీపడవలో పడవైచితిమి. సుమారు నలుబదిమంది సాయుధులను లంకపైగా వుంచి, పడవలను తీరమునకు జేర్చి నిస్తేజమైన

మన వ్యక్తి కళేబరములను దించిరి. మొదటిగుంపు క్షేమము గా తీరమునకు చేర్చబడినతర్వాత, వారిని చూచి మిగిలిన వారు కిక్కురుమనకుండ లొంగిపోయిరి. గుంపు తర్వాత గుంపును తీరమునకు చేర్చినతర్వాత, ప్రత్యేకముగా నందరను, త్రాళ్ళతో కట్టి వేసితిమి.

వారి బిరుదులను, కంఠహారములను, అవమానప రచి త్రెంపి పారవైచితిమి. అప్పటికే కొందరు గ్రామస్థులు గుమిగూడిరి. ఈ గ్రామస్థులలో కొందరిని, కొందరు సిక్కు-స్వారులనూ గాపుంచి, యీ విద్రోహులను అప్పటి కారుమైళ్ళ దూరములోనున్న 'అజ్‌నాలా' స్టేషనుకు నడి పించితిమి. ఈలోపున 'హిందూస్థానీ' (geese) సోదరుల ను గొందరను, వారి మించినసంఖ్యగల 'టవానా' * సో దరులను కొందరను, పడవలలో లంకకు పంపితిమి. తరు వాతి గుంపుకూడ సురక్షితముగా తీరమునకు చేర్చబడెను; మధ్య నొకసారి విద్రోహుల నుంచిన పడవ, రక్షకసైని కుల పడవకు కొంతదూరములోనికి పోయినపుడు, వారిని తప్పించుటకు కుట్ర సలిపిరని భయపడితిమి. కాని కేకలు వైచి పిలిచి, తుపాకిగుండ్లవర్షము కురిపించెదమని భయ పెట్టినమీదట, ఆ పడవజనము కూడ జాగ్రతగా గట్టు నకు చేర్చబడిరి. తరువాత వీరినిగూడ యవమానపరచి

* వీరిని పహోబ్బారు పాంతములలో చేర్చిరి.

గౌరవచిహ్నలను, కంఠమాలలను త్రెంపి పారవైచి రె
క్కలు విరచికట్టివేసితిమి. ఏ క్షణమందైనను విద్రోహు
లెదిరించియుండిన నో, భయంకరపోరాటము జరిగియుండె
డిదే. కాని దైవనిర్ణీత మట్లు లేదు. వెంటాడించువారు
చేయు ప్రతికార్యమును, యదృష్టదేవత మేలుచూపులో నే
యుండెను. పాపము! విద్రోహులలో కొందరు, తమ
భార్యాపుత్రులును దయయుంచి రక్షింపవలసినదని ప్రా
ర్థయపడిరి.

అఖరు విద్రోహికూడ కడకు తీరమునకు జేర్చబ
డెను. వారిని మెల్లగా స్టేషనుకు బయలుదేరదీసితిమి.
రోడ్లన్నియు మోకాలులోతు నీటితోను, బురదతోను
నిండియుండి, యొక్కనినైనను తప్పించుకొని పోనీయకుం
డుటలో తోడ్పడెను. సుధాంశుడు, మేఘమాలికావి ని
ర్ముక్తుడై, విద్రోహులకు, తమ మృత్యుసన్నిధికి దారి
చూపుచున్నదో యనునట్లు ప్రకాశించుచు, కోట్లకొలది
గా క్రింది నీటిమడుగులలోను, కాలువలలోను ప్రతిఫలిం
చుచుండెను.

వీరందరిని సురక్షితముగా పోలీసుస్టేషనుకు చేర్చు
నప్పటికి అర్ధరాత్ర మయ్యెను. వర్షము తుంపురులుగా
పడుచుండెను. అందుచే వీరిని శిక్షించుట ప్రొద్దుటకు జ
రుపబడెను. రాత్రి మరియొకగుంపు విద్రోహులు కొని

కై ౧) స్త్వప్రభుత్వనిర్మాణాత్త్వము

రాబడిరి. వా రరువదియారుగు రుండిరి. స్టేషన నప్పటికే పూర్తిగా నిండియుండుటచే వీరినందరిని గుమ్మలమువంటి కొట్టులోనికి త్రోసి, మూసివైచితిమి.

అమృతసరమునుండి డిప్యూటీ కమీషనరు బయలుదేరుటకు పూర్వమే, పెద్ద పగ్గములను తెప్పించి, యుంచెను. విద్రోహులు స్వల్పసంఖ్యాకులైనచో, యురి తీయించుటకై (చెట్లాట్లే లేవు) యీ పగ్గములు చాలును. ఒకవేళ విద్రోహు లధికసంఖ్యాకు లగుచో, కాల్చివేయించుటకొరకై నూఱబదిమందిశిఖ్ఖులనుకూడ చేర్చియుంచెను. నదిపై పోరాటము జరుపవలసివచ్చుచో, వీరందులకుకూడ నుపయోగించుదురుగదా. ఈయేర్పాటు చేసియే, యాతడు వచ్చెను. విద్రోహులను నదినుండి స్టేషనుకు తీసికొని వచ్చుచున్నపుడే తొందరగావచ్చి, వారీతనిని మధ్యేమార్గముననే కలసికొనిరి. అమృతసరమునుండీ యిరువదిమూడుమైళ్ళు ప్రయాణముచేసి, వారురభసముగావచ్చి, తమ ఘనకార్యమును నెరవేర్చుటకై కమీషనరును కలసికొనిరి అప్పటికి శిక్షింపవలసిన విద్రోహులసంఖ్య 282 ఇందులో నన్నితరగతులవారును యుండిరి; పెద్దయుద్యోగులు మొదలు గుడారరక్షకునివరకు గలవారందరును.

చంపిన తర్వాత వీరికళేబరముల నేమిచేయవల

యుననునది, పెద్ద సమస్య మిగిలియుండెను. ఇంతవరకును అనుకూలముగానున్న విధి, యిప్పుడు మాత్రము తద్వ్యతిరేక మొల్లగును. లాణాకు నూరుగజములలో, గోతైన నీరులేని పాడునూయి యొకటి కాన్పించెను, ప్రజారోగ్యముకు భంగము కల్పింపకుండు నట్లుగా, యవమానింపబడిన యీసిపాయీల శరీరముల సీనూతియందు పూడ్చవచ్చును.

అదృష్టము కలసివచ్చునపు డొంటరిగా రాదు. ఆగష్టు 1 వ తేదీ మహమ్మదీయుల గొప్ప యుత్సవదినము, 'బక్రా-యీద్'. హిందూస్తానీ మునసల్మాను రాతుల కందరకును, యీనెపమున సెలవిచ్చి, అమృతసరములో తమ మహోత్సవములు చేసికొనుటకు బంపివేయబడిరి. వారు చూచుచుండగా, వారి స్వమతస్థులను, శిక్షించుటలో కొన్ని యిబ్బందు లుండగలవు. ఇప్పుడు క్రైస్తవు డొక్కడే, విశ్వాస పాత్రులైన శిక్కువీరుల సహాయముతో, యిచ్చటి కస్మకాండను నెరవేర్చవచ్చును. ఉదయ మయ్యెను. వేడుక చూచుటకై, యెవ్వరిని రాకుండ చేయుటకై, పట్టణము చుట్టును, కావలివారి నుంచిరి. ఉద్యోగులందరిని పిలిపించి, కూర్చుండబెట్టి, వారు చూడబోవు దృశ్యమును గూర్చి బోధించిరి.

పదులుగా విద్రోహులను పిలుచుచుండిరి. వారి
పేర్లను వరుసగా వ్రాయుచు, రెక్కలు విరచికట్టి, అంద
రను మరియొక పెద్దత్రాటికి కట్టి, కాల్చివేయుటకు తీసి
కొని పోవుచుండిరి. వీరిని కాల్చుటకై కొందఱు ది శిక్షు
లను తుపాకులతో సిద్ధముగా నుంచిరి. విద్రోహులను పిల
చుచుండిరి. విద్రోహులకు తమకేగతి కానున్నదో, తమనేర
ముల కేశిక్షణము ననుభవింపవలసి యున్నదో, దూరమున
నుండి భయంకరమగు తుపాకులమ్రోత వినబడుటతోడనే
వారికి వ్యక్తమయ్యెను. కాని వారి కనకాశ మెంతమాత్ర
మును యివ్వకుండగనే తుపాకిగుండ్లు వారిప్రాణములను
తీసివైచెను. పాపము! విద్రోహు లాశ్చర్యపడిరి; క్రోధా
వేశపరులైరి; నిరాశులైరి; పరమయోగులవలె సుఖదుః
ఖములచే వికారముపొందనట్టి శాంతముపహించిరి. ఆం
గ్లోశాజ్ఞను మేజస్ట్రేటు, పోలీసుస్టేషను నీడను కూర్చుండి
యుండెను. ఆతనిచుట్టును దేశీయోద్యోగులు: ఆజ్ఞానిర్వ
హణముచేయుచు వినీతులై సంచరించుచుండిరి. విద్రో
హులు గుంపులు గుంపులుగా, తమ మరణమునకై
యూపప్రక్కనుండియే తీసికొనిపోబడుచుండిరి. వారిలో
నొకగుంపువా రాతనినిశపించుచు, ఆతనుకూడ తమస్థితికే
శ్వరలో పోవునని కేకలువైచిరి. తర్వాత యువకులైన
శిక్షుసిపాయిాల గుంపును దాటిపోవుచు; రెక్కలువిరచి

కట్టబడియున్నను గంతులువైచుచు, శిక్షయుతము నవహా
నించి, గంగామాతపై నొట్టుపెట్టి, వారి నవమానపరి
చిరి. కాని వీరిని తెగటార్చుటకై యచ్చట నుంచబడిన
సిఖువీరులు గ్రుక్కుమిక్కనలేదు ఒక్కసారి కాబోలు
ప్రత్యుత్తరమీయబోయిరిగాని వెంటనే నోరుమూసికొను
ట కాజ్ఞాపించబడిరి. మరికొందర విద్రోహులు 'సాహిబ్'
కు కడసారివందనముచేయనిండని దయనీయముగా వేడు
కొనిరి.

"క్రమముగా నూటయేబదిమూడు విద్రోహులు
తుపాకిదెబ్బలకెరయైరి. హృదయవిదారకమగు నీదృశ్య
మును చూడజాలక, శిక్షకులాధులలో నొకడు మూర్ఛ
బోబడి స్మృతివిహీనుడై పోయెను. అధికవరులలో నాతడే,
కొంచెము వయోధికుడుగానుండెను. కొంచెముసేపు
విశ్రాంతియొసగబడినతర్వాత, తిరిగి కాల్పులు ప్రారంభిం
పబడెను. మరణసంఖ్య 237 వరకుచేరెను. మిగిలిన విద్రో
హులు బయటకు రా నిరాకరించుచున్నారని, డిప్యూటీ క
మీషనరుకు కబురువచ్చెను. వెంటనే సిబ్బందితో, నీ క్రైస్త
వుడు గుమ్మటమువద్దకుబోయెను. విద్రోహు లొక్కు
మ్మడి పైబడిపోరాడెదరనియు, ఒక్కరైనను తప్పించు
కొని పోరాదనియు తలచి, శిఖువీరులను తుపాకులతో
సిద్ధముగానుంచిరి. మెల్లగా తలుపులు తెరచిచూచిరి.

హృదయవిదారకదృశ్యము గాన్పించెను. హాల్వెలు వర్ణిం
చిన 'బ్లాక్ హోల్ ఆఫ్ కలకత్తా' తెలియకుండగనే యి
చ్చట పునఃప్రవృత్తమయ్యెను. కొద్దిగంటలను పూర్వమే
గదిలోనికి త్రోయబడిన నలుబదియెనుగురు విద్రోహు
లును, భయముచేతను, అలసటచేత, ఉక్కచేతను, గాలి
లేకపోవుటచేతను, క్రూరముగా యాతనబడి మరణించిరి.
రాత్రి వీరు దాహమనియు, గాలియనియు, అరచియుండి
రటగాని, గుర్రపురౌతుల కేకలలోను, పోలీసుల యడా
వుడిలోను, తహసీలుబంట్రోతులయు, ఉద్రిక్తులగు గ్రా
మస్థులయు గందరగోళములోను, యేమియు వినబడలేదు.
అంతయు కలకలముగాను, గోలగాను, గందరగోళముగా
ను యుండుటచే, యెవరును వారిదీనకరుణాలాపములను
సరకుగొనినవారు లేరు. వీరి కళేబరములను తలారులచే
బయటకీడ్పించిరి. కాల్చివేయబడిన విద్రోహులతో
పాటు, యీశరీరములనుగూడ ఆపాడునూతిలోనికి త్రోసి
వైచిరి.

కేవలము ఒక్క విద్రోహికి మాత్రమే పోరాట
ములో బాగుగా గాయములు తగిలియుండెను. ఆతను
కదలజాలనిస్థితియందుండుటచే నాతనిని కాల్చివేయుటకు
తీసికొనిపోవుటకైనను వీలుగలుగలేదు. అందుచే రాణి
గారిపక్షమున సాక్షిగానుంచుటకై, యాతనిచేతను కొంత

కాలము నిలుపుచేసి, తరువాత పట్టుబడి తీసికొనిరాబడిన నలుబదియొక్క విద్రోహులతోబాటుగా, అమృతసరము నుండి లాహోరుకు పంపించిరి. 'మియాన్ మీర్' లో విద్రోహేచ్ఛకలవారని తలంచబడిన పటాలములను నిలువబెట్టించి, వాటికండ్లముందుగా వీరినందరిని, ఫిరంగిముఖముల నుండి పేల్చివైచిరి. ఈవిధముగా 'అక్నాలా' హత్యాకాండ సూర్యోదయమున ప్రారంభింపబడి కొలదిగంటలలో ముగిసెను. నేరముజేసిరని తలంచబడిన 500 మంది మానవులు, న్యాయచట్టముపేరిట 48 గంటలలోనే దుర్మరణమునొందింపబడిరి. అచ్చట గుంపులుగూడిన గ్రామప్రజలకు, యీవిద్రోహుల నేరములనుగూర్చి బోధింపబడెను. వారందరును యీకార్యము న్యాయసమ్మతమేననియు, కాని యసంపూర్ణమనియు తలచిరి. ఎందుచేనన విద్రోహులతోబాటు దిక్కుమాలి పరుగిడివచ్చిన స్త్రీపురుష బాల శిశువృద్ధులపైబడి, యీక్రైస్తవ మేజస్ట్రేటు తన కసితీర్చుకొనలేదనియే. వారికి బ్రిటీషువారి ఓరిమి, శాంతము, దయ, న్యాయపరత్వము చాల యాశ్చర్యము గలుగజేసినవి."

పై విషయములన్నియును ప్రధానసూత్రధారియై నడిపించినవానిచేతనే రచింపబడినవని వినుటకు, మీకాశ్చర్యముగలుగకమానదు. ఒక్కయాంగ్లోశాక్సన్ క్రైస్త

వృషు, కొందరు యేషియావాసుల సహాయముతో నింతటి ఘనకార్యమును నెరవేర్చి, జ్ఞాపకార్హమైన యీదారుణ హత్యాకాండను బహుశాంతముగా పూర్తిజేసి, రక్తపాతమును, అనావసరయుద్ధప్రయాసము కలుగజేయకుండ బహుకుటిలనీతితో ప్రవర్తించి, యిట్టిఘనకార్యమును, అమానుషప్రతీకారమును, స్వహస్తముతో చిత్రించెననిన మీరు నమ్మజాలరు కాబోలు. కాని పంజాబు గవర్నరులు మనోవాక్కాయకర్మభిః, పూర్తియగు నాంగ్లేయులు. వారెట్టి కర్తవ్యకార్యమునైనను నెరవేర్చుటకు వెనుదీయరు. తమ తాబేదారులుకూడ కర్తవ్యనిర్వహణమందు పూర్తిగా నిగ్రహముచూపవలెనని గోరెదరు అట్టి కర్తవ్యపరాయణులను శ్లాఘింతురు. బహూకరింతురు. ఇంగ్లాండు తన పుత్రులెన్నడును కర్తవ్యవిముఖులగుటను సహింపదను మాట వారుపూర్తిగా యెరుంగుదురు. చేసిననేరమా విద్రోహము; వారిహస్తములు హత్యాకళంకితములు గాకపోవచ్చును. చట్టము న్యాయమునే వాంఛించును. చట్టనిర్ణీతమగు శిక్షమరణమే !

అప్పటి రాజకీయ పరిస్థితులు కూడ కూడ రిట్టి దారుణశిక్షలను వెంటనే యమలు జరుపునట్లు చేసెను. 'నికల్‌సన్' ఢిల్లీకి సైన్యసమేతుడై వచ్చుచు లూధియానావద్ద నుండెను. ఈ సంగతు లన్నియు విద్రోహులకు,

చాటింపబడినట్లుగా తెలిసి యుండెను. విప్లవము ప్రారంభించి మూడుమాసములై యున్నను, ఢిల్లీ బ్రిటీషువారికింకను లోబడియుండలేదు. పరిస్థితు లన్నియు బహుక్లిష్టముగాను, ప్రమాదకరముగాను యుండెను. డోబ్‌లో 7½ పటాలములు నిరాయుధులుగా జేయబడి యుండిరి. మరి రెండు హిందూస్థానీ irregular పటాలములు సాయుధములు, సందేహాస్పదమగు ప్రవర్తన గలదై యుండెను. అట్టి యననుకూలపరిస్థితు లెవ్వాడును తటస్థించియుండలేదు. ముందు యుండగలదో యనుదాని కాలమే కాని, నిర్ణయించుట కెవ్వరును సమర్థులు కారు. ఇట్టి సమయమున సుశిక్షితులైన 320 మంది సిపాయీలను, సాహసులను పట్టుకొని, సేదదీర్చి, సురక్షితముగా మరి యొకచోటకి పంపగలుగుట చాల సందేహాస్పదము. వారిని ఖైదీలుగా నుంచుటకూడ చాల ప్రమాదకరమైన విషయము. అమృతసరములో నిరాయుధులుగా చేయబడి, చెదరగొట్టబడిన 'పూరబ్' పటాలములు, వీరిని స్వతంత్రులనుగా జేయుట కేనిముషమునైనను ప్రయత్నింపవచ్చును. కాక వీరిని సంపుటలోనే చాల ప్రమాదకరమగు పరిస్థితు లేర్పడగలవు. డోబ్ యొక్కయు, ప్రజల యొక్కయు మనఃప్రవృత్తిని, బ్రిటీషువారు సరిగానే యంచనా వేసికొనిరి. ఎందుచేతనన, యీ సిపాయీలను యి

హాలోకమునుండి తుడిచివైచిన తర్వాత యచ్చటి దేశ
ము పటాలములలోను, చెదరగొట్టబడినవానిలోను ఏ విప్లవ
చిహ్నము లేమియు కాన్పింపలేదు. ఈ 26-వ నేటీవు
యిన్‌ఫాంట్రీ సిపాయీలు తప్పించుకొని పోగలిగినగాని.
వారి శిక్ష విధింపబడినంతకంటె యాలస్యముగా గాని, సు
లభముగా గాని యున్నయెడల, అచ్చటి పటాలము
లన్నియు, వీరి ననుసరించి యుండెడివే. అన్ని దేశీయ
పటాలములును యెదురు తిరిగి, కార్యరంగమున నునికి
యున్నచో జరిగియుండెడి ఫలితమును గూర్చి తలంచుట
నిష్ఫలము; కాని సులభముగా నూహింపదగినదే గదా!
దాని వినాశనమే, వేలకొలది మానవులను మహాప్రళయ
మునుండి రక్షించి యున్నది. ఈ విషయమునుగూర్చి చే
సిన ప్రకటనలో 'ఛీఫ్ కమీషనరు' యిట్లు వ్రాసియున్నా
డు: "అసాధారణమై, సంక్షిప్తమైన యీ శిక్ష, మిగిలిన
వారికి తగు నుదాహరణముగా నుండగలదు. క్రూరమైన
ట్టియు, అకారణహత్యలచే కళంకితమైనట్టియు వంగసిపా
యీల నామము, యీ శిక్షలను చూచియైనను బుద్ధి తె
చ్చుకొనునని తలంచెదను."

తప్పించుకొని పారిపోయిన దురదృష్టవంతులను
కూడ యీ గతియే పట్టెను. అత్యంత సాహసికుడగు మే
జరు 'జాల్ సన్' కొంతమంది సైనికులతో వారిని వెంబ

డించెను. అతివేగముగా తన యనుచరవర్గమును దాటి పోయి, పరుగిడిపోయిన విప్లవకారులలో నలుబదిమందిని యెదిరించెను. అందులో చాలమందిని గాయపరచియు, కొందరిని జంపియు చాల ధైర్యముగా పోరాడెను. కాని పోరాటము జరిగిన ప్రదేశము చిత్తడినేల యగుటచే విద్రోహులచే గాయపరుపబడెను. విద్రోహులు నిరాశులై ముందుకు మధుపూర్ మీదుగా పరుగిడిపోయిరి. మధుపూర్ ప్రజలు రాజభక్తియుతులుగానే యుండిరి. అచ్చట గార్బెట్, హాన్నా లిద్దరును విద్రోహుల నెదిరించి యనేక సాహసకృత్యములను జేసిరి. ప్రభుత్వమువల్ల తమసాహసకృత్యములకై యనేక బహూకృతులనందిరి. విద్రోహులలో మిగిలిన కొద్దిమందినికూడ బట్టుకొని, తీసికొనివచ్చి, కాల్చిచంపివేసిరి. 'కాన్పూరులో' నొక నూయిగలదు; కాని 'అజ్నాలా' లో కూడ మరియొక నూయి యున్నదిసుమీ !"

ఈక్రిందియుత్తరములను చూచినచో పంజాబులోని యుద్యోగులందరును, పైయధికారుల ప్రోత్సాహమును, బహూకరణమును లేవిదే, యేపనిని చేయరని తెలియగలము. మేజస్ట్రేటు మహాశయుని కాఘునకార్యము నెరవేర్చిన మరునటిదినముననే, పైయధికారులనుండి యభినందనపత్రములు వచ్చిచేరెను. అందులో మొదటిది,

ఛీఫ్ కమీషనరు సర్ జాన్ లారెన్సు కె. సి. బి. వద్దనుండి; రెండవది, వానితరువాతి పెద్దయధికారినుండి. ఈజాబులు వ్రాసినవారి గుణవిశేషములు తెల్పునవియేగాక వారి గౌరవమునకు కళంకముగల్గించునవియై యున్నవి. పంజాబులో బ్రిటీషుగవర్న మెంటు జయప్రదముగా కొనసాగుటనుగూర్చి యాశ్చర్యపడుచున్నవారికి సంశయవిచ్ఛేదమొనరింపగలవు

Demi official from Sir john Lawrence K. C. B. Chief commissioner for The Punjab;

లాహోరు, 2-వ ఆగస్టు 1857.

ప్రేమపాత్రుడగు కూపరునకు—

26-వ నేటివ్ప్రదాతిపటాలము విషయములో నీవు పొందిన విజయమునకు అభినందనములు. నీవును, నీపోలీసులును తెలివితేటలతోను, ధైర్యముతోను బనిచేసినందులకై, మీరు ప్రభుత్వమునకు బహూకరణపాత్రులగుదురు. ఈవిద్రోహులగతినిచూచియైనను, మిగిలినవారికి బుద్ధివచ్చునని నమ్ముచున్నాను. ఇంకను యసంఖ్యాకులుగానున్న విద్రోహులను నిర్మూలనముచేయుటకు సాధ్యమైనంతవరకు ప్రయత్నించుము.

బహుమానముల పంపకమును, రాబర్ట్సు, నీకే వదలిపెట్టునని విశ్వసించుచున్నాను. వారివారి యర్హత

లనుబట్టి తగుబహుమానములు ప్రతివానికిని ముట్టునట్లు చూడుము. ఎవరి కేవితగునో యది వారికే యియ్య వలయును.

Yours sincerely,
(Sd.) John Lawrence.

Frederick Cooper Esq. D. C.
Umritsar.

---

Demi official from Robert Montgomery Esq.
Judicial commissioner for The Punjab,
Sunday 9 A. M.

ప్రేమపాత్రుడగు కూపరునకు —

నీవుచేసిన పనికి, గౌరవమంతయు నీకే చెందగలదు. ఈకార్యమును, నీవుచేయుటః మేలైయైనది. తొందరబాటుగాని, ఆలస్యముగాని, వెనుదీయుటగాని నీవద్దలేదు. నీ జీవితకాలమంతకును యీఘనకార్యము నీకు శిరోభూషణమై యుండగలదు.

గాయములుతగిలి పడియున్నవానివలన రాబట్టవలసిన విషయములేవియు మిగల్చవలదు. విషయసంగ్రహణముజేసి వానిని లాహోరునకు బంపుడు. అచ్చట జరిగినకార్యముల నీతనిముఖతః ప్రజలు విందురుగాక, అట్లైనగాని వారికి పూర్తిగా నమ్మకముండదు.

కై స్వప్రభుత్వనిర్మాణతత్త్వము

అఫీషియల్ రిపోర్టును వ్రాసి, వివరములతో సహా రికార్డులోనుంచుము. ఇందులో బాగుగా పనిచేసినవారి నందరను ముందుకు తీసికొనిరమ్ము. సర్వమును బహు నేర్పుగా నెరవేర్పుము. అనగా మధ్యతరగతి, ఉత్తమ తరగతి, ఉత్తమోత్తమతరగతి వ్యక్తులలో తగుకీర్తిని బహూకరించవలయును.

Prima facic గా తహసీలుదారు ఉత్తమబహుమానార్హుడని నాయుద్దేశ్యము. పడవలను తెమ్ముటలో వాచ్యమైన సందేహించిరా? లేదా? ఆతహసీలులోని ప్రజలకు, 26-వ దేశీయ పదాతిపటాలపు సిపాయీలు తప్పించుకొనిపోయినట్లు తెలియునా? లేక వారినిచూచిన తర్వాతనే గ్రహించిరా?

అందరకును బహుమానము లిచ్చుటకై, నీకు పుష్కలముగా డబ్బుపంపెదము. తలవరులుగా పనిజేసిన సిక్కులకు మంచిమొత్తములను ముట్టజెప్పుము.

నీజయమునుగూర్చి నాహృదయపూర్వక అభినందనములు. ఇటునటుతప్పించుకొని పారిపోయినవారెందరు? వారినందరినీ యేరివేయవలసినది. దొరకినవారినందరను యిక్కడకే పంపివేయుము. నీకు తగినంత కసాయిపని లభించినది. చాలును, ఇక్కడ పటాలములకు మెచ్చు

చూపించవలసియున్నది. అంతేగాక సాక్ష్యమునకును పనికి రాగలరు. కాన దొరకినవారిని తప్పక పంపుము.

Belive me, yours sincerely,
(Sd) R. Mont gomery.

F. కూపర్ Ssq. D. C

P S ఇచ్చుటనున్న మూడు పటాలములును, నిన్నను చాల ఆందోళనకరముగానుండెను. కాని, వారిప్పుడేమీ కిక్కురుమనరు. వాళ్లు బయటపడితేనే బాగుండును. ఎందుచేనన వాళ్లు చాలయిబ్బందికలుగ జేయుచున్నారు. అట్లయినచో వారిలో ఒక్కడుకూడ బ్రతికిపోజాలడు.

(Sd) R. Mont gomery,

లార్డు కానింగు, ఆరోజులలో గవర్నరు జనరలుగా నుండెను. మంచిరిపోర్టులు, చెడ్డరిపోర్టులుకూడ యతనిని కలతనొందించుచున్నను, న్యాయమునే చేయుటకు ప్రయత్నించుచుండెడివాడు. ఆతడు యీప్రకరణమందు జెప్పబడియున్న 'టూకీ' యైన శిక్షణావిధానమును తీవ్రముగా ఖండించెను.

'The Crisis in the Punjab.' లోనే యిట్టి జుగుప్సాకరములైన కార్యము లనేకము లభివర్ణింపబడియున్నవి. మరియొకదాని నీక్రింద పొందుపరచెను.

హిందూదేశము:

"గత ప్రకరణములలో, 'మీరాన్‌మీరా' లో దేశీయు పదాతిపటాలములను నిరాయుధులుగా జేయునపుడు, H. M. 81-వ పటాలములోని 300 సైనికులయు, H. E. I. C. S. ఫిరంగులలోని 12 గురు యూరోపియనులయు, స్థాననిర్దేశమును చిత్రించి యున్నాము. ఈప్రక్క వ్రాయబడినపటము, మరియొక యద్భుతావహమైన దృశ్యమును జూపగలదు. బ్రిటీషు గవర్నమెంటు, మృత్యువును తెచ్చిపెట్టునని, ఉదాహరణరూపముగా చూపగలదు. 51-వ పటాలములోని సుబేదారు మేజరును పట్టుకొని యురి తీసిరి. చనిపోవువరకును, ఆతడు తాను సంవత్సరమునుండియు విద్రోహిగానే యుంటిననియు, బ్రిటీషు గవర్నమెంటున కంత్యకాలము వచ్చియున్నదనియు, ప్రగల్భములు పలుకుచునే యుండెను. ఈతని శరీరముపై 900 రూప్యములు కనుగొనబడెను. ఆతడు, యీధనము నేమిచేయుదురని యడిగెను. ఆ యడుగుటలో నాతని యుద్దేశ్యము, తన యంతిమకోరిక నెరవేర్పబడుననియు, అందులకై తనకు మిగిలియున్న సన్నిహితు లెవ్వరున్నారనియును, యాలోచించుచుండి యుండును! కాని యాతని యూహాలు వ్యర్థములు!! తను వ్రేలాడబోవు యురికంబములకై యగు ఖర్చులకై 84 రూప్యములను మినహాయించి, మిగిలినదానిని ప్రభుత్వము వశపరచుకొను

సని, యాతనికి తెలియజేసిరి!!! ఈత డురికీయబడిన రెం
డురోజులలో తర్వాత పటాలము లన్నిటిని, 'పెరేడ్' లో
నిలువబెట్టి, యీతని యనుచరులు పద్రెండుగురును వరు
సగా, యురికంబములపై వ్రేలాడదీయించిరి. తర్వాత
40 మంది విప్లవకారులను, భయంకరముగా ఫిరంగుల
నుండి కాల్చివైచిరి. బహు శాంతిప్రియులైన యూంగ్లే
యులు, యురిస్తంభములను చూచి, పరిస్థితులను గ్రహిం
పగలరు. అంతేగాక దురదృష్టవంతులైన యూ నలుబది
మంది విద్రోహులును, తమ దుర్గతికి తీసికొనిపోబడునపు
డు, వారి మనోవృత్తి యెట్లుండునో కూడ తెలిసికొన
లేకపోరు. వీరిలో యాఖరిగుంపును, వారికి గౌరవప్రద
మైన శిక్షణాస్థానముకు, స్మృతివిహీనులై యుండగా,
యీడ్చి తీసికొనిపోవలసి వచ్చెను. (191 పేజీ యందలి
పటము చూడుడు) విమర్శనాదృష్టితో చూచిన, విప్లవ
కారులకు తప్పించుకొనిపోవు నవకాశము లేశమైనను లే
కుండ బహు కట్టుదిట్టమైన యేర్పాటు లేవిధముగ చేసిన
దియు తెలియగలదు. 'రిచ్' యను పార్లమెంటు మెంబ
రొకడు, ఫిరంగులనుండి కాల్చబడిన విద్రోహులను గూ
ర్చిన వివరములను తెలుపవలసినదిగా తీర్మానమును తెచ్చె
ను! గాని దానిని 'సెకండు' చేసినవారే పార్లమెంటులో
లేకపోయిరి!! ఆరోజులలో అమలులోనుంచిన బహు

హిందూదేశము:

నిష్కారణముల్తైన చట్టములనుగూర్చి, వాటినమలులో పెట్టుటలో ప్రథముడగు 'జనరల్ డాటన్' ను యడిగి యున్నచో, బహుసంతోషముగా సమస్తవివరములను, యిచ్చియుండెడివాడు! వీటిని యేకరువు పెట్టుటకు కంఠము రుద్ధమై, కన్నులలో బాష్పములు గ్రమ్మనంతటి, జాలి హృదయమును, సున్నితమగు స్వభావమునుగలవాడు, గాడాతడు!!

ఈగ్రంథకర్త, మీాపుస్తకములోను, తన యితర గ్రంథములలోను, 'క్రిస్టియన్' యను మాటను, యీాస్టిండియా కంపెనీ సేవకులకును, వారిప్రభుత్వమునకును, యేల నుపయోగించెనో చెప్పుట, అప్రస్తుతముగాదని తలంచెదను. 'The Crisis in the Punjab' వ్రాసిన ఫ్రెడరిక్ కూపర్, తనగ్రంథపీఠికలో యిట్లు వ్రాసియున్నాడు.

"కలకత్తానుండి ఢిల్లీవరకును, విప్లవమును, రాజద్రోహమును వ్యాపించియుండెను. సిపాయీాసైన్యములు తమశక్తియందు ప్రబలవిశ్వాసముగలిగి, మత్తెక్కియుండెను. ప్రతిహృదయమును, యీాసువిశాలదేశమందు వ్యాప్తమైయున్న క్రైస్తవులకొరకై, పరితాపమునొందుచుండెను, గాని యాశమాత్రము యెవ్వరికిని లేకుండెను."
Page xiv.

పీఠికను ముగించుచు, యిట్లు వ్రాసెను.

"పాటియాల, ఝుండి, బికనీరు, రాజులగౌరవమందును, రాజభక్తియందును, మనముంచిన విశ్వాసమెంతయు క్తముగానున్నదియు, యీగ్రంథములో చూడగలరు. పంజాబు గవర్నమెంటు, యిట్టి పరీక్షాసమయములో, గొప్ప రాజనీతిసూత్రము నాధారముగా జేసికొని, నిర్వర్తించిన ఘనకార్యములు యెప్పటికిని ప్రపంచములో తెలివితేటలకును, స్వార్థత్యాగసాహసములకును, జ్ఞాపకచిహ్నములుగా యుండగలవని చాటుటయే, యీగ్రంథము వ్రాయుటలో నాయుద్దేశ్యము. కాని యీ తెలివియు, సాహసమును, క్రైస్తవమతమునకై సర్వశక్తియుతుడగు నాపరమప్రభువు, ప్రత్యక్షముగాను, ఆశ్చర్యావహముగాను, యొనరించిన సహాయము ముందు, వట్టిపనికిమాలిన పదార్థములై పోయినవి." పేజీ xvi.

ఫ్రెడరిక్ కూపర్ తనగ్రంథము నీక్రింది వాక్యములతో ముగించియున్నాడు:

"ఈసిపాయిల విప్లవము జరగుచున్న కాలములో యూరోపంతయు గ్రేటుబ్రిటన్ యొక్క పరిపూర్ణవినాశనము నూహించుచు, కపట కుత్సిత మందహాసముతో చూచుచుండెను. కాని గ్రేటుబ్రిటన్ యొక్క సుస్మరణీయ మహావిజయమును సూచించు పురోవాచకము పిదరకే, హిందూదేశములో 'యిస్లాము' రాజ్యపతనమును దుందుభి

హిందూదేశము:

ధ్వానముతో చాటించివైచెను. శకునములయందు నమ్మకమున్నవారు ఢిల్లీలోని క్రైస్తవచర్చి మీదిబంగారు ‘క్రాసును’ చూడుడు! ఆకాశములో నిదియొక్కటే ధగద్ధగాయమానమై, తేరిచూడ నశక్యమై, మానవమాత్రునిచే తాకబడకయే యున్నది! ప్రపంచమం దేకైకసత్యమగు క్రైస్తవమతమందు విశ్వాసములేని మూర్ఖపుమూకయొక్క తుపాకి గుండుదెబ్బలకు ‘క్రాస్’ నిలచియున్న గోళము తూట్లుపడిపోయినను, క్రాసుమాత్రము తునుకలుగావింపబడిన గోళముపై, సగర్వముగా నిలువబడియున్నది చూడుడు!! పేజీ 246.

# సమాప్తి

బ్రిటీషు గవర్నమెంటు, తమప్రభుత్వము యిండి యాలో శాశ్వతముగానుండుటకై, యవలంబించిన కొన్ని విధానములను సూచించియుంటిమి. ఇంగ్లాండునందలి 'క్రిస్టియన్' ప్రజల ముఖ్యాశయము, భారతదేశమందలి 'హీథెన్' ప్రజల మనోతత్త్వమును పూర్తిగా మార్చ వలయుననియే. భారతీయులను 'కుక్క-బుద్ధి' (Canine mentality) గల వారినిగా జేయుటకు, బ్రిటీషువారు బహుప్రయాసపడిరి. అందుచే 'కుక్క-బుద్ధి' యననేమియో కొంచెము చెప్పవలసియున్నది.

కుక్క, మనుజునియందు చాల విశ్వాసముగల జంతువు. అంతేగాక చాల యుపయోగకరమును యగు చున్నది. పాశ్చాత్యదేశములలోని బుద్ధిమంతులగు క్రి స్టవగ్రంథకర్తలు కొందరు, కుక్క, మనుష్యుని తనకు దైవముగా చూచుకొనుననియు, అందుచేతనే విశ్వాసము గలిగియుండుననియు, నిస్సంకోచముగా వ్రాసియున్నారు. కాని మనుష్యునియందింత విశ్వాసముగల శునకము, తన జాతిజంతువులతో నెట్లుప్రవర్తించును? ఎందులకు, ఒక కుక్క, మరియొకదానిని చూచుటకే సహింపదు. 'కుక్క-

లు చింపినవి స్తరి' యనునది మనకు మాత్రము క్రొత్తయా?

శునకమునకు దైవము మనుష్యుడే. ఈయూహను మనమునందుంచుకొనియే, 'సర్ వీ పెల్ గ్రిఫిన్' అతిసాహసముతో నిట్లు బలికినాడు. "మనము (ఆంగ్లేయులు) భారతీయులకు ఈశ్వరస్థానమునందున్నాము."

భారతీయులయందు శునకత్వమును వృద్ధిబొందించుటకై, వారిమనస్సులను తగువిధమున మార్చుటకు తగుయత్నములను చేయసాగిరి. అదేవిధమున కొనసాగించినదియు, యీ క్రింది విషయములను చూచినవారికి తెలియకపోదు.

లార్డు బెంటిక్, పందొమ్మిదవశతాబ్ద ప్రారంభమున మద్రాసునకు గవర్నరుగానుండెను. తన కౌన్సిలర్లలో నొకడైన 'విలియమ్ థాకరీ' చేత నాతడొక 'మినిట్' వ్రాయించెను. అందులో యిట్లున్నది.

"ఇంగ్లాండులో భూములవల్ల వచ్చురాబడిలో చాలభాగము కొన్నికుటుంబములకు ప్రత్యేకింపబడుచున్నది; సినేటర్లను, తత్త్వశాస్త్రజ్ఞులను, రాజనీతివేత్తలను, ప్రభుత్వమును సేవించుచు, రక్షించుచుండుటకు వీరులను తయారుచేయుట కీపద్ధతి, మిక్కిలి యనుసరణీయమైయున్నది. గొప్పధనమును గలిగియుండుటవల్ల ప్రజలలో స్వాతంత్ర్యకాంక్ష, దూరాలోచన, అహంకారము, ప్రబ

లుచుండుటకలేదు. దీనిని యింకీయాలో కలుగనీయరాదు. ఎందువల్లనన మనప్రభుత్వమునకును, స్వప్రయోజనమునకును, యిందువల్ల నపాయము ఘటించవచ్చును.''*

అర్థశాస్త్రజ్ఞుడ ననుకొను 'సర్ జార్జి కాంప్బెల్' పంజాబు నాక్రమించుకొనవలసినదిగా సలహా నిచ్చుచు, లార్డు డల్ హౌసీ కిట్లు వ్రాసియున్నాడు:

''ఆక్రమణలకై ప్రజల సమ్మతి గోనచూడకుడు. అంతకంటె తెలివిగలట్టియు. కార్యసాధక మగునట్టియు మార్గము ననుసరింపుడు. వాస్తవమునకు కొన్నిహక్కులు కలిగియున్నట్టి దేశీయప్రభువర్గము, సిక్కునాయకులు, జాగీరులున్న గురువులు, సోడీలు, ముల్లాలు మొదలగు వారి మాట యందురా, వారి నందరను సాధ్యమగునంత వరకు, అణగద్రొక్కి యుంచుము. యూరోపియనులకు, ధనవంతులై, సుఖతృప్తులైన ప్రభువర్గ ముండుట సమ్మతమే. కాని మనము, ఆసియాలో పరిపాలకులముగా నుండగోరుచో, యచ్చటి ప్రభువర్గమును, నిరంకుశులను నిర్మూలించవలయును.........అటువంటివారి నందరను జీవనాధారమునకు సరిపోవు రాబడి గలవారినిగా చేయవలయును ఆమాత్రమైనను యుండనిచ్చు టెందులకనిన,

---

* Rise of the Christian Power in India, 4 వాల్యూం 448 పేజీ చూడుడు.

వారు నిరాశులై తెగువబూనునట్లు చేయుట, మనకే యు పాయకరమగును. ఎంతయుంచిన, మనకును, వారికిని గూడ క్షేమకరమో, అంతియమాత్రము వారికడ నుండ నీవచ్చును." *

పంజాబులో బ్రిటీషువారి నడుగుబెట్టనీయక తరిమి వైచిన, ధైర్యశాలులగు శిక్కులను, సింగు (సింహము) లని పిలుచుచుండిరి. పంజాబును స్వాధీనము చేసికొనిన తర్వాత యీ సింగులయందలి 'సింహత్వమును' నిర్మూ లించుటకు తగుచర్యలు తీసికొనిరి. ఈ కార్యమునందు, వారు కృతార్థు లెట్లయినదియు, 'Rise of the Christian Power in India' 5 వాల్యూము 377-379 పేజీలు చూచినవారికి తెలియగలదు.

మొదటి వైస్రాయిలు అయిదుగురును, కానింగు, ఎల్జిన్, లారెన్సు, మేయో, నార్తుబ్రూక్ ప్రభువులు, యింతవరకు చెప్పిన పద్ధతుల ననుసరించియే, క్రైస్తవప్ర భుత్వమును యిండియాయందు శాశ్వతముగా నుంచు యే ర్పాటులను జేసిరి. వీరిలో సర్ జాన్ లారెన్సు (తర్వాత లార్డుగా చేయబడెను) సుప్రసిద్ధుడు. ఆంగ్లో యిండియన్ బురాక్రాటుగా తయారుచేయబడిన యీతడు 'డల్ హౌసీ'

* Rise of the Christian Power inIndia 5 వాల్యూం 269 పేజీ చూడుడు.

కి శిష్యవర్గములో చేర్పదగినవాడు. పంజాబును విప్లవములో చేరకుండ జేసి, యిండియాలో, బ్రిటీషుప్రభుత్వము స్థిరమగుటలో చాల తోడ్పడెను. ఈ సిద్ధహస్తుడు వైస్రాయిగా నున్నపుడే, ఒరిస్సాలో మహాక్షామము చెలరేగి, లక్షలకొలది మానవులను మ్రింగివైచెను. విప్లవము నణచుటలో, యాతడవలంబించిన క్రూరవిధానమువలననే, యీ కరవు కలుగుటకు కారణము లేర్పడెను. అప్పటినుండియే యిండియాలో క్షామము లధికమయ్యెను. హిందూదేశముయొక్క 'సహజసంపదల నభివృద్ధిపరచు పద్ధతుల' వలననే ప్రత్యక్షముగానో, పరోక్షముగానో, యీ కరవులు గలుగుచున్నవని, చాలమంది యభిప్రాయపడుచున్నారు. దాపరిక మెందులకు, యీ యాంగ్లపరిపాలనావిధానములో 'సహజసంపదల నభివృద్ధిచేయుట' యనిన, సాధ్యమైనన్నివిధముల, సాధ్యమైనంతవరకు, వాటిని దోచుకొనిపోవుటయే యని యర్థము. (హిందూదేశములోనే సుడీ).

దేశమునంతను మలేరియా జ్వరదేవత పట్టి పీడించ నారంభించెను. ఇందుల కనేక కారణములు గలవు. వాటిలో నొకటి, ప్రజలలో రోగనిరోధకశక్తి తగ్గిపోయెను. అందుచే నతిసులభముగా నీరోగమువాత బడుచుండిరి.

---

# విశ్వసాహిత్యమాలా

ప్రధానపోషకులు.

మహారాజశ్రీ శ్రీ చెలికాని వెంకటరమణమూర్తిగారు,
మేనేజరు, దేవస్థానం. అ॥ అన్నవరం.

పోషకులు,

,, నిట్టల శ్రీరామకృష్ణమూర్తిగారు,
తానేలంక.

,, ఖండవిల్లి సుబ్బారాయుడుగారు, ముంగండ.

,, గోవిందవఝ్ఝుల వెంకట్రామశర్మగారు,
ముంగిండ.

,, పెయ్యల లక్ష్మీనృసింహసోమయాజిగారు,
ముంగండ.

,, పళ్ల పెరుమాళ్లుగారు, తానేలంక.

,, సోమయాజుల రామనాథంగారు,
ఇసుకపూడి.

,, చేడ మంగయ్యావంతులుగారు, తొండంగి.

,, వడలి జోగయ్యశాస్త్రిగారు, గంగలకుర్రు.

,, బాలాంత్రపు వెంకట్రావుగారు,
పెట్రోల్ డిపో సూపరింటెండెంటు,
హైద్రాబాదు.

మహారాజశ్రీ రోళ్ల సీతారామస్వామిగారు, కాకినాడ.

,, శ్రీ దువ్వూరి వెంకటపతిసోమయాజులుగా
Son of Jabdatul, Yakaran, Sri ]
Suryanarayana Somayajulu gar
Baphiat, Bashand, Zamindar,
Mukkamala, గంగలకుర్ర

సహాయులు.

మహారాజశ్రీ మంత్రవాది సుబ్బారాయుడుగారు,
ముంగండ

,, కురసాల గానులుగారు, పంచాయతీబోర్డ
ప్రెసిడెంటు, ఇనుకపూడి

,, డాక్టరు, పెద్దాడ రామమూర్తిగారు,
అమలాపురం

,, వాడ్రేవు జగ్గరాజుగారు, గంగలకుర్రు.

మా గ్రంథమాల ద్వితీయపుష్పము సకాలములో వెలువడుటకు సహాయమొనరించిన ఉదారులైన మిత్రవరు లందరకు మా యభివందనములు.

సంపాదకుడు.

# విశ్వసాహిత్యమాలా

ఇంతచౌకలో ఉత్తమోత్తమగ్రంథాలు ప్రకటించడానికి సాహసించిన గ్రంథమాల— ఒక్క-ఆంధ్రదేశానికే గాదు—హిందూదేశానికంతటికే ఇది ఒక్కటే!

600 పుటలు.] [పోస్టేజీతో రు 1-4-0.

* * * *

# నియమాలు

౧. ప్రతిమనిషికీ—దేశంకీ—జాతికీ—విజ్ఞానం సంస్కారం కలిగించే పుస్తకాలే వరి కూరుస్తాము.

వివిధదేశాల సాంఘిక—ఆర్థిక—రాజకీయ చరిత్రలు—మహాపురుషుల జీవితచరిత్రలు—వివిధరాజ్యాంగతత్త్వాల్ని గురించిన గ్రంథాలు—తేటతెలుగులో ప్రకటించుతాము.

౨. చందాదార్లకి ప్రవేశరుసుములేదు.

వారు సంవత్సరం చందా అంతా (రూపాయి నాలుగణాలు) మొదటనే చెల్లించివేయాలి.

వి. పి. లు చేయజాలము.

చందాదారులకి పోస్టేజీతో ౧-౮-౦ లకే వచ్చేడి గ్రంథాలు ఇతరులకి పోస్టేజీకాకుండా ౧-౬-౦ లు అవు

తాయి. మేము అప్పుడప్పుడు ప్రచురించే అనుబంధగ్రంథాలు మాచందాదార్లకే లభ్యం అవుతాయి. అదైనా ఉచితంగా! ఇంతకంటె ఏంకావాలి?

త్వరపడి చందాదారులుగా చేరండి.

* * *

విశ్వసాహిత్యమాలా బుక్ డిపో.

మా గ్రాహకుల సౌకర్యంకొరకై మేమొకపుస్తక విక్రయశాలను తెరచినాము. దానికనుబంధముగా ఒక ప్రదర్శనశాలకూడ తెరచినాము. వివిధప్రాంతములలోని ఆధునికాంధ్రకవుల గ్రంథాలన్నీ ఒకేచోట ప్రదర్శించడంలోగల ఉపయోగం అధికం. నేడు పల్లెటూళ్లలో తెరువబడుతూవున్న గ్రంథాలయాలు—ఆధునికాంధ్రసాహిత్యం అంతా ఒక్కచోట దొరకకుండడంచేతను, పోస్టేజీ ఖర్చులు అసలును మించిపోతూవుండడంచేతను, పుస్తకాల మంచిచెడ్డలు తెలియకపోవడంచేతను పురాతనగ్రంథాలతోటే అర్థసంతృప్తిపడి యూరకుంటూవున్నాయి. గ్రంథకర్తలకు తగుప్రోత్సాహ మీకారణంచేతనే కలగడంలేదు.

అట్టివారల సౌకర్యముకొఱకై మేమీ "బుక్ డిపో" ను, ప్రదర్శనశాలను తెరచినాము. ఆంధ్రమహాజను లీరెంటివలన ఉపయోగమునందుదురుగాక.

మావిక్రయశాలకు గ్రంథాలు పంపించడముతో గ్రంథకర్తలు గమనించవలసిన విషయాలు రెండు.

౧. మాకు విక్రయానికిబంపే ప్రతిపుస్తకానికి ఒక ప్రతి ఉచితంగా మా ప్రదర్శనశాల కియ్యాలి.

౨. విక్రయసౌకర్యం కోసం ప్రతిగ్రంథము 12 ప్రతులకి తక్కువకాకుండా మా కార్యాలయానికి పంపించాలి. ప్రదర్శనశాలకి ప్రతి పంపనిదే గ్రంథకర్తలకు మేము సహాయము చేయజాలము.

ఈనిబంధనలకి లోబడి పుస్తకాలు పంపించేవారి పుస్తకాలని మాగ్రంథాలలోను—విడిగానుకూడ ప్రకటించి విక్రయించుతాము. ప్రతి ఆరునెలలకీ ఒక్కొక్కమారు విక్రయధనము 1/3 కమీషన్ మినహాయించుకొని పంపుతూ ఉంటాము. ప్రదర్శనశాలఖర్చులకే కమీషన్ తీసుకోబడుతూంది ! ప్రతిపల్లెటూరికి ప్రదర్శనము నకై గ్రంథములు తీసుకొనిపోవుట మాప్రదర్శనశాల (సంచార) ఉద్దేశ్యము ! !

పత్రికాసంపాదకు లొక్కొక్కప్రతి బంపుచో వానిని మాప్రదర్శనశాలలో ప్రదర్శించి ఉచితముగా ప్రదర్శించెదము. కాని వారు సంవత్సరమునకు 3 మారులు తమపత్రికలలో మాప్రకటన వేసుకోవలసియుంటుంది.